జూన్ 2013
రూ. 12/-

# చతుర



# మాసపత్రికలేగానీ మూసపత్రికలు కావు!



'ఈ ఉషాకిరణాలు తిమిర సంహరణాలు'. ఇది నిజం. 'ఈనాడు' సముదాయం నుండి ఏ అక్షరం వచ్చినా అది తిమిర సంహరణమే. ఒక ఆలోచన, ఒక విధానం, ఒక క్రమం, ఒక క్రమశిక్షణ, అంకితభావం అడుగడుగునా కంటికి కనిపించే సత్యాలు. తెలుగు నవలా రచయితలను ప్రోత్సహించాలనే సదుద్దేశంతో 'చతుర' మాసపత్రిక వస్తోంది. పత్రికలు పాటించాల్సిన నైతిక సూత్రాలను పాటిస్తున్న ఉన్నతశ్రేణికి చెందిన పత్రిక ఇది. ఆర్. కె. నారాయణ్, జయకాంతన్‌లాంటి గొప్ప రచయితల అనువాద నవలల్ని కూడా చతురలో ప్రచురిస్తుండటం గమనార్హం.

విపులకు ఓ ప్రత్యేకత ఉంది. ఏ దేశం ఎట్లా ఉందో, అక్కడి సమాజం, వ్యవస్థ, జనజీవనం, వాళ్ల సమస్యలు, బంధాలు, అనుబంధాలు తెలుసుకోవాలన్న జిజ్ఞాస ప్రతి ఒక్కడిలోనూ పెరుగుతున్న రోజులివి. ఇది పసిగట్టిన 'ఈనాడు' యాజమాన్యం అందుకే ఏనాడో 'విపుల'ను తీసుకొచ్చారనిపిస్తుంది. వివిధ భాషల్లోని కథలను తేటతెలుగులోకి అనువదింపజేసి పాఠకుల ముందు ప్రపంచం ఇట్లా ఉందని చాటుతున్న నగారా విపుల. కథకుడి పేరు చూసి కథను ప్రచురిస్తాయి కొన్ని పత్రికలు. రచయిత పేరుకంటే కథావస్తువు, కథనం, ప్రయోజనం లాంటి విషయాలకే విపుల ప్రాధాన్యమిస్తుంది. విపులకు కథ రాయాలంటే రచయిత ముందే జాగ్రత్తపడతాడు. చతుర, విపులలు మాసపత్రికలేగానీ మూసపత్రికలు కావు. రెండూ విజ్ఞానంతోపాటు, వినోదం కూడా పంచుతున్న పత్రికలే. ఒక ఉద్యమంలా సాగుతున్న సాహిత్యసేవ ఇది. ఎలాంటి కల్తీలేని ఈ సాహిత్యోద్యమాన్ని 'ఈనాడు' యాజమాన్యం నిరంతరం కొనసాగిస్తుందన్న విశ్వాసం ఉంది. మరే పత్రికలకూ లేని అందం విపుల, చతుర పత్రికలకు ఉంది. డబ్బుకోసం కాకుండా ఒక ఆదర్శాన్ని, సాహిత్యసేవను లక్ష్యంగా చేసుకుని నడుస్తున్న ఈ రెండు పత్రికలు తెలుగువారికి చలువ పందిళ్లు కావాలని నిండు గుండెలతో అభిలషిస్తున్నాను. సంపాదకులకు, రథసారథి రామోజీరావుగారికి నా అభినందనలు, అభివందనములు.

– యస్. మునిసుందరం, రచయిత, తిరుపతి

# రచయితకు విలువనిచ్చే 'చతుర'

నా మొదటి నవల 'ఏగ్జిలరీ నర్స్ మిడ్ వైఫ్'ల జీవిత నేపథ్యంతో రాసిన 'సంకెళ్లు' చాలా కాలం క్రితం చతురలో ప్రచురితమైంది. చాలా ఆనందించాను. నవలకు సరిపడినంత సమాచారం లేకపోతే ఎక్కడ పొడిగించాలో ఆ పేజీలకు జిరాక్సు కాపీలు పంపి అప్పటి సంపాదకులు చలసాని ప్రసాదరావు మళ్లీ రాయించుకునేవారు. నేను ఇంకోసారి గ్రామీణ వాతావరణాన్ని ప్రతిబింబింపజేస్తూ రాసిన నవల 'మరోయజ్ఞం' పంపాను. ఆరు వారాలు దాటినా నాకే సమాచారం అందకపోవడంతో కార్డు రాసాను. రాసిన వారంలోపలే తమ అభిప్రాయాన్ని కొద్దిరోజుల్లోనే తెలియజేస్తామని చెప్పారు. తర్వాత ఆ నవల ఎంపిక కాలేదని తిప్పి పంపారు. చాసో స్ఫూర్తి అవార్డు ప్రదానం కోసం చలసానిగారు విజయనగరం వచ్చిన సందర్భంలో ఓ రచయిత మిత్రుడు నన్ను ఆయనకు పరిచయం చెయ్యగా 'నాకెందుకు తెలీదూ? ఆయన నవల చతురలో వేసా. మరొకటి తిప్పిపంపా' అన్నారు. ఒక మంచి రచనకు మంచి రచయితకు విలువనిచ్చే పత్రిక 'చతుర'. నేటికీ విపుల చతుర జంటపత్రికలు సాహితీ విలువలను పాటిస్తూ వెలువడుతుండటం గర్వకారణం.

– పివిబి శ్రీరామమూర్తి, రచయిత, విజయనగరం.

# పాఠకమహాశయులకు మనవి!




మూడున్నర దశాబ్దాలుగా నెలనెలా
ఒక మంచి నవలను,
మరెన్నో శీర్షికలను అందిస్తూ
నవనవలా వేదికగా చతుర
పాఠకుల ప్రశంసలందుకుంటోంది.

గత ఆరేళ్లలో కాగితం ఖర్చు,
ముద్రణ, రవాణా, పంపిణీ ఖర్చులు,
అదనపు సాంకేతిక వ్యయాలు
ఇబ్బడి ముబ్బడిగా పెరిగినా
ఇప్పటివరకు చతుర ధర పెంచలేదు.




ఇప్పుడీభారం మరింతగా పెరిగిన
నేపథ్యంలో అనివార్యంగా చతుర ధర
సవరించక తప్పడం లేదు.

ఆ మేరకు ఈనెల నుంచి
చతుర విడిప్రతి రూ.12/- అవుతోందని
గమనించ ప్రార్థన.

సహృదయ పాఠకులు, సాహిత్యాభిమానులు
పరిస్థితులను అర్థం చేసుకొని,
ఎప్పటిలాగే ఆదరిస్తారని ఆశిస్తున్నాం.




విడిప్రతి రూ.12/- అయినా
సాలు చందా రూ.140/- మాత్రమే!

– మేనేజర్,
వసుంధర పబ్లికేషన్స్

# మనసున ఉన్నదీ...

★ మే 'చతుర' నవల 'సఖి' ఒక మంచి సినిమా కథను చదువుతున్నామనే అనుభూతి నిచ్చింది. ప్రవేశిక పూర్తి చేస్తున్నపుడు పరీక్ష రాసిన అనుభూతికి లోనవుతున్నాం.

– **బచ్చు సత్యనారాయణ,** కొత్తగూడెం

★ చతుర ప్ర.జ.లో పాఠకుల ప్రశ్నలకు చక్కటి సమాధానాలు చెబుతున్నారు. ఎన్నో తెలియని విషయాలు తెలుసుకుంటున్నాం. డా. మేడసాని మోహన్‌కు ధన్యవాదాలు!

– **పతివాడ సూరిబాబు,** పార్వతీపురం, విజయనగరం జిల్లా

★ చిత్రమైన, చురుకైన భావనలతో, కల్పనలతో 'కొత్తగాలి' మండు వేసవిలో మలయమారుతంలా ఆహ్లాదపరిచింది. చతురప్రపంచంలో 'మరణమృదంగం', 'తెర వెనక గాథలు' ఆసక్తికరంగా ఉన్నాయి. 'బాలమేధావులు'లో చెప్పిన విషయాలు విద్యార్థులకు ఆదర్శం. ఫ్రాంక్లిన్ చతురోక్తులు ఆకట్టుకున్నాయి. కథా సంవిధానంలో, కథనంలో, పాత్రచిత్రణలో నాగరత్న 'సఖి' నూతన పోకడలు పోయింది.

– **డాక్టర్ శివభూషణం,** కర్నూలు

★ మే 'చతుర'లో నాగరత్న నవల 'సఖి' ఆద్యంతం చదివించింది. వివాహేతర సంబంధాలు ఎలా ఏర్పడతాయో, వాటి పర్యవసానలేంటో బాగా చెప్పారు. భర్త తనకే సొంతం కావాలనేది భార్య కోరిక. ప్రియునితోపాటు అతని డబ్బు కొంతైనా చెందాలనేది ప్రేయసి స్వార్థం. ఇవేకాక పిల్లలూ కావాలనేది మరో ప్రియురాలి స్వార్థం. మహేష్-మమత-పండరి తదితర పాత్రల మనస్తత్వ విశ్లేషణ బాగుంది.

– **వి. హైమవతి,** మంచిర్యాల

★ దిగజారిపోతున్న మానవసంబంధాలను, రోజురోజుకు పతనమవుతున్న విలువలనూ ప్రధాన అంశంగా చేసుకుని మే చతురలో వచ్చిన నాగరత్న నవల 'సఖి' ఆద్యంతం చదివించింది. ఎన్నో మలుపులతో, సస్పెన్స్‌తో పాఠకులను విశేషంగా ఆకట్టుకుంది. మంచి రచనను అందించిన 'చతుర'కు ధన్యవాదాలు.

– **ఎం. శ్రీనివాస్,** హైదరాబాదు

★ మే 'చతుర' నవల 'సఖి' విశేషంగా ఆకట్టుకుంది. వ్యాపారలావాదేవీలు, రియల్ ఎస్టేట్ కుంభకోణాలు, మానవసంబంధాలు, పోలీసు డిపార్టుమెంటు విషయాలు కలగలిపి ఒక రచయిత్రి నవల రాయడం ఆషామాషీ వ్యవహారం కాదు. రామ్మోహన్ లాటి కోటీశ్వరులకు ఈ నవల ఓ హెచ్చరిక. ఊహించని ముగింపు వల్ల నవలలో ఉత్కంఠ ఏర్పడింది. రచయిత్రి నాగరత్న 'నిర్భయ' అంశంతో మరో నవల రాస్తారని ఆశిస్తున్నాను.

– **జి.జి.కె. రావు,** శ్రీకాకుళం

★ మే 'చతుర' నవల 'సఖి' చాలా బాగుంది. పరస్త్రీ వ్యామోహం ప్రాణాంతకం. రామ్మోహన్ లాంటి వాళ్లు ఎందరో ఇలాంటి దురలవాట్ల వల్ల అపాయంలో పడుతున్నారు. రచయిత్రికి నమస్కారాలు. ముఖచిత్రం, చివరి పేజి చాలా బాగున్నాయి.

– **తోడేటి సుబ్బయ్య,** రేపల్లె

★ మే 'చతుర' నవల 'సఖి' ఆద్యంతం ఉత్కంఠతో ఆనందపరిచింది. చతురోక్తులు 'చతుర'కు సార్థకమే! 'కొత్తగాలి' రూపేణ మినీకవితలు చురుక్కులేకాదు చమక్కులూను.

– **మతుకుపల్లి లలిత,** హైదరాబాదు

★ వెన్నదొంగ చిన్ని కృష్ణుని ముఖచిత్రంతో మే 'చతుర' మానసోల్లాసాన్ని అందించింది. వి. నాగరత్న నవల 'సఖి' ఉత్కంఠను రేకెత్తిస్తూ అనూహ్య సంఘటనతో ఆకట్టుకుంది. ప్రతి స్త్రీ సునందలా ఉండాలని, ఈ లోకంలో మమత, పండరీ లాంటి స్త్రీలు ఉండగూడదనిపించేలా ఉంది. జ్ఞానపీఠ అవార్డు గ్రహీత ప్రతిభారాయ్ వివరాలు చదివి ఆనందించాం.

– **కరణం శివానందరావు,** బెంగళూరు

---

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082
ఈ మెయిల్ : vipula.chatura@gmail.com
vipula.chatura@eenadu.net

సంపుటి -36 సంచిక - 5
425వ సంచిక, పేజీలు : 132
జూన్ 2013

# చతుర




✤ ముఖచిత్రం : నటి మోనాల్ గజ్జర్
✤ చివరి కవర్ : బేబీ ఓహన
పుస్తకాలంకరణ : రాజు యాట

ఆ రోజు రాత్రి పేకాట ఆసక్తికరంగా సాగుతోంది. ప్రిన్స్ వొరొంట్సోవ్ భార్య మార్యా వారి ఆటను చూస్తోంది. అక్కడ అందరూ మగవాళ్లే. మార్యా ఒక్కతే మహిళ. అంతలో 'ఓ ఆఫీసర్ మీతో మాట్లాడ్డానికి వచ్చాడు' అని ప్రిన్స్‌కు చెప్పాడు సేవకుడు. 'ఎక్స్‌క్యూజ్‌మీ జెంటిల్‌మెన్! ప్రిన్సెస్ మార్యా నా బదులు ఆడుతుంది' అని ఆఫీసర్‌తో మాట్లాడ్డానికి వెళ్లాడు ప్రిన్స్. 'మీకభ్యంతరం లేదుగా' అంటూ ముద్దుగా వారిని అడిగింది ప్రిన్సెస్ మార్యా. ఆ అందాల భామతో ఆడే అదృష్టాన్ని వదులుకోవడం ఇష్టంలేక 'రండి రండి' అంటూ ఆహ్వానించారు మిగతావారు. ఆ తర్వాత ఏం జరిగింది. ఇంతకీ ఆ వచ్చిందెవరు? ఏకబిగిన చదివించే

**టాల్‌స్టాయ్**
చివరి నవల
**హాజీ మురాద్!**
6వ పేజీలో...
బొమ్మలు : ఆనంద్

టాల్‌స్టాయ్

# హాజీ మురాద్

(రష్యన్ నవల)



అనువాదం : ముక్తవరం పార్థసారథి

భీకర యుద్ధం! తుపాకులు పేలుతున్నాయి.
సైనికులు నేలకొరుగుతున్నారు.
ఇరుపక్షాలదీ ఒకటే లక్ష్యం!
ఎదుటివారిని ఓడించాలి.
తామే విజయభేరి మోగించాలి.
ఓ పక్షంలో వేల సైనికులు! మరో పక్షంలో
కేవలం ఐదుగురు! అయినా తామే
గెలుస్తామన్న నమ్మకం. వారి నాయకుడు
హాజీమురాద్! అదే వారి ధైర్యం.
అనుచరుల తుపాకులు గురితప్పినా
నాయకుడు గురితప్పకుండా ప్రత్యర్థి
సైనికుల మీద బుల్లెట్ల వర్షం కురిపిస్తున్నాడు.
ఇంతలో ఓ బుల్లెట్ అతని శరీరంలోకి
దూసుకుపోయింది.

ఆ తర్వాత ఏం జరిగింది?
అసలు హాజీమురాద్ ఎవరు?
ఇంతకూ ఆ యుద్ధంలో అతను గెలుస్తాడా?
ఆద్యంతం ఉత్కంఠగా చదివించే టాల్‌స్టాయ్
చివరి నవల **హాజీ మురాద్** కు
ముక్తవరం పార్థసారథి తెలుగు అనువాదం
చతుర జూన్ కానుక!





ప్రపంచ సాహిత్యంలో అత్యుత్తమ రచయిత టాల్‌స్టాయ్ (1828-1910) అన్నారు పండితులు. ఆయన 'యుద్ధము -శాంతి', 'అన్నా కరేనినా' చదవని నవలా ప్రియులుండరు.

లియో టాల్‌స్టాయ్ ముత్తాతను రష్యన్ చక్రవర్తి పీటర్, ది గ్రేట్ 'కౌంట్' బిరుదుతో సత్కరించాడు. అలా జార్ చక్రవర్తుల దర్బారుతో టాల్‌స్టాయ్ వంశీకులకు సన్నిహిత సంబంధాలేర్పడ్డాయి. ఆనాటి భూస్వాములందర్లాగే టాల్‌స్టాయ్ కూడా యవ్వనంలో పలు దుర్వ్యసనాలకు అలవాటు పడ్డాడు. తాగుడు, జూదం, స్త్రీలోలత అతడి బలహీనతలు.

యూనివర్సిటీ చదువు ముగించిన టాల్‌స్టాయ్ కొన్నాళ్ళు సైన్యంలో పనిచేశాడు. అప్పుడే కాకసస్ ప్రాంతంలో అతడు తొలిసారిగా హాజీ మురాద్ గురించి విన్నాడు.

తన రచనా జీవితం ఇంచుమించు ముగిసిన చివరిదశలో 1896లో 'హాజీ మురాద్' ప్రారంభించి 1904లో ముగించాడు. ఇదే అతడి చివరి నవలిక. 1912లో రచయిత మరణానంతరం కొంతభాగం, 1917లో పూర్తిపాఠం అచ్చయింది.

## హాజీమురాద్ గురించి...

**రష్యన్ సామ్రాజ్యంలో అంతర్భాగం చెచెన్యా. అత్యధిక ముస్లిం జనాభా కలిగిన ఈ ప్రాంతం రష్యా నుండి విడివడి స్వతంత్ర దేశంగా ప్రకటించుకోవటానికి సుదీర్ఘ పోరాటం చేస్తున్నది. కథాకాలం నాటికి యిక్కడి వేర్పాటు వాద నాయకుడు షామిల్ మీద పగ సాధించడానికి, ఒకప్పుడు అతడికి కుడి భుజంగా వున్న హాజీ మురాద్ అయిష్టంగానే రష్యన్‌ల సహాయం అర్థిస్తాడు.**

**హాజీ మురాద్ చెచెన్యాలోని అవర్ తెగకు చెందిన తిరుగుబాటు నాయకుడు. టర్కిష్‌లో ఇతణ్ణి హాకి మురాత్‌గా పిలుస్తారు. రష్యన్‌లో ఖాజీ మురాద్ అంటారు. హాజీ మురాద్ (1790-1852); షామిల్ (1834-1859); ప్రిన్స్ వొరొంట్సోవ్ (1782-1856), జార్ నికొలస్ (1796-1855) అందరూ పందొమ్మిదో శతాబ్ది రష్యా చరిత్రలో ముఖ్య భూమిక పోషించినవాళ్లే.**

పాఠకుల సౌలభ్యం కోసం ఈ నవలలోని కొన్ని ముఖ్య పాత్రల గురించిన వివరణ:

**ఎల్దార్:** హాజీ మురాద్ సహాయకులలో ఒకడు.

**సాడో:** హాజీ మురాద్‌కు ఆశ్రయమిచ్చిన గ్రామస్తుడు.

**ప్రిన్స్ వొరొంట్సోవ్:** రష్యన్ సైనిక అధికారి.

**మైఖేల్ సెమెనోవిచ్ వొరొంట్సోవ్:** ప్రిన్స్ వొరొంట్సోవ్ తండ్రి, జార్ కొలువులో వున్న వైస్‌రాయ్.

**లారిస్ మెలికోవ్:** వైస్‌రాయ్ వద్ద ఒక వుద్యోగి.

**మురిద్:** సూఫిజంను పోలిన ఒక మతశాఖ మురిదిజం. దీని అనుయాయులే మురిద్‌లు.

త్వరగా ఇంటికి చేరుకోవాలి. పొలాల పక్కగా నడుస్తున్నాను. నడివేసవి. 'రై' ధాన్యం కోతలకు సిద్ధంగా ఉంది. ఎటుచూసినా రంగురంగుల పూలతో ఆ ప్రాంతమంతా ఆహ్లాదకరంగా ఉంది. ఎరుపు, తెలుపు, గులాబీరంగు పూలనుండి లవంగ వాసన మత్తుగా వ్యాపిస్తోంది. ఎన్నిరకాల మొక్కలో? దేనికదే ప్రత్యేకం. ఉదయం విచ్చుకున్న పూలు ఎంత అందమైనవైనా, ఎంత సుగంధ భరితమైనవైనా సాయంత్రమయ్యేసరికి వాడిపోతాయి. ఒక పూలకొమ్మ విరిచి, చేతబట్టుకుని హడావిడిగా ముందుకు కదులుతుంటే పక్కన గోతిలో, ఒక ముళ్లకంపలో పూసిన ఎర్రటి పువ్వొకటి కన్పించింది. దాన్ని మా ప్రాంతంలో 'టార్టార్' అంటాం. ఆ ముళ్లు మహా ప్రమాదకరం. నేల దున్నుతున్నప్పుడు, ఈ మొక్కలు కనిపిస్తే, వాటిని జాగ్రత్తగా పెరికి దూరంగా పారేస్తాం. గోతిలోకి దిగి, ఆ పువ్వుమీద మత్తుగా వాలిన తుమ్మెదను పారదోలి, చేయి ముందుకు చాపాను. కాని అన్ని ముళ్ల మధ్యన ఒక్కపువ్వు! చేతికి జేబురుమాలు చుట్టుకున్నాను. చుట్టూవున్న ఆకులు, కొమ్మలు ఒక్కొక్కటే తొలగిస్తూ అయిదు నిమిషాలు శ్రమించాను. ఎట్టకేలకు పువ్వయితే దొరికించుకున్నాను గాని అదంత తాజాగానూ, అందంగానూ కనిపించలేదు.

నా వద్దవున్న సుకుమారమైన పువ్వులతో పోల్చితే అది చాలా మొరటుగా వుంది. తిరిగి గోతిలోకి విసిరేశాను. బాధ కలిగింది. మొక్కమీద అందంగా కనిపించిందే? అనవసరంగా ఒక జీవితం నాశనం చేశాను.

కాని ఆ ముళ్లకంపది ఎంత మొండిబతుకు! ఆత్మరక్షణ కోసం ఎంతగా పోరాడుతుంది! చివరి క్షణంలో కూడా తనమీద దాడి చేసిన వాడికి ఏదో ఒక గాయం చేయకుండా ఓటమినంగీకరించదు గదా! తాజాగా దున్నిన పొలంలో వడివడిగా నడిచాను. నల్లటి నేలలో దుమ్ము లేచింది. చాలా విశాలమైన పొలం అది. కనుచూపు మేర గీతల్లా పొడుగాటి నాగేటిచాళ్లు. మనిషి విత్తుతాడు, మొక్కల్ని పెంచుతాడు. తిరిగి వాటిని నాశనం చేస్తాడు. తనకోసం ఎన్ని లక్షల కోట్ల మొక్కల్ని, వృక్ష సంతతిని నిర్దాక్షిణ్యంగా నాశనం చేస్తాడు. దూరంగా ఒక దిబ్బ మీద మరో ముళ్లకంప కనిపించింది. అదే టార్టార్. అవును ఎంత దున్నినా, ఎంత కలుపు తీసినా కొన్నిమొక్కలు మనిషిని ధిక్కరించి మరీ పెరుగుతాయి. అలాంటిదే టార్టార్. ఈ మొక్కకు మూడు కొమ్మలున్నాయి. ఒకటి విరిగి, తెగిన చేతిలా వేళ్లాడుతోంది. మిగతా రెండు కొమ్మలకూ పూలున్నాయి. వాడిపోయి, మట్టికొట్టుకుపోయిన ఎర్రటిపూలు. బండి చక్రం కింద నలిగిపోయిన మొక్క కాబోలు.. తిరిగి నిటారుగా నిలబడటానికి ప్రయత్నిస్తున్నది. నుజ్జు నుజ్జయిన శరీరం లోని పేగులు బయటికి వచ్చినట్టుగా వేళ్లాడుతున్న పువ్వు, కన్ను ఎవరో పీకేసినట్టుగా వున్నది. అయినా ఓటమినంగీకరించక, ధైర్యంగా నిలబడిన వీరుడిలా ఉందది! తనవాళ్లందరూ నేలకూలారు. కాని తను మాత్రం తల వంచదు.

'జీవశక్తి' అంటే అదేనని అనుకున్నాను. లోకాన్ని జయించాడు మనిషి. వృక్షజాతిని నాశనం చేశాడు. కాని ఒక్కమొక్క అతడికెదురు తిరిగింది. కొన్నేళ్ల క్రితం కాకసస్‌లో జరిగిన ఒక కథ గుర్తుకొచ్చింది. కొంత నేను స్వయంగా చూశాను. కొంత ప్రత్యక్ష సాక్షులనుండి విన్నాను. మిగతాది నా వూహ.

**1851 చివరలో...**

నవంబర్ నెల. శీతాకాలం ప్రవేశిం

చింది. రష్యా పొలిమేర నుండి సుమారు పదిహేను మైళ్ల దూరంలో వున్న చెచెన్ గ్రామం మక్మెట్‌లోకి ప్రవేశించాడు హాజీ మురాద్. కాలుతున్న పిడకల వాసన ఘాటుగా వ్యాపించింది. మసీదులో ప్రార్థ నల కోసం అందర్నీ పిలిచాడు ముయె జ్జిన్. స్వచ్ఛమైన కొండగాలితో కలిసింది పిడకల వాసన. ఇళ్లముందు పశువులు, గొర్రెలు అరుస్తున్నాయి.

తేనెతుట్టెలోని చిన్నచిన్న గూళ్లలా వరు సగా కట్టుకున్న ఇండ్లవి. బొంగురు గొంతు కలతో పరుషంగా ఏదో మాట్లాడుతు న్నారు పురుషులు. స్త్రీల, పిల్లల స్వరాలు కింద ప్రవహిస్తున్న సెలయేటి రొదతో కల సిపోయాయి.

సాహసాలకు పేరుమోసిన చెచెన్యా టార్టార్ నాయకుడు షామిల్‌కు కుడిభుజం హాజీ మురాద్. అనుచరగణం లేకుండా, ఇతర అధికార లాంఛనాలు లేకుండా ఎక్క డికీ కదలడు. కానీ ఈ రోజు ముసుగు వేసుకుని, తుపాకీ లోపల దాచుకుని కేవలం ఒకే ఒక్క సేవకునితో, కాందిశీకు నిలా, ఎవరికంటా బడకుండా పలు జాగ్ర త్తలు తీసుకుని ఇక్కడికి చేరుకున్నాడు.

అశ్వారూఢుడై ఊళ్లోకి ప్రవేశించిన తర్వాత, పక్క సందులోకి తిరిగి కొండను తొలచినట్టుగా వున్న ఒక ఇంటి దగ్గర ఆగి, పరిశీలనగా అటూ ఇటూ చూశాడు హాజీ మురాద్. చుట్టుపక్కల ఎవరూ కని పించలేదుగాని, ఆ ఇంటిపైన, గొర్రెచర్మం కప్పుకున్న ఓ వ్యక్తి పడుకున్నాడు. తన కొరడా కర్రతో అతణ్ణి తట్టి, "సలాం ఆలేకుం" అంటూ ముఖానికి కట్టుకున్న గుడ్డ తొలగించాడు హాజీమురాద్.

"ఆలేకుం సలాం". వృద్ధుడు అతణ్ణి గుర్తుపట్టాడు. లేచి, గొర్రె చర్మం కోటు లోకి చేతులు దోపి, కర్ర చెప్పులు తొడు క్కుని, నిచ్చెన దిగుతూ బోసిగా నవ్వాడు. ఆ తర్వాత మర్యాదకోసం గుర్రపు కళ్లెం పట్టుకుని మురాద్ దిగటానికి సాయం చెయ్యబోయాడుగాని, అప్పటికే కిందికి గెంతిన అనుచరుడు, తన నాయకుడికి చేయి అందించాడు.

అప్పుడే తలుపు ఓరగా తీసుకుని వచ్చిన పదిహేనేళ్ల కుర్రాడొకడు ఆశ్చర్యంగా ఆగం తకులవైపు తేరిపార చూశాడు.

"మసీదుకు వెళ్లి మీ నాన్నను త్వరగా రమ్మను" అంటూ కుర్రాడికి పురమా యించి తలుపు బార్లా తెరిచాడు వృద్ధుడు.

పసుపుపచ్చ శాలువా, ఎర్రటి కమీజ్, నీలం రంగు పైజామాలో వున్న మధ్య వయస్కురాలు గోడకు దిండ్లుపెట్టి, వచ్చి కూర్చొమ్మని లోపలికి ఆహ్వానించింది. ఆ తర్వాత వంగి అభివాదం చేస్తూ "మీ రాక మాకు శుభం చేకూర్చుగాక!" అంటూ లోపలికెళ్లింది.

"మీ సంతానమంతా చిరంజీవులవుదురు గాక" అంటూ హాజీ మురాద్ ముసుగు పూర్తిగా తొలగించి తన రైఫిల్, ఖడ్గం, యింటి యజమాని ఆయుధాల పక్కనే గోడకున్న మేకుకు తగిలించి, నడుముకున్న పిస్తోలును సరి చేసుకుని, కింద కూర్చు న్నాడు. వృద్ధుడు కూడా పక్కనే కూలబడి, చేతులు పైకెత్తి ప్రార్థించాడు. హాజీ ము రాద్ అతణ్ణి అనుసరించాడు.

తరువాత యిద్దరూ అరచేతులు మొహా నికి రుద్దుకున్నారు. గడ్డాలు దువ్వుకు న్నారు.

"ఏమైనా విశేషాలున్నాయా? " అని అడి గాడు హాజీ మురాద్.

"నేను తేనెతుట్టెల వద్దవుంటాను. ఈ రోజే నా కొడుకును చూద్దామని వచ్చాను. ఏమైనా వార్తలుంటే వాడికి తెలుస్తాయి" అన్నాడు వృద్ధుడు.

అతడు చెప్పదలచుకోవటంలేదని గ్రహిం చిన హాజీ మురాద్ మరేమీ అడగలేదు.

## వింతవింత థీమ్‌పార్కులు!

డిస్నీలాండ్ లాంటి థీమ్‌పార్క్‌ల గురించి చాలామందికి తెలుసు. కాని ఇంకా చూడదగ్గ థీమ్‌పార్కులు ప్రపంచంలో ఎన్నో ఉన్నాయి. చైనాలో 'వరల్డ్ చాక్లెట్ వండర్‌మేడ్' అనే థీమ్‌పార్కు జనవరి 29, 2010న ఆరంభమైంది. ఇందులోని వస్తువులన్నీ చాక్లెట్‌తో చేసినవే. గ్రేట్‌వాల్ ఆఫ్ చైనా, టెర్రకోట యుద్ధ వీరులు, బూట్లు, దుస్తులు లాంటివన్నీ చాక్లెట్‌తో చేసారు. అవి కరగకుండా ఉష్ణోగ్రతను నియంత్రించే గాజుపెట్టెల్లో ఉంచారు. ఇక్కడి మోడల్స్ కూడా చాక్లెట్‌తో చేసిన దుస్తులనే ధరించడం విశేషం.



మరో థీమ్‌పార్క్ సింగపూర్‌లోని హోపర్ విల్లా. ఇందులో చైనీస్ జానపద సాహిత్యంలోని వేయి పాత్రల విగ్రహాలు, 150 దృశ్యాలను ఉంచారు. వీటిలో భయంకరమైంది నరక దృశ్యం. 1937లో దీన్ని ఆరంభించారు.

ఫ్లోరిడాలోని ఆర్లెండ్‌లో క్రైస్తవం గురించి తెలియజేసే హోలీలాండ్ ఎక్స్‌ప్రెస్ అనే థీమ్‌పార్క్ ఉంది. జీసస్‌కు శిలువ వేసే దృశ్యం, ఆనాటి జెరూసలేం బజార్లు మొదలైనవి ఇక్కడ చూడవచ్చు.

హైతీలోగల మెమొరి విలేజ్ అనే థీమ్‌పార్క్ ఆఫ్రికానుంచి తీసుకువచ్చిన బానిసల గురించి వివరిస్తుంది. ఇందులో సందర్శకులు నాటి బానిసల అనుభవాలను పొందేందుకు అప్పటి దుస్తులు ధరించాలి. వారిని కిడ్నాప్ చేస్తారు. ఓడలో గొలుసులతో కట్టి దాన్ని తెడ్లు వేస్తూ పశ్చిమ దేశాలకు తీసుకురావడం, తర్వాత వారిని వేలం వేయడం మొదలైన వాటిలో సందర్శకులే పాల్గొంటారు. అలాంటి పన్నెండు గంటల అనుభవాల తర్వాత ఈ థీమ్‌పార్కుని చూడటం ముగుస్తుంది. దీంట్లో భాగంగానే సందర్శకులు ఆనాటి బానిసలు చేసే పనులన్నీ కూడా చేస్తారు. టీ ప్లాంటేషన్‌లో పని చేసే అనుభవం కోసం అలాంటి టీ తోట కూడా పెంచుతున్నారు.

## హాటెస్ట్ లిక్కర్ అంటే?

జర్మన్ లిక్కర్ కంపెనీ జి-స్పిరిట్స్ ఇటీవల మార్కెట్లోకి పరిమిత ఓడ్కా, రమ్, విస్కీ బాటిల్స్‌ని ప్రవేశపెట్టింది. ఈ లిక్కర్లలోని విశేషం ఇవి ప్రీమియం ప్రాడక్ట్స్. స్త్రీల అందమైన వక్షోజాల మీద పోసి వాటినుంచి జారిపడ్డ లిక్కరే ఆ ప్రీమియం ప్రాడక్ట్స్! ప్లేబాయ్ పత్రికలో 2012లో ప్లేమేట్‌గా నగ్న చిత్రం ముద్రించిన హంగరీకి చెందిన అలెక్సా వెర్గా అనే అందమైన యువతి ఫొటోని, ఆమె వక్షోజాల మీద నుంచి కారిన లిక్కర్‌ని నింపిన బాటిల్స్ లేబిల్స్ మీద ప్రచురించారు. ఒక్కో బాటిల్ ఖరీదు 150 నుంచి 180 డాలర్లదాకా ఉంటుంది. దాంతోపాటు ఇచ్చే డీవీడీలో ఆ లిక్కర్‌ని అమ్మాయి వక్షోజాల మీద పోయడం నుంచి, దాన్ని ఆ సీసాల్లోకి ప్యాక్ చేయడం మొత్తం ప్రక్రియను చూడవచ్చు. కెమెరా లెన్స్‌లోకి కసిగా చూస్తూ సీసాల్లోంచి అందమైన యువతులు తమ ఘనమైన వక్షోజాల మీదకి లిక్కర్‌ని పోసుకుంటూ కనిపిస్తారు. 'జర్మన్ ఫుడ్ అండ్ కన్సంప్షన్ లా'కు లోబడి ఆరోగ్య విషయంలో ఎలాంటి లోపం లేకుండా ఇదంతా జరిగింది. వైద్య నిపుణులు తనిఖీ చేసి బ్యాక్టీరియా లేదని నిర్ధారించాకే లిక్కర్‌ని బాటిల్స్‌లోకి నింపారు. యూరప్‌లోని అనేక మంది ప్రసిద్ధ మోడల్స్‌ని ఇందుకోసం ఆ జర్మన్ లిక్కర్ కంపెనీ ఉపయోగించింది.



"మంచి వార్తలేమీ లేవు. కుందేళ్లు డేగలను పారదోలటమెలాగా అని చర్చించుకుంటున్నాయి. డేగలేమో ఒక్కొక్క కుందేలునీ చీల్చుకుని తింటున్నాయి. మొన్నటికి మొన్న రష్యన్ వూరకుక్కలు మిచిట్ గ్రామంలో గడ్డివాములు తగలబెట్టారు. పురుగులుపడి చస్తారు దుర్మార్గులు" అంటూ చెప్పుకుపోయాడు వృద్ధుడు బాధగా, కోపంగా.

హాజీమురాద్ అనుచరుడు గదిలోకి ప్రవేశించి, తన నాయకుడిలాగే బురఖా తొలగించి, రైఫిల్, ఖడ్గం గోడకు వేలాడదీసి, చురకత్తి, పిస్తోలు మాత్రం ఒంటి మీదుంచుకున్నాడు.

## కొత్తగాలి...

**కరెంటు నీరూ కరెంటు గాలి**
**కరెంటు నిప్పు కరెంటు వంట**
**కరెంటు వైద్యం కరెంటు సేద్యం**
**షాక్ కొట్టదామరి బిల్లు చూసి?**

-ఎ. లలితాపరమేశ్వరి,
మిర్యాలగూడ

"అతడెవరు? " అనడిగాడు వృద్ధుడు.

"నా మనిషి. పేరు ఎల్దార్" అన్నాడు హాజీ మురాద్.

వృద్ధుడు సైగ చెయ్యటంతో, తన నాయకుడి పక్కనే బాసింపట్టు వేసుకుని కూర్చున్నాడు ఆగంతకుడు. గతవారమే తమ వీర యువకులు ఇద్దరు రష్యన్లను పట్టుకుని అందులో ఒకణ్ణి సంహరించారనీ, మరొకణ్ణి షామిల్ కు అప్పగించారనీ చెప్పాడు వృద్ధుడు.

ఇంటి వెలుపలి శబ్దాలను జాగ్రత్తగా ఆలకించాడు హాజీ మురాద్. తలుపు కిర్రుమంది. ఇంటి యజమాని సాడో ప్రవేశించాడు. అతడికి సుమారు నలభై ఏళ్లుంటాయి. చిన్నగడ్డం, పొడుగాటి ముక్కు, నల్లటి కళ్లు. అతడి వెనకే అతడి కొడుకు కూడా లోపలికొచ్చాడు. కింద కూర్చుని చేతులు పైకెత్తి దేవుణ్ని ప్రార్థించి, మొహం తుడుచుకున్నాడు సాడో. ఆ తర్వాత అసలు విషయం నెమ్మదిగా చెప్పాడు. "సజీవంగానైనా, సంహరించి అయినా సరే, హాజీ మురాద్‌ను పట్టుకెళ్ళాలని షామిల్ నుండి ఆదేశం వచ్చింది. ఇక్కడి ప్రజలెవరికీ, షామిల్ కు ఎదురు నిలిచే ధైర్యం లేదు. అందువల్ల మన జాగ్రత్తలో మనం వుండటం మంచిది. ఇంట్లో వున్నంతవరకూ తనకు ఎటువంటి ఆపదా రాదు. కాని బయటకు వెళ్లినప్పుడు ఎవరు రక్షిస్తారు? "

"సరే మనం రష్యన్లకో సందేశం పంపిద్దాం. నా అనుచరుడు అది తీసికెడతాడు. కాని అతడికి దారి చూపేవాడొకరు కావాలి" అన్నాడు హాజీ మురాద్.

"భాయి బాటాను వెంట పంపిస్తాను. వెళ్లి బాటాను పిలుచుకురా" అంటూ కొడుకువైపు చూశాడు సాడో.

లేడిలా ఒక్క గెంతులో అదృశ్యమయ్యాడు కుర్రాడు.

మరో పది నిమిషాల తర్వాత పొట్టిగా, సన్నగా వున్న ఒక చెచెన్ యువకుడితో తిరిగి వచ్చాడు.

అతడికి అభివాదం చేసి "నా అనుచరుణ్ణి రష్యన్ల వద్దకు తీసుకెళ్లగలవా? " అని ప్రశ్నించాడు హాజీ మురాద్.

"తప్పకుండా. అందరూ వాగ్దానాలు చేస్తారుగాని పని చెయ్యరు. నేను చెప్పింది చేస్తా" అన్నాడు బాటా.

"నీ బహుమానం మూడు" అంటూ వేళ్లు చూపించాడు హాజీ మురాద్.

ఆ సంజ్ఞ బాటాకు అర్థమైంది. డబ్బు కోసం కాదు, హాజీ మురాద్‌కు సహాయం

చెయ్యగలగటమే తనకు గొప్ప గౌరవం. ఈ పర్వత ప్రాంతంలో హాజీమురాద్ గురించి తెలియనిదెవ్వరికి! అతను రష్యన్ పందుల్ని ఎలా చంపాడో కథలుగా చెప్పు కుంటారు.

"సంతోషం. తాడు పొడుగుండాలి. కాని అవసరానికి మించి మాట్లాడకూడదు" అన్నాడు హాజీమురాద్.

"ఇక నోరు మెదపను" అన్నాడు బాటా.

"కొండమీద ఆర్గున్ నది మలుపు తిరు గుతుంది చూడు. అక్కడ అడవిలో రెండు పెద్దబండలున్నాయి."

"తెలుసు"

"అక్కడ నలుగురు అశ్వికులు నాకోసం నిరీక్షిస్తున్నారు"

"సరే"

"ఖాన్ మహోమా కావాలని అడుగు. ఏం చెయ్యాలో చెబుతాడు. అతణ్ణి నువ్వు రష్యన్ కమాండర్ ప్రిన్స్ వొరొంట్సొవ్ వద్దకు తీసికెళ్లాలి"

"అలాగే"

"మళ్లీ తిరిగి తీసుకురావాలి"

"తప్పకుండా"

"అతణ్ణి తీసుకుని నువ్వు అడవికి తిరి గిరా. నేనక్కడ నీకోసం చూస్తుంటాను"

గుండెమీద చేయి పెట్టుకుని, తలవంచి నిష్క్రమించాడు బాటా.

సాడోవైపు తిరిగి "మరో మనిషిని చెఖి పంపించాలి" అంటూ కోటు జేబులో వున్న బుల్లెట్లు తీయబోయి, యిద్దరు స్త్రీలు ప్రవే శించటంతో ఆ ప్రయత్నం విరమించుకు న్నాడు హాజీమురాద్.

ఆ వచ్చినవాళ్లలో ఒకావిడ సాడో భార్య. దిండ్లు అమర్చిందావిడే. మరొకరు చిన్న పిల్ల. ఎర్రటి పైజామా, ఆకుపచ్చ చొక్కా. మెడలో వెండి నాణాల గొలుసు వేసు కుని, తలవంచుకుని నడిచింది.

ఒక చిన్న గుండ్రటి బల్లమీద టీ, వెన్న పూసిన రొట్టె, జున్ను, తేనె తీసుకుని వచ్చింది సాడో భార్య. చేతులు కడుక్కోవ టానికి నీళ్లు, తువ్వాలు తెచ్చింది చిన్నపిల్ల.

స్త్రీలు గదిలో ఉన్నంతసేపూ నిశ్శబ్దంగా ఉండిపోయాడు హాజీమురాద్.

ఆ తర్వాత బుల్లెట్ ఒకటి తీసి అందు లోంచి చుట్టగా చుట్టిన కాగితం బైటికి లాగి "ఇది నా కొడుక్కు చేర్చాలి" అన్నాడు.

"సమాధానం మళ్లీ నీకు చేరడమెలా?" అని అడిగాడు సాడో.

"నువ్వే స్వయంగా నాకు చేరవెయ్యాలి"

"అలాగే" అంటూ కాగితాన్ని తిరిగి కా ట్రిడ్జ్‌లో దోపాడు సాడో.

ఆ తర్వాత అతిథులిద్దరూ చేతులు కడు క్కొని భోజనం చేశారు. వాళ్లు వచ్చినం దుకు పలుమార్లు కృతజ్ఞతలు వ్యక్తం చేశాడు సాడో.

క్రితంరోజు భోజనం చెయ్యకపోయినప్ప టికీ కొద్దిగా రొట్టె, జున్ను మాత్రమే తిన్నాడు హాజీమురాద్. ఆ తర్వాత మరో చిన్న రొట్టెముక్క మీద కాసింత తేనె రాసుకున్నాడు.

"మా తేనె స్వచ్ఛమైంది. ఈ సంవత్సరం దిగుబడి బాగా వచ్చింది" అన్నాడు వృద్ధుడు గర్వంగా.

"ఆతిథ్యానికి ధన్యవాదాలు" అన్నాడు హాజీమురాద్.

ఎల్దార్‌కు బల్లమీద వున్నదంతా తినె య్యాలనే వుంది గాని మొహమాటం అడ్డొ చ్చింది.

ఇటువంటి అతిథిని ఇంటికి రానిచ్చినం దుకు తన ప్రాణం ప్రమాదంలో పడిందని సాడోకు తెలుసు. షామిల్‌ను ఎదిరించి పోరాడినందుకుగాను చెచెన్యా పౌరులం దరూ హాజీమురాద్‌ను బహిష్కరించాలని బహిరంగ ప్రకటన చేశారు. ఈ ఆదేశం పాటించనివాళ్లు మరణదండనకు పాత్రుల

వుతారు.

ఇరుగుపొరుగు ఎవరైనా హాజీమురాద్ తమ ఇంటికి వచ్చిన విషయం పసిగట్ట వచ్చు. అతణ్ణి తమకు అప్పగించమని పట్టు పట్టవచ్చు. కాని సాడోకు భయం వెయ్యలేదు సరికదా, కాస్త గర్వంగా కూడా వుంది. ప్రాణం పోయినాసరే అతిథిని రక్షించటం తన బాధ్యత.

"ఇంట్లో వున్నంతవరకూ నీకే భయమూ లేదు" అన్నాడు సాడో మరోసారి.

కృతజ్ఞతగా తలాడించాడు హాజీమురాద్.

చలిమంట వెలిగించి స్త్రీలు నిద్రిస్తున్న గదిలోకి వెళ్లాడు సాడో.

ఈ అతిథులతో, తమ ప్రాణాలకు ముప్పు వస్తుందేమోనని మాట్లాడుకుంటున్నారు వాళ్లు.

★ ★ ★

హాజీమురాద్ వుంటున్న వూరినుండి సుమారు పదిమైళ్ల దూరంలో వోడ్విజెన్స్కయ వద్ద వున్న దుర్గం గేట్లు తెరుచుకుని ముగ్గురు సైనికులు, ఒక ఆఫీసర్ షాగిరిన్స్ వైపు నడిచారు. దారి నిర్మానుష్యంగా వుంది. అంతలో ఒక పొద వెనక అడుగుల సవ్వడి వినిపించింది. ఊపిరి బిగపట్టి విన్నారు. ఎండిన ఆకులమీద నడుస్తున్న బలమైన పాదాలు, చీకటిలో ఏమీ కనిపించలేదుగాని చెచెన్ గొంతులు వినిపించాయి. సైనికులకు ఎదురుగా నడిచి వచ్చాయి రెండు ఆకారాలు. ఒకటి పొడుగ్గా, ఒకటి పొట్టిగా వుంది.

"ఎవరు? " అంటూ అరిచాడొక సైనికుడు.

"నేను ఒక చెచెన్‌ను" అన్నాడు పొట్టివాడు. అతడు బాటా.

"ఎక్కడికి? "

"ప్రిన్స్ కోసం. మా దగ్గర ఆయుధాలు లేవు. ఇతడికి నేను గైడ్‌ను"

"ప్రిన్స్ వొరొంట్సొవ్ కోసం" అన్నాడు పొడుగువాడు.

"సర్లే. మేం తీసుకెళ్తాం" అన్నాడొక సైనికుడు.

చలి పెరిగింది.

రెండు గంటల తర్వాత ఎల్డార్, బాటాలను తీసుకెళ్లిన సైనికులు తిరిగి వచ్చారు.

"క్షేమంగా చేరారా? " అంటూ అడిగాడు వాళ్లకోసం నిరీక్షిస్తున్న ఆఫీసర్.

"కల్నల్ ఇంట్లో ఇంకా ఎవరూ నిద్రపోలేదు. వీళ్లను ఆయనకే అప్పగించాం"

సైనికుల బారక్స్ చీకటిగా వున్నాయి గాని ప్రిన్స్ ఇంట్లో మాత్రం ఇంకా లైట్లు వెలుగుతున్నాయి. ప్రిన్స్ సైమన్ మిహైలోవిచ్ వొరొంట్సొవ్(ఈయన కురిన్ రెజిమెంట్‌కు కమాండర్)తోపాటు ఆయన భార్య పీటర్స్‌బర్గ్ అందాలభామ మార్యా వాసిలెవ్నా కూడా వుంటుందక్కడ. బారక్స్‌లోనైనా సరే అత్యంత విలాసవంతమైన జీవితం గడుపుతారు వాళ్లు. కాని ఎంతో కష్టపడిపోతున్నామనుకుంటారు.

ఈ అర్ధరాత్రి అతిథులతో పేకాటలో మునిగున్నారు వాళ్లు. కార్డ్ టేబుల్ మీద నాలుగు కొవ్వొత్తులు వెలుగుతున్నాయి. విశాలమైన డ్రాయింగ్ రూంలో తివాచీ పరచి వున్నది. కిటికీలకు తెరలున్నాయి. వొరొంట్సొవ్‌ది పొడుగాటి మొహం. కోటు మీద మెడల్స్ మెరుస్తున్నాయి. పేకాటలో అతడి పార్ట్‌నర్ ఒక యూనివర్సిటీ విద్యార్థి. ప్రిన్సెస్ వొరొంట్సొవ్‌కు మొదటి భర్తతో పుట్టిన పిల్లాడికి ఇతడు ట్యూషన్ చెబుతాడు. మరో ఇద్దరు ఆఫీసర్లది మరో టీం.

ఆట ఆసక్తికరంగా సాగుతోంది.

అంతలో ప్రిన్స్ సేవకుడు ప్రవేశించి, ఒక ఆఫీసర్ అతనితో మాట్లాడటానికి వచ్చాడని చెప్పాడు.

"ఎక్స్క్యూజ్‌మీ జెంటిల్‌మెన్, ప్రిన్సెస్

మార్యా నా బదులు ఆడుతుంది" అంటూ లేచాడు ప్రిన్స్.

"మీకు అభ్యంతరం లేదుగా? " అంటూ ముద్దుగా అడిగింది ప్రిన్సెస్ మార్యా.

ఆ అదృష్టాన్ని ఎవరు వదులుకుంటారు? ఆమె అందానికి ముగ్ధులుకాని వాళ్లెవరూ వుండరు.

"రండి, రండి" అంటూ ఆహ్వానించారు. పేకముక్కలు పంచుతుంటే ప్రత్యర్థి చేతులు కంపించాయి.

ప్రిన్స్ తిరిగి వచ్చేసరికి ఒక ఆట ముగిసింది.

"ఎందుకొచ్చారు వాళ్లు? " అని అడిగింది ప్రిన్సెస్ మార్యా.

"ఒక ఆఫీసర్, మరొకతను వచ్చారు"

"ఎవరు? ఎందుకు? "

"చెప్పకూడదు. రహస్యం" అన్నాడు ప్రిన్స్.

"అలాగా, చూద్దాం" అంది ప్రిన్సెస్.

"మీ కంపెనీకి రేపు అడవిలో డ్యూటీ వుందా? " అని అక్కడ కూర్చున్న ఒక ఆఫీసర్ని అడిగాడు ప్రిన్స్.

"అవును, ఎందుకు? "

"రేపు కలుద్దాం" అంటూ చిరునవ్వు నవ్వాడు ప్రిన్స్.

"తప్పకుండా" ప్రిన్స్ వుద్దేశం అర్థం కాకపోయినా నవ్వాడు ఆఫీసర్. అతిథులందరూ వెళ్లిపోయిన తర్వాత మంచం మీద పడుకొన్న భర్తతో "వచ్చిందెవరు? హాజీమురాద్ కదా? " అని అడిగింది. కొన్నాళ్లుగా ఇద్దరి మధ్యా రాయబారాలు కొనసాగుతున్నాయని విన్నది.

ఆమె వూహించింది పూర్తిగా అబద్ధం కాదు గాని, వచ్చింది హాజీమురాద్ కాదని, అతని అనుచరుడు మాత్రమే అని చెప్పాడు ప్రిన్స్. మరుసటి రోజు ఒక రహస్య ప్రదేశంలో హాజీమురాద్ తనను కలుసుకోబోతున్నాడు. ఈ వార్త తెలిసి తన తండ్రి తప్పక సంతోషిస్తాడు. రెండు దాటింది. నిద్రముంచుకొచ్చింది.

★ ★ ★

తనను బంధించి తెమ్మని షామిల్ పంపించిన ముష్కరుల నుండి తప్పించుకుని, మూడు రాత్రులు నిద్రాహారాలు లేకుండా ప్రయాణించి సాడో యింట్లో నడుం వాల్చగానే క్షణంలో గాఢనిద్రలోకి జారుకున్నాడు హాజీమురాద్. దుస్తులు, తలకు చుట్టుకున్న గుడ్డ కూడా విప్పలేదు.

అతడికి కొంచెం దూరంలో వెల్లకిలా పడుకున్నాడు ఎల్దార్. బుల్లెట్లు దాచిన సంచీ చొక్కా జేబులో ఎత్తుగా కనిపిస్తున్నది. ఊపిరి తీసుకున్నప్పుడల్లా పై పెదవి కదులుతూ, చిన్న పిల్లాడిలా కనిపిస్తున్నాడు. తన నాయకుడిలాగే అతడు కూడా బెల్టుకు చురకత్తి, పిస్తోలు పెట్టుకునే నిదురించాడు. చలిమంట వేడి తగ్గింది. గదిలో దీపం మసక మసకగా వెలుగుతోంది.

అర్ధరాత్రి దాటింది. నెమ్మదిగా తలుపు తెరుచుకుంది. ఆ చిన్న శబ్దానికే దిగ్గున లేచి కూర్చుని, పిస్తోలు వద్దకు చేయి పోనిచ్చాడు హాజీమురాద్. పిల్లిలా అడుగులు వేస్తూ లోపలికి వచ్చాడు సాడో.

"ఏమైంది? " అనడిగాడు హాజీమురాద్. నిద్రాభంగమైనట్టుగా కాక, యుద్ధానికి

**కొత్తగాలి...**

పెళ్లయ్యాక
మగవాళ్లు
నోచుకునేది
మూగనోము

– డి. చందూవంశీ,
కర్నూలు

సన్నద్ధమైన వీరుడిలా వున్నాడతడు.

"నువ్వు వచ్చినప్పుడు ఇంటి డాబామీద నిల్చున్న ఓ స్త్రీ చూసి తన భర్తకీ విషయం చెప్పింది. ఇప్పుడు వూరంతా తెలిసింది. మసీదులో సమావేశమైన గ్రామ పెద్దలు నిన్ను అదుపులోకి తీసుకోవాలని తీర్మానించారట. పక్కింటివాళ్లు, ఇప్పుడే నా భార్యకీ విషయం చెప్పారు" అన్నాడు సాడో.

"బయల్దేరతాను" అన్నాడు హాజీమురాద్.

"గుర్రాల మీద జీనులు వేసి సిద్ధం చేశాను" అన్నాడు సాడో

## కొత్తగాలి...

**నోటి దురుసు**
**మనసును కలచు(విరుచు)**
**తేనెల పలుకు**
**మనుషుల కలుపు (మనసుకు కులుకు)**

– అగ్రహారం తులసి, ఒడిశా

గుసగుసగా 'ఎల్దార్' అంటూ నిదురిస్తున్న తన అనుచరుడిని తట్టి లేపాడు హాజీమురాద్.

నాయకుడి స్వరం వినిపించటంతో వెంటనే కళ్లు తెరిచాడు ఎల్దార్.

ఆయుధాలు, బురఖా ధరించి ఇద్దరూ గడపదాటారు. గుర్రాలు సిద్ధంగా వున్నాయి. గట్టి నేలమీద వాటి గిట్టల చప్పుడుకు ఎవరో కిటికీలోంచి తొంగి చూశారు. మరో వ్యక్తి కర్ర చెప్పులతో మసీదు వైపు పరిగెత్తాడు. చంద్రుడు లేడు. కాని నక్షత్రాల వెలుగు చీకటిని కొంత తగ్గించింది. ఇళ్ళకప్పులూ, మసీదు మినారులూ కనిపిస్తున్నాయి. అల్లంత దూరాన మసీదులో అనేక మంది వ్యక్తుల గొంతులు వినిపించాయి.

ఒక్క గెంతుతో అనాయాసంగా గుర్రం ఎక్కి కళ్లెం పట్టుకున్నాడు హాజీమురాద్.

"అల్లా నీకు మేలు చేస్తాడు" అంటూ తన ఆతిథేయికి అభివాదం చేసి, కొరడా సైగలతో ముందుక్కదిలాడు. ఎల్దార్ అతణ్ణనుసరించాడు. వాళ్ల వెంట కొంత దూరం పరిగెత్తి, ఆ అశ్వాలు అదృశ్యం కాగానే వెనుదిరిగాడు సాడో.

"ఆగు, కదలొద్దు" అంటూ అరిచిందొక స్వరం. మరింత మంది హాజీమురాద్ దారికి అడ్డంగా నిలిచారు.

హాజీమురాద్ ఆగకుండా, పిస్తోలు చేత పట్టుకొని ఎల్దార్‌తో సహా వాళ్లమధ్య నుండి దూసుకుపోయాడు. గ్రామస్తులు తుపాకులు కాల్చారు గాని, అశ్వికులకు బుల్లెట్లు తగలలేదు. మరో మూడు వందల గజాలు ముందుకెళ్లి, రొప్పుతున్న గుర్రానికి విశ్రాంతినిచ్చాడు హాజీమురాద్.

ముందర వంపులో కాలవ వడివడిగా ప్రవహిస్తోంది. వెనక, వూళ్లో కాకులు కావు కావుమంటున్నాయి. గుర్రాలు పరిగెత్తుకుని వస్తున్న శబ్దం వినిపించింది. జనం చాలామందే వుండి వుంటారు. అరుపులు కూడా వినిపిస్తున్నాయి. హాజీమురాద్ తన గుర్రాన్ని పరిగెత్తించాడు. కాని త్వరలోనే వాళ్లు అతణ్ణి చేరుకున్నారు. అందరూ ఆ వూరివాళ్లే. సుమారు ఇరవై మంది వుంటారు. అతణ్ణి పట్టుకున్నట్టు నటించాలి. కనీసం షామిల్‌కు తాము అతణ్ణి బంధించటానికి ప్రయత్నించామని తెలియాలి. వాళ్లను చూసి హాజీమురాద్ ఆగి అలవాటుగా, ఎడం చేత్తో రైఫిల్ తీశాడు. నాయకుడిని అనుసరించాడు ఎల్దార్.

"ఏం కావాలి మీకు? నన్ను పట్టుకుని అప్పగించాలనే గదా మీ కోరిక. రండి..

రండి!" అంటూ రైఫిల్ ఎత్తాడు హాజీమురాద్. గ్రామస్తులు ముందుక్కదల్లేదు.

గుర్రాన్ని లోయలోకి పరిగెత్తించాడు హాజీమురాద్. వాళ్లు అతణ్ణి వెంటాడే ప్రయత్నం చెయ్యలేదు. కొంతదూరం వెళ్లి వెనక్కు తిరిగి చూసిన హాజీమురాద్‌తో 'మేం చెప్పేది ఒకసారి విను' అంటూ అరిచారు. సమాధానంగా రైఫిల్ పేల్చాడతడు. మరికాసేపటికి ఎవరూ తనను అనుసరించటం లేదని రూఢీ చేసుకుని, ఒక క్షణం ఆగి అడవిలోని కాలవ గలగలలను విన్నాడు. ఇక్కడ కాకులు లేవు గాని ఓ గుడ్లగూబ కూసింది. దట్టమైన అడవి ఒక కోటగోడలాంటిది. మురిద్‌లు(అనుచరులు) తనకోసం అక్కడ నిరీక్షిస్తున్నారు.

అలా మరికొంత దూరం ప్రయాణించాక ఆగి ఈల వేశాడు. మరు నిమిషం జవాబుగా మరో ఈల వినిపించింది. హాజీమురాద్ అడవిలోకి ప్రవేశించాడు. కొన్ని అడుగులేసి అలా ముందుకెళ్లాడో లేదో, చెట్ల మధ్య రాజుకుంటున్న మంట ఒకటి కనిపించింది. జీను వేసిన గుర్రం, నలుగురు మనుషులూ వున్నారు ఆ మంట చుట్టూ.

అందులోంచి ఒకడు వచ్చి గుర్రం కళ్లెం పట్టుకుని హాజీమురాద్ దిగటానికి సాయం చేశాడు. అతడు హాజీమురాద్ సోదరుడు. ఇంటి వ్యవహారాలన్నీ అతనే చూస్తాడు.

గుర్రం దిగుతూనే "మంట ఆర్పెయ్యండి" అన్నాడు హాజీమురాద్.

నిప్పుల మీద ఆకులు కప్పేశారు మనుషులు.

"బాటా ఇక్కడికి వచ్చాడా? " అని అడిగాడు, నేలమీద పరచిన గుడ్డవైపు నడుస్తూ.

"వచ్చాడు. ఖాన్ మహోమాతో కలిసి వెళ్లిపోయి కూడా చాలా సేపయింది.

"ఎటువైపుగా వెళ్లారు? "

హాజీమురాద్ వచ్చిన దిశకు వ్యతిరేకంగా చూపిస్తూ "అటువైపు" అన్నాడు ఖనేఫీ.

"సరేగాని, మనం మరిన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. నన్ను కొందరు వెంబడించారు" అంటూ హెచ్చరించాడు హాజీమురాద్.

ఎల్డార్ కూడా గుర్రం దిగి, రెండు గుర్రాలనూ చెట్టుకట్టేశాడు. ఆ తర్వాత రైఫిల్ తీసుకుని, కాలవకు అతడొక వైపు, గంజాలో అనే చెచెన్ మరోవైపు కాపలా కాశారు. మంట ఆరిపోవటంతో చీకటి పెరిగింది. నక్షత్రాలు మరింతగా ప్రకాశించాయి.

> ## కొత్తగాలి...
>
> **వాడు**
> **సంపదకు దగ్గర**
> **కావాలనుకుంటున్నాడు**
> **మానవత్వానికి 'దూరం'గా**
> **జరిగిపోతున్నాడు**
>
> *– అయినాల కనకరత్నాచారి, కొరిశపాడు*

ఆకాశం వైపు చూసి, సప్తర్షి మండలం నడినెత్తికి రావటంతో అర్ధరాత్రి దాటి వుంటుందని తెలుసుకున్నాడు హాజీమురాద్. చివరి నమాజు సమయం దాటి చాలా సేపైంది. ఖనేఫీ నుండి నీళ్లచెంబు తీసుకుని కాలవ వైపు నడిచాడు హాజీమురాద్. ప్రయాణాల్లో నీళ్లచెంబు వెంట తీసుకెళ్లటం వాళ్ల ఆచారం.

మరి కాసేపటికి కాళ్లూ చేతులు కడుక్కుని, వంగి కూర్చుని, వేళ్లు చెవులకానించి, కళ్లు మూసుకుని, దక్షిణంవైపు తిరిగి ప్రార్థన చేశాడు. తిరిగివచ్చి, మోకాళ్ల మీద

కూర్చుని, తలవంచి దీర్ఘాలోచనలో పడ్డాడు.

హాజీమురాద్‌కు ఆత్మవిశ్వాసమెక్కువ. తను అదృష్టవంతుణ్ణనే అనుకుంటాడు. ఏమి చేసినా విజయం సాధిస్తానని గట్టి విశ్వాసం. ఇంతవరకూ అతని నమ్మకం వమ్ము కాలేదు. అనుకున్నవన్నీ సాధించగలిగాడు- ఎప్పుడో ఒకటి రెండుసార్లు తప్ప. ముఖ్యంగా నిత్యయుద్ధాలే జీవనసరళిగా మారినప్పుడు- ప్రతిసారీ అపజయం కూడా పొంచివున్నప్పుడు, తరచూ తనదే పైచేయి కావటమంటే మామూలు విషయం కాదు. ఆ నమ్మకంతోనే ఇప్పుడు కూడా విజయం సాధిస్తాననుకున్నాడు. ఆ దృశ్యం అప్పుడే అతడి కళ్లముందు మెదిలింది. వొరొంట్సొవ్ సైన్యం తనకు తోడు రాగా షామిల్‌తో యుద్ధంచేసి, అతణ్ణి ఖైదీగా పట్టుకుని తన పగ తీర్చుకుంటాడు. అప్పుడు రష్యన్ జార్ తనకు బహుమానం ప్రకటిస్తాడు. కేవలం అవేరియా (చెచెన్యాలో ఒక ప్రాంతం) మాత్రమే కాక, మొత్తం చెచెన్యా తన ఆధీనంలోకి వస్తుంది. ఈ మధురోహలతో అతడికి త్వరగా నిద్రపట్టింది.

కల ఎంత సుఖంగా వుందో! విజయగీతాలు గానం చేస్తూ ప్రతీకారం తీర్చుకున్నామన్న ఆనందంతో పెద్దగా అరుస్తూ, షామిల్ మీదికురికారు తన అనుచరులు. షామిల్ భార్యలు భయంతో బిక్కచచ్చి, శోకాలు పెట్టారు. "హాజీమురాద్ వస్తున్నాడు 'ల్యా ఇల్ అల్లీషా' అంటూ విజయోత్సాహంతో చిందులు వేశారు తన సైనికులు. ల్యా ఇల్ అల్లీషా, షామిల్ భార్యల రోదనలు, తన సైనికుల నవ్వులు.. ఇంతలో మెలకువ వచ్చింది. తనకు మెలకువ రావటానికి కారణం నక్కల వూళలు! తల ఎత్తి ఆకాశం వైపు చూశాడు. చెట్ల సందుల గుండా తూర్పున వెలుగు కనిపించింది. ఒక మురిద్‌ను ఖాన్ మహోమా గురించి అడిగాడు. అతడింకా తిరిగి రాలేదట. హాజీమురాద్ మళ్లీ నిద్రలోకి జారుకున్నాడు.

మరి కాసేపటికి ఖాన్ మహోమా గొంతు విని మెలకువ వచ్చింది. బాటా కూడా తిరిగి వచ్చాడు. హాజీమురాద్ పక్కనే కూర్చుని జరిగిందంతా చెప్పాడు ఖాన్ మహోమా. రష్యన్ సైనికులు తమను ప్రిన్స్ వద్దకు తీసికెళ్లారు. మరునాడు అడవిలోని ఒక రహస్య ప్రదేశంలో షాలిన్ వద్ద కలుసుకుంటానని వాగ్దానం చేశాడు ప్రిన్స్. ఎంత ఘనంగా మర్యాద చేశాడో! అక్కడక్కడ బాటా కూడా మాటలు కలిపాడు.

"ముఖ్యంగా తను రష్యన్ల పక్షం చేరటానికి సిద్ధంగా వున్నానని చెప్పినప్పుడు, ప్రిన్స్ ఎలా స్పందించాడు? ఏమన్నాడు? " అని గుచ్చిగుచ్చి అడిగాడు హాజీమురాద్.

"మిమ్మల్ని రష్యన్ల అతిథిగా అంగీకరిస్తానని చెప్పాడనీ, అది తనకు అంగీకారయోగ్యమే అనుకుంటున్నాననీ ఆశాభావం వ్యక్తపరిచాడు"

"కలుసుకోవలసిన రహస్య ప్రదేశానికి దారి తెలుసా? " అని మరోసారి బాటాను ప్రశ్నించాడు హాజీమురాద్.

## కొత్తగాలి...

**తప్పుచేసి**
**తప్పుకునేవాడు దోషి**
**తప్పుచేసి**
**ఒప్పుకునేవాడు మనిషి**
**సరిదిద్దుకునేవాడు మనీషి**

– *అంబటి వెంకటశివారెడ్డి, యర్రగుంట్ల*

"బాగా తెలుసు. స్వయంగా తీసికెళతా" అన్నాడు బాటా.

వాగ్దానం చేసిన మూడు రూబుళ్లూ తీసిచ్చాడు హాజీమురాద్. ఆ తర్వాత బంగారు తాపడం పెట్టిన ఆయుధాలను బైటికి తీసి మెరుగు పెట్టమన్నాడు. రష్యన్లను మొదటిసారి కలుస్తున్నారు. తమ హోదా కూడా చూపించుకోవాలి మరి.



**2**

ఇంకా తెల్లవారకముందే రష్యన్ కంపెనీ కమాండర్ పోల్టోరాట్‌స్కీ నాయకత్వంలో రెండు కంపెనీల సైనికులు గొడ్డళ్లు పట్టుకుని, చెట్లు నరకటానికి ఆరు మైళ్లు ప్రయాణం చేసి షాగిరిన్స్ గేట్ చేరుకున్నారు. కొందర్ని కాపలా పెట్టి మిగతావాళ్లు పనికి ఉపక్రమించారు. ఎనిమిదింటికి మంచు కరిగింది. గడ్డి, చెట్ల వాసనలతో కలిసిన చలిమంటల పొగ తెర కప్పినట్టు వ్యాపించింది.

చెట్లు నరుకుతున్న చోట కూర్చున్నారు సైనికులు. పోల్టోరాట్‌స్కీ, అతని సహాయకుడు టిఖానోవ్, మూడవ కంపెనీలోని ఇద్దరు ఆఫీసర్లు, బేరన్ ఫ్రెజ్ (ఇతడు గార్డ్స్‌కు చెందిన మాజీ ఆఫీసర్) భోజనం ముగించారు. సిగరెట్టు పీకలు, ఖాళీ బాటిళ్లు చెల్లాచెదురుగా పడివున్నాయి. కొందరు వోడ్కా ముగించి వైను తాగుతున్నారు. ఒక సేవకుడు మూడవ బాటిల్ కార్కు తీస్తున్నాడు.

రాత్రి సరిగా నిద్ర లేకపోయినప్పటికీ, పోల్టోరాట్‌స్కీ వుత్సాహంగా వున్నాడు. తన సైనికులతో కలసి ఏ ప్రమాదాన్ని ఎదుర్కోవాలన్నా అతనికి చాలా సంతోషంగా వుంటుంది.

ప్రస్తుత సంభాషణ జనరల్ స్లెట్‌ప్సోవ్ మరణం గురించి. మరణం అంటే, జీవితం ఎక్కడ ప్రారంభమైందో తిరిగి అక్కడికి చేరుకుందన్నమాట. వాళ్లు ఈ అతిముఖ్యమైన విషయాన్ని విస్మరించి, తమ అవగాహనను ఒక వీరుడి శౌర్యపరాక్రమాలకు మాత్రమే పరిమితం చేశారు. పర్వత ప్రాంతాలలోని తిరుగుబాటుదారులతో కత్తియుద్ధం చేస్తూ మరణించాడతడు.

యుద్ధంలో పాల్గొన్నవాళ్లందరికీ అనుభవమే. ఆ రోజుల్లో, ఈ రోజుల్లో కూడా ఎదురెదురు నిల్చి చంపుకోవటమనేది ఎప్పుడూ జరగదు. నరుక్కోరని కాదు. పారిపోయేవాళ్లనే తరిమి తరిమి చంపుతారు. యుద్ధంలో వీరత్వం, శౌర్యపరాక్రమాలు వుంటాయనే భావనే వాళ్లు ఆరోజు అంత సరదాగా కబుర్లు చెప్పుకోవటానికి కారణం. చల్లగాలి వీస్తున్నది. తాగుతూ, హాస్యపు కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేశారేగాని, స్లెట్‌ప్సోవ్‌ను కబళించినట్టుగానే తమ కోసం కూడా మృత్యువు పొంచి వుందని అర్థం చేసుకోలేదు. ఈ విషయాన్ని నిజం చేస్తున్నట్టుగా సరిగ్గా ఆ సరదా కబుర్ల మధ్య, వాళ్లకు అతిసమీపంగా ఒక బుల్లెట్ దూసుకుపోయింది.

"అదిగో, ఎవరో మననే గురిచూశారు. కోట్సా్్య, రైఫిల్ అందుకో" అంటూ ఫ్రెజ్ వైపు చూసి "నీ సత్తా చూపించు. నేను కంపెనీని లీడ్ చేస్తాను. యుద్ధం మజా రుచి చూద్దువుగాని" అంటూ వురకలెత్తే వుత్సాహంతో అరిచాడు పోల్టోరాట్‌స్కీ.

తుపాకీ పొగ వచ్చిన దిశగా పరిగెత్తాడు ఫ్రెజ్. గుర్రమెక్కి, అనుచరగణంతో ముందుక్కదిలాడు పోల్టోరాట్స్కీ. గాలి తీవ్రత పెరిగింది. లోయ అంచున వున్నది వీళ్ల ఔట్‌పోస్ట్. అప్పటికి మంచు కరిగి వెలుగొచ్చింది. ముందు వరుసలో నిల్చున్న పోల్టోరాట్స్కీకి ఓ పావు మైలు దూరంలో నలుగురు అశ్వికులు కనిపించారు. రష్యన్ల సహాయం అర్థించమని హాజీమురాద్‌ను ఒప్పించింది వీళ్లే. వాళ్లలో ఒకడు తుపాకీ పేల్చాడు. సైనికులు బదులిచ్చారు. చెచెన్లు వెనక్కు తగ్గారు. ఫైరింగ్ ఆగింది.

అయితే ఈ కాల్పుల్లో ఒక సైనికుడు అవ్దీవ్ గాయపడ్డాడు. అతడికి పొట్టలో తగిలింది బుల్లెట్.

పోల్టోరాట్స్కీ అతణ్ణి సమీపించి "ఎక్కడ? బాగా నొప్పిగా వుందా?" అంటూ పరామర్శించాడు.

"నొప్పెక్కువగా లేదుగాని నడవలేకపోతున్నాను. ఒక చుక్క వోడ్కా వుంటే యివ్వండి సార్" అన్నాడు అవ్దీవ్.

వెదికితే కాస్త వోడ్కా దొరికింది. లేదా అలాంటిదే మరో స్పిరిట్. పానోవ్ అనే సైనికుడు ఒక జగ్గులో పట్టుకొచ్చాడు. రుచిచూసి అవ్దీవ్ "తాగలేను. నువ్వే తాగు" అన్నాడు.

స్పిరిట్ మొత్తం తాగేశాడు పానోవ్.

"యువరానర్, కల్నల్ గారొస్తున్నారు" అంటూ పోల్టోరాట్స్కీని అప్రమత్తం చేశాడు సార్జెంట్ మేజర్.

"అయితే పద, ఎదురెళదాం" అంటూ గుర్రాన్ని దౌడు తీయించాడు పోల్టోరాట్స్కీ. మేలుజాతి ఇంగ్లీష్ గుర్రంమీద వస్తున్నాడు వొరొంట్సోవ్. వెంట ఒక కోసక్కు, ఒక చెచెన్ దుబాసీ వున్నారు.

"ఏం జరుగుతోందిక్కడ?" అంటూ ప్రశ్నించాడు వొరొంట్సోవ్.

"వాళ్లు మనపైన దాడి చేశారు" అన్నాడు పోల్టోరాట్స్కీ.

"కాల్పులు మీరు ప్రారంభించలేదా?"

"లేదు ప్రిన్స్, వాళ్లే ముందుకు రావటానికి ప్రయత్నించారు"

"ఒక సైనికుడు గాయపడ్డాడని విన్నాను"

"అవును ప్రిన్స్"

"సీరియస్ కేసా?"

"బుల్లెట్ పొట్టలోకి దూసుకుపోయింది. పరిస్థితి సీరియస్‌గానే వుంది"

"నేనిప్పుడు ఎక్కడికి వెళుతున్నానో తెలుసా?"

"తెలియదు"

"ఊహించగలవా?"

"లేదు"

"హాజీమురాద్ లొంగిపోయాడు. అతణ్ణి కలుసుకోవటానికి వెళుతున్నాం"

"అంటే?"

"అతడి తరఫున రాయబారం తీసుకొని ఒక మనిషి నిన్న నా వద్దకు వొచ్చాడు" అన్నాడు వొరొంట్సోవ్. పెదాలమీద చిరునవ్వును అతడు దాచుకోలేకపోతున్నాడు.

"షాలిన్ తోపువద్ద నా కోసం నిరీక్షిస్తుంటాడు. చుట్టూ సైనికుల్ని కాపలా పెట్టి, తరువాత నా వద్దకు రా"

"అర్థమైంది" అంటూ గుర్రమెక్కి తన కంపెనీవైపు పరుగుతీశాడు పోల్టోరాట్స్కీ. సమావేశ స్థలానికి కుడివైపు కొందర్నీ ఎడమవైపు కొందర్నీ యుద్ధసన్నద్ధమై వుండమని ఆదేశించి అవ్దీవ్ గురించి వాకబు చేశాడు. ఇతర సైనికులు అతణ్ని అప్పటికే దుర్గానికి తీసికెళ్లారు.

వొరొంట్సోవ్‌ను కలుసుకోవటానికి బయల్దేరినప్పుడు కొందరు అశ్వికులు అతి వేగంగా తనను దాటుకొని వెళ్లటం గమనించాడు పోల్టోరాట్స్కీ. తెల్లటి గుర్రం మీద స్ఫురద్రూపి ఒకడు పాగా, బంగారు నగలు ధరించి స్వారీ చేస్తున్నాడు. అతడే

హాజీమురాద్. పోల్టోరాట్స్కీని సమీపించి టార్టార్ భాషలో ఏదో అడిగాడు. తనకర్థం కాలేదన్నట్లు చిరునవ్వు నవ్వాడు పోల్టోరాట్స్కీ. హాజీమురాద్ తిరిగి నవ్వాడు. అది పసిపిల్లల నవ్వులా వుంది. పర్వతాలలో ఉండే తెగల నాయకుడు అంత అందంగా, అమాయకంగా నవ్వగలడని పోల్టోరాట్స్కీ వూహించలేదు. మొహంలో కరకుదనం వుంటుందనుకున్నాడు. కాని అతడు తన చిన్ననాటి స్నేహితుడిలా కని పిస్తున్నాడు. నల్లటి కనుబొమ్మల కింది అతడి కళ్లలో ఏదో శక్తి వుంది.

హాజీమురాద్ బృందంలో మొత్తం అయిదుగురున్నారు. అందులో ఒకడు

**కొత్తగాలి...**

**సిగ్గుచేటైన విషయం**
**కామాంధులని..**
**అంధులని...**
**పోల్చటం!**

– పి.వి. రమణకుమార్,
చిలకలూరి పేట

ఖాన్ మహోమా. ఇతడే ప్రిన్స్ వొరొంట్సొవ్‌ను క్రితం రోజు రాత్రి కలిశాడు. మరొకతను ఆవర్ ఖనేఫీ. హాజీమురాద్ వ్యవహారాలన్నీ అతడే చూసుకుంటాడు. మరొకడు లెస్గియన్. యువకుడు, అందగాడు. ఆడపిల్లలా సుకుమారంగా వున్నాడు. వీళ్లేగాక ఎల్డార్ ఉన్నాడు. చివరివాడు గంజాలో. చిన్నగడ్డం, కనుబొమలే లేవు.

దూరంగా నిల్చున్న వొరొంట్సొవ్‌ను వేలితో చూపించాడు పోల్టోరాట్స్కీ. హాజీ మురాద్ వెళ్లి కుడిచేయి గుండెకానించుకుని టార్టార్‌లో ఏదో అన్నాడు. చెచెన్ దుబాసీ దాన్ని రష్యన్‌లోకి అనువదించాడు.

"రష్యన్ జార్ అధికారానికి లొంగిపోతున్నాను. ఇది నా చిరకాల వాంఛ. కాని ఇన్నాళ్లు షామిల్ నాకు అడ్డుపడ్డాడు"

దుబాసీ చెప్పింది విని, గ్లవ్స్ తొడిగిన చేతిని కరచాలనం కోసం ముందుకు చాపాడు వొరొంట్సొవ్.

హాజీమురాద్ మళ్లీ ఏదో అన్నాడు.

"అతడు నీకు మాత్రమే లొంగిపోవాలనుకున్నాడట. నువ్వు సర్దార్ కొడుకువు గనక, నువ్వంటే అతడికి ప్రత్యేకమైన గౌరవముంది"

కృతజ్ఞతలు చెప్పాడు వొరొంట్సొవ్.

"తన అనుచరులందరూ ఇక రష్యన్ పక్షమే అంటున్నాడు" అన్నాడు దుబాసీ.

ఆ తర్వాత హాజీమురాద్‌ను వెంట తీసుకుని వొరొంట్సొవ్ దుర్గంలోకి ప్రవేశించినప్పుడు సైనికులు పలురకాలుగా మాట్లాడుకున్నారు.

"దుర్మార్గుడు! ఎంతమందిని చంపాడో? ఇప్పుడేమో వాడికి స్వాగతమా!"

"అవును. ఒకప్పుడు వాడు షామిల్‌కు కుడిభుజం. ఇప్పుడు కాదుగా. ఇక భయం లేదు"

"ఏదేమైనా చూడటానికి ఎంత అందంగా వున్నాడో!"

"ఆ ఎర్రగా వున్నవాడెవడు? మెల్లకన్నుతో చూస్తున్నట్టుంది? "

కాసేపాగి, ఆసక్తిగా చూస్తున్న తన సైనికులతో వొరొంట్సొవ్ "ఇతడెవరో తెలుసా? " అని అడిగాడు.

"తెలియదు, ఎక్సెలెన్సీ"

"హాజీమురాద్! పేరు విన్నారా? "

"ఎన్నిసార్లు మనం అతణ్ణి యుద్ధాల్లో తిప్పికొట్టలేదని"

"అతడూ మనల్ని బాగానే సతాయించాడుగా"

"అవును, ఎక్సెలెన్సీ"

తన గురించే అందరూ మాట్లాడుకుంటున్నారని హాజీమురాద్‌కు అర్థమైంది.

వొరొంట్సొవ్ మనసు విజయోత్సాహంతో పురకలేసింది.

★ ★ ★

రష్యాకు కంటిలో నలుసు, ప్రధానశత్రువు షామిల్, చెచెన్ నాయకుడు. అతడి తర్వాతి ముఖ్యనాయకుడు హాజీమురాద్. ఇటువంటి పెద్దచేపను రష్యన్ సైన్యంలో ఇంతమంది ఉన్నతాధికారులుండగా తను మాత్రమే వలవేసి లొంగదీసుకోవటం గర్వంగా వుంది. అదీ వొరొంట్సొవ్ ఉత్సాహానికి కారణం. ఒక్క చిన్న విషయం గురించే సందేహంగా వుంది. వోడ్విజెన్స్కయ వద్ద సైన్యాన్ని కమాండ్ చేస్తున్న జనరల్ మెల్లర్ జకోమెల్‌స్కీ ఆధ్వర్యంలో ఆపరేషన్ జరగాల్సింది. ఎవరికీ రిపోర్ట్ చెయ్యకుండా, ఎవరి అనుమతి తీసుకోకుండానే, తనీ పని పూర్తిచేశాడు. ఈ ఆలోచనే అతడి వుత్సాహాన్ని కాస్త మసకబార్చింది. ఇంటికి చేరగానే హాజీమురాద్ అనుచరులను రెజిమెంటల్ అడ్జుటెంట్ (ఒక సైనిక హోదా)కు అప్పగించి అతణ్ణి తను స్వయంగా ఇంట్లోకి తీసికెళ్లాడు.

అందంగా అలంకరించుకున్న ప్రిన్సెస్ మార్యా వాసిలెవ్నా, తన ఆరేళ్ల కొడుకుతో ఎదురొచ్చింది. డ్రాయింగ్‌రూంలో కూర్చున్నారు. చేతులు గుండెల మీద పెట్టుకుని దుబాసీ ద్వారా ప్రిన్స్‌ను తన సోదరుడిగా భావిస్తున్నాననీ, తాను కూర్చున్న ఈ ఇల్లు తనకు పవిత్రస్థలం అనీ, అతడి కుటుంబమంతా తనకు గౌరవపాత్రులనీ చెప్పాడు హాజీమురాద్.

అతడి ప్రవర్తన, మర్యాద మార్యాను బాగా ఆకట్టుకున్నాయి. తన ముంజేతిని మర్యాదగా స్పృశించినప్పుడు, అతడి మొహం ఎరుపెక్కటం ఆమెకు మరీ నచ్చింది. కూర్చొమ్మని ఆప్యాయంగా ఆదరించి, కాఫీ తాగుతారా? అని అడిగి కప్పులో కొంత పోసింది. ఇంతా చేసి కప్పు అందిస్తే వద్దన్నాడు. రష్యన్ కొద్దికొద్దిగా అర్థమవుతుంది కాని మాట్లాడలేడు. ఎవరైనా తనకర్థం కాకుండా మాట్లాడినప్పుడు నవ్వుతాడు. పోల్టోరాట్‌స్కీలాగే, మార్యా కూడా అతడి నవ్వు చూసి అతడి మీద మంచి అభిప్రాయం పెంచుకుంది. తల్లి పక్కన నిల్చున్న పిల్లాడు, హాజీమురాద్ పైనుండి క్షణం కూడా దృష్టి మరల్చలేదు. అతడు గొప్ప పరాక్రమవంతుడని చెప్పుకోవడం వాడు విన్నాడు.

హాజీమురాద్‌తో మాట్లాడుతుండమని భార్యకు చెప్పి, అతడు లొంగిపోయి, రష్యన్ పక్షం చేరాడని రిపోర్ట్ చెయ్యటానికి బయల్దేరాడు వొరొంట్సొవ్. గ్రోజ్నీలో ఉన్న జనరల్ కొజ్లోవ్‌స్కీకి నివేదిక పంపి, తన తండ్రికి మరో ఉత్తరం రాసి హడావిడిగా ఇంటికి తిరిగివచ్చాడు. ఈ మొరటు మనిషిని తనతో వదిలి వెళ్లినందుకు భార్య కోపం తెచ్చుకుంటుందేమోనని భయపడ్డాడు. కానీ ఇంట్లో పరిస్థితి అందుకు భిన్నంగా ఉంది. కుర్చీలో వెనక్కి వాలి కూర్చున్న హాజీమురాద్, ఆరేళ్ల బుల్కాతో ఆడుకుంటున్నాడు. వీడు తన భార్యకు మొదటి భర్తతో కలిగిన సంతానం. కుర్రాడు అతడి ఒళ్లో కూర్చున్నాడు. ఇల్లంతా నవ్వులతో మునిగి తేలుతున్నది. 'సోదరుడిని కదా అని అడిగిందల్లా ఇస్తానంటే ఒంటి మీద నూలు పోగు కూడా మీకు మిగలదు' అంటున్నది మార్యా.

ప్రిన్స్‌ను చూసి, హాజీమురాద్ ఒక్క ఉదుటన లేచి నిల్చున్నాడు. మీద కూర్చున్న బుల్కా కిందికి దూకి కోపం తెచ్చుకున్నాడు. వాడి మొహంలో నవ్వు మాయమైంది. కోపంగా చూశాడు. వొరొం

ట్సొవ్ కూర్చున్న తర్వాత కుర్చీలో తనూ కూర్చుని సంభాషణ కొనసాగిస్తూ "సోద రుడు ఇష్టపడింది, కోరింది ఏదైనా ఇచ్చే యటం తమ ఆచారం" అన్నాడు హాజీము రాద్.

"బుల్కాకు అతడి చురకత్తి నచ్చింది" అంది మార్యా.

గర్వంగా, అప్పటిదాకా దాచుకున్న చుర కత్తి చూపించాడు బుల్కా.

"చాలా బాగుంది. నేనెలా ప్రత్యుపకారం చెయ్యగలనో అడుగు" అన్నాడు దుబాసీతో వొరొంట్సొవ్.

"నాకేమీ అక్కర్లేదు. నమాజు చేసుకోవ టానికి చోటు కావాలి" అన్నాడు హాజీము రాద్.

సేవకులను పిలిచి, అవసరమైన ఏర్పాట్లు చెయ్యమన్నాడు వొరొంట్సొవ్.

ఆ తర్వాత కొద్దిసేపటికే ఏకాంతంలో హాజీమురాద్ ముఖకవళికలు మారిపో యాయి. పెదాల మీద ఆ చిరునవ్వు ఇ ప్పుడు లేదు. ఆందోళనగా అటూ ఇటూ పచారు చేశాడు. తను ఊహించిన దాని కన్నా సాదరంగా తన లొంగుబాటును అంగీకరించాడు వొరొంట్సొవ్. కాని ఆ 'అతిమర్యాద', 'అతిప్రేమ'లోనే ఏదో వ్యూహం దాగుంది. వొరొంట్సొవ్‌ను, అతని అధికారులను ఎంతవరకు విశ్వసిం చవచ్చు? అంతటి ధైర్యవంతుణ్ణి కూడా భయం వేధించింది. అరెస్టు చేసి, గొలు సులతో సైబీరియాకు తరలించరా? ఎందు కంత శ్రమ? సింపుల్‌గా చంపేసినా చంపేస్తారు. తన జాగ్రత్తలో తనుండాలి. ఎల్దార్ ప్రవేశించగానే, తన అనుచరులు ఎక్కడ ఉన్నారు? ఎలా ఉన్నారని అడి గాడు. ఆయుధాలు తమ దగ్గరే ఉన్నాయా? లేక వాళ్లు లాగేసుకున్నారా? గుర్రాలెక్కడ కట్టేశారు? అని అడిగాడు.

ప్రిన్స్‌గారి అశ్వశాలలోనే తమ గుర్రాలు ఉన్నాయన్నాడు ఎల్దార్. ఆయుధాలు తమ దగ్గరే ఉన్నాయనీ, దుబాసీ స్వయంగా తమకు భోజనం, టీ అందచేస్తు న్నాడని చెప్పాడు.

సందేహంగా తలూపాడు హాజీమురాద్. దుస్తులు మార్చుకుని, నమాజు ముగించి తన వెండి చురకత్తి తీసుకురమ్మని ఎల్దా ర్‌తో చెప్పాడు. మళ్లీ డ్రెస్ చేసుకుని బెల్ట్ పెట్టుకుని, ఏ అనూహ్య పరిణామానికైనా సిద్ధమన్నట్టు కూర్చున్నాడు.

నాల్గింటికి దుబాసీ వచ్చి, ప్రిన్స్‌తో కలిసి భోజనం చెయ్యటానికి ఆహ్వానించాడు.

కొద్దిగా పలావు తప్ప మరేమీ తినలేదు హాజీమురాద్. అదికూడా పళ్లెంలోంచి మార్యా వాసిలెవ్నా తీసుకున్న వైపు నుండే తనూ కొద్దిగా తీసుకున్నాడు.

"మనం విషం కలుపుతామేమోనని అతను అనుమానిస్తున్నాడు" అని మార్యా భర్తతో చెప్పింది. ఆ వెంటనే హాజీము రాద్ వైపు తిరిగి, దుబాసీ ద్వారా "మళ్లీ ఎప్పుడు ప్రార్థన చేస్తారు?" అని అడి గింది. హాజీమురాద్ అయిదువేళ్లు చూపిం చాడు. వొరొంట్సొవ్ తన వాచి స్ప్రింగ్ నొక్కి 'ఎక్కువసేపు లేదు' అన్నాడు. అప్ప టికి టైం నాలుగుంపావు అయింది. ఆశ్చ ర్యపడి, తను కూడా వాచీ చూస్తానన్నాడు హాజీమురాద్.

వొరొంట్సొవ్ తన వాచీ అందించాడు హాజీమురాద్‌కు. పలుసార్లు చేతులు ఛాతీ మీద పెట్టుకుని, స్ప్రింగ్ ప్రెస్ చేసి గడి యారం చెవిదగ్గర పెట్టుకుని విన్నాడు.

విందు ముగిసింది.

ఉన్నతాధికారి మెల్లర్ జకోమెల్‌స్కీ తర ఫున ఓ మనిషి వచ్చాడని చెప్పాడు సేవ కుడు.

అసలు విషయమేమిటంటే హాజీము రాద్ లొంగిపోయిన విషయం తెలిసి మెల్లర్ జకోమెల్‌స్కీ కోపంగా ఉన్నాడు

ఇంతవరకూ ఈ ముఖ్య సమాచారం తనకు రిపోర్ట్ చెయ్యనందుకు. తక్షణమే లొంగిపోయిన వ్యక్తిని అతని ముందు ప్రవేశపెట్టాలి. జనరల్ గారి ఆదేశం శిరసావహించక తప్పదని వొరొంట్సొవ్‌కు తెలుసు. ఆ మనిషి వెంట మెల్లర్ వద్దకు వెళ్లాలని హాజీమురాద్‌తో దుబాసీ ద్వారా చెప్పించాడు.

జనరల్‌కు కోపం వచ్చిందని మార్యాకు కూడా తెలుసు. ఇది కాస్త ఇబ్బందికరమైన విషయమే. భర్త వారించినా వినకుండా, వాళ్ల వెంట తనూ జనరల్ వద్దకు వస్తానంది.

"తర్వాత వెళ్లొచ్చుగా"

"ఇప్పుడే వస్తాను"

వొరొంట్సొవ్ అంగీకరించక తప్పలేదు.

★ ★ ★

ముగ్గురూ ప్రవేశించగానే మర్యాదగా, మార్యాను తన భార్యకు పరిచయం చేసి, హాజీమురాద్‌ను వెయిటింగ్ రూంలోకి వెళ్లమని, తదుపరి ఆజ్ఞలు ఇచ్చేంతవరకు అతణ్ణి బయటకి రానివ్వవద్దని అనుచరులను ఆజ్ఞాపించాడు జనరల్ మెల్లర్ జకోమెల్‌స్కీ. ఆ తర్వాత వొరొంట్సొవ్‌ను తన స్టడీ రూంలోకి ఆహ్వానించాడు. కాని ఆ తర్వాత తలుపు మూసి అతణ్ని కనీసం కూర్చొమ్మని కూడా అనకుండా "ఈ ప్రాంతానికి అధికారిని నేను. నా ద్వారా మాత్రమే శత్రువుతో చర్చలు జరపాలి. హాజీమురాద్ మన పక్షం వచ్చి లొంగిపోయిన విషయం నాకెందుకు రిపోర్ట్ చెయ్యలేదు? " అడిగాడు.

"మధ్యవర్తి వచ్చి, అతడు కేవలం నాకే లొంగిపోదలచుకున్నాడని చెప్పాడు" అన్నాడు వొరొంట్సొవ్ ఉద్రేకాన్ని అణచుకుంటూ. జనరల్ పరుషంగా మాట్లాడబోతున్నాడని అతడికి తెలుసు.

"నాకెందుకు సమాచారమివ్వలేదని అడుగుతున్నాను? "

"బేరన్, మీకు రిపోర్ట్ చేద్దామనే అనుకున్నాను కాని..."

"నన్ను బేరన్ అని కాదు, యువర్ ఎక్సెలెన్సీ అని సంబోధించాలి..." సరిగ్గా అక్కడ ఆయన కోపం కట్టలు తెంచుకుంది.

"ఇరవై ఏడేళ్లుగా నేను చక్రవర్తి సేవలో ఉన్నాను. కుటుంబ సంబంధాల వల్ల నిన్నగాక మొన్న సైన్యంలో చేరిన ఒక కుర్రకుంక, తనకు సంబంధించని వ్యవహారాల్లో నన్ను ధిక్కరించి..."

"యువర్ ఎక్సెలెన్సీ.. మీరు అసత్యాలు పలుకకూడదు"

"నేను చెప్పేది సత్యమే. నా అనుమతి లేకుండా..."

సరిగ్గా అప్పుడు డ్రెస్సు రెపరెపలాడగా మార్యా గదిలోకి ప్రవేశించింది.

"బేరన్‌గారూ శాంతించండి. నా భర్తకు మిమ్మల్ని అవమానించే ఉద్దేశ్యం ఎంత మాత్రం లేదు.." అంటూ ప్రారంభించింది మార్యా.

"నేను దాని గురించి మాట్లాడటం లేదు ప్రిన్సెస్"

"సర్లెండి. అంతా మరచిపోదాం. ఎలాగ సాధించినా, యుద్ధంకన్నా శాంతి మేలు గద" అంటూ నవ్వింది మార్యా.

## కొత్తగాలి...

**ఇంట్లో గోడల మీద**
**అమ్మా నాన్నల ఫొటో ఎందుకు**
**వాళ్లిద్దరు**
**నీ రెండు కళ్లల్లోవుండగ**

– పి.వి.ఎన్. ప్రసాద్,
నవులూరు

ఆ నవ్వుకు కరిగిపోయాడు జనరల్.

"నేను చేసింది తప్పే. కాని..." అనబోయాడు వొరొంట్సొవ్.

"నేను కూడా కొంచెం మాట జారానులే..." అంటూ కరచాలనం కోసం చేయి చాపాడు మెల్లర్.

శాంతి పునరుద్ధరించబడింది. ప్రస్తుతానికి హాజీమురాద్‌ను జనరల్ ఆధీనంలో వుంచటానికి ఆ తర్వాత సంబంధిత కమాండర్‌కు అప్పగించటానికి నిర్ణయించారు.

పక్కగదిలో కూర్చున్న హాజీమురాద్‌కు మాటలు వినిపించాయిగాని అర్థం కాలేదు. అయినా వాళ్లు తనగురించే పోట్లాడుకుంటున్నారని తెలిసింది. షామిల్‌ను వదిలి రష్యన్‌పక్షం రావటం, వ్యూహాత్మకంగా వీళ్లకు చాలా కీలకమైన విషయమే. తాను వాళ్ళకు చాలాముఖ్యం. అందువల్ల తనను చంపరు. నిజానికి డిమాండ్ చేసి వాళ్లనుండి బాగానే రాబట్టవచ్చు. జనరల్ అయినప్పటికీ, మెల్లర్ జకోమెల్‌స్కీకి, తన కింది అధికారి వొరొంట్సొవ్‌కున్నంత పరపతిలేదు. అందువల్ల తర్వాత మెల్లర్ తనను ప్రశ్నించినప్పుడు, హాజీమురాద్ గర్వంగా, తన హోదా తగ్గించుకోకుండా సమాధానాలు చెప్పాడు. పర్వతాల్లోంచి మైదానాల్లోకి తను వచ్చింది జార్ చక్రవర్తి సేవలో తరించటానికి. కేవలం సర్దార్ అంటే కమాండర్-ఇన్-చీఫ్ అయినటువంటి ప్రిన్స్ వొరొంట్సొవ్ సీనియర్(కమాండర్ వొరొంట్సొవ్ తండ్రి)కి మాత్రమే లొంగిపోయాడు. వొరొంట్సొవ్ సీనియర్ టిఫ్లిస్ నగరంలో వుంటాడు.

★ ★ ★

గాయపడిన అవ్దీవ్‌ను ఆసుపత్రికి తీసికెళ్లారు. దుర్గం ముందరి భాగంలో చెక్క పలకలతో కట్టిన గదొకటుంది. అదే ఆసుపత్రి. జనరల్ వార్డ్‌లో ఒక బెడ్‌మీద పడుకోబెట్టారు క్షతగాత్రుణ్ణి. అతడుగాక, వార్డ్‌లో మరో నలుగురు పేషెంట్లున్నారు. ఒకడు టైఫాయిడ్ జ్వరంతో బాధపడుతున్నాడు. మరొకడికి మలేరియా. ఎప్పుడూ ఆవలిస్తుంటాడు. మరో యిద్దరు మూడు వారాల క్రితం గాయపడినవాళ్లు. ఒకడికి చేతిలో, మరొకడికి భుజంలో గాయమైంది. టైఫాయిడ్ రోగి తప్ప మిగతా అందరూ కొత్త పేషెంటును పలకరించారు.

"కొన్నిసార్లు బుల్లెట్ల వర్షం కురుస్తుంది. అయినా ఒక్కటీ తగలదు. ఈసారి వాళ్లు అయిదు సార్లే పేల్చారు" అన్నాడొక పేషెంట్.

"అంతా అదృష్టం. ఎలా రాసుంటే అలా జరుగుతుంది"

మంచంమీద పడుకోబెట్టినప్పుడు నొప్పి భరించలేక పెద్దగా కేకేశాడు అవ్దీవ్. ఆ తర్వాత మూలగలేదుగాని కళ్లు చిట్లించి, కాళ్లు కదుపుతూ పడుకున్నాడు.

డాక్టరు వచ్చి, పేషెంట్‌ను పక్కకు తిప్పమని చెప్పి, బుల్లెట్ శరీరం గుండా ప్రయాణించిందేమోనని పరిశీలించాడు.

వాళ్లు అతడి చొక్కాపైకి లేపగానే "ఇదేమిటి? " అంటూ ఆశ్చర్యంగా చూశాడు.

వీపు మీదా, కాళ్ళమీద వాతలు పెట్టినట్లు తెల్లటి గీతలున్నాయి.

"అవిప్పటివి కావు సార్" అన్నాడు అవ్దీవ్.

కొంతకాలం క్రితం డబ్బు స్వంతానికి వాడుకున్నందుకు యజమాని అతణ్ణి కొరడాలతో కొట్టాడు.

మరోసారి అవ్దీవ్‌ను తిప్పారు. బుల్లెట్ కనిపించింది గాని దాన్ని తీయలేకపోయాడు డాక్టర్. గాయానికి డ్రెస్సింగ్ చేసి ప్లాస్టర్ వేసి వెళ్ళిపోయాడు. డాక్టరు పరీక్షించినంత సేపూ కళ్లు మూసుకుని, పళ్లు బిగపట్టిన అవ్దీవ్, అతడు వెళ్లిపోగానే కళ్లు

తెరిచి ఆశ్చర్యంగా అటూ ఇటూ చూశాడు. డాక్టరుగారి అసిస్టెంటునూ, యితర పేషెంట్లనూ ఎగాదిగా చూశాడు. కాని అతడు చూసింది వాళ్లను కాదు. మరేదో అతణ్ణి ఆకర్షించింది.

అతడి స్నేహితులు పానోవ్, సెరోజిన్ వచ్చారు. కాని అతడు రవ్వంతైనా కదల్లేదు. మొహంలోని ఆశ్చర్యమూ తగ్గలేదు. చాలా సేపటికి వాళ్లను గుర్తుపట్టినట్టుగా తలాడించాడు.

"మీ యింటి వాళ్ళకేమైనా చెప్పాలా?" అని అడిగాడు పానోవ్.

అతడివేపే చూసినా అవ్దీవ్ సమాధానం చెప్పలేదు.

"నిన్నే అడుగుతున్నాను. ఇంటివాళ్లకేమైనా చెప్పాలా?" మళ్లీ అడిగాడు పానోవ్ అతడి చేయితట్టి.

అప్పుడు ఈ లోకంలోకి వచ్చినట్టుగా "ఆ... పానోవ్!" అంటూ ఆశ్చర్యం ప్రకటించాడు అవ్దీవ్.

"ఆఁ... నేనే. నీకోసం వచ్చాను. ఇంటి వాళ్లకేమైనా చెప్పాలా? సెరోజిన్ ఉత్తరం రాస్తాడు"

"సెరోజిన్!..." అంటూ అతడివైపు యిబ్బందిగా చూశాడు ఆవ్దీవ్.

"నువ్వు రాస్తావా... సరే రాయి. మీరందరూ చిరకాలం సుఖంగా బతకాలి. మా అన్న...వాడు హాయిగా బతుకుతున్నాడు. సంతోషం! దేవుడందర్నీ చల్లగా చూడనీ...." అన్నాడతడు.

"ఇంకా?"

"ఇంకేం లేదు. కొవ్వొత్తి వెలిగించు. నేను చచ్చిపోతున్నాను" అన్నాడు అవ్దీవ్.

అప్పుడే పోల్టోరాట్స్కీ వచ్చాడు, వాకబు చెయ్యటానికి.

"ఎలా వుంది మై బాయ్?"

కళ్లు మూసుకుని అడ్డంగా తలూపాడు అవ్దీవ్. మొహం కళ తగ్గింది. మళ్లీ పానోవ్‌తో "కొవ్వొత్తి కావాలి. చచ్చిపోతున్నాను" అన్నాడు.

మైనం కాగితం అతడి వేళ్ళ మధ్యన

## రచనావ్యాసంగమే కాలక్షేపం



ముక్తవరం పార్థసారథి

చాలాకాలంగా రాస్తూనేవున్నాను. నా తొలి నవల 'రంగులవల'కు 1969లో ఒక వారపత్రిక నిర్వహించిన ఉగాది నవలల పోటీలో మొదటి బహుమతి వచ్చింది. అంతకు ముందు, ఆ తర్వాతా వివిధ పత్రికల్లో నా కథలు చాలా అచ్చయ్యాయి.

నా యితర నవలలు.. నువ్వూ, నేను, చిన్నారావు; కౌగిలి, కలలనీడలు, దమయంతి, మలివెలుగు, మనసులోని చలి, కించిద్విషాదం, శూన్యం. 1978 మే 'చతుర'లో 'పరువు' ప్రచురితమైంది.

2003 నుండి పుస్తక పరిచయాలు, సాహిత్యవ్యాసాలు, అనువాదాలతో కాలక్షేపం.

కొన్నేళ్ల క్రితం చతురలో 'రచయితలకు ప్రత్యేకం' శీర్షిక నిర్వహించాను.

విశ్వవిఖ్యాత రష్యన్ రచయిత టాల్‌స్టాయ్ చివరి నవల 'హాజీమురాద్'ను చతుర ద్వారా తెలుగు పాఠకులకు పరిచయం చేసే అవకాశమిచ్చిన సంపాదకులకు కృతజ్ఞతలు!

చిరునామా :
ముక్తవరం పార్థసారథి
411, ప్రభాత్‌కర్ అపార్ట్‌మెంట్స్,
విజయనగర్ కాలనీ,
హైదరాబాద్-500057

పెట్టారుగాని, దాన్ని కూడా మడవలేకపో యాడు అవ్దీవ్.

పోల్టోరాట్స్కీ వెళ్లిపోయాడు. ఒక ఆర్డర్లీ, అవ్దీవ్ గుండెమీద చెవిపెట్టి చూసి "అంతా అయిపోయింది" అన్నాడు.

టిఫ్లిస్‌కు పంపిన నివేదికలో అవ్దీవ్ మరణం గురించి యిలా రాశారు:

నవంబర్ 23: కురిన్ రెజిమెంట్‌కు చెందిన రెండు కంపెనీలు చెట్లు నరకటా నికి బయల్దేరాయి. మధ్యాహ్నం పర్వతా ల్లోంచి వచ్చిన తిరుగుబాటుదార్లు అనేక మంది కంపెనీల మీద దాడి చేశారు. తుపాకులున్న కంపెనీ వెనక్కు తగ్గినా, బాయ్‌నెట్లతో రెండవ కంపెనీ తిరుగు బాటుదార్లను దీటుగా ఎదుర్కొంది. ఈ ఘర్షణలో ఇద్దరు సైనికులు గాయపడ్డారు. ఒకడు మరణించాడు. తిరుగుబాటుదా ర్లలో వందమంది మరణించారు లేదా గాయపడ్డారు.

★ ★ ★

ఆసుపత్రిలో అవ్దీవ్ మరణించిన రోజున, స్వగ్రామం వోడ్విజెన్స్కయలో అతడి తండ్రి పొలంపనుల్లో తలము నకలుగా వున్నాడు. అన్నకు బదులుగా అ వ్దీవ్ సైన్యంలో చేరాడు. పెళ్ళికెదిగిన కూతురితో మంచు గడ్డకట్టిన నేలమీద ఓట్స్ ధాన్యం తూర్పారబడుతున్నాడు.

క్రితం రాత్రి మంచు విపరీతంగా కురి సింది. తెల్లవారేసరికి రాయిలా, గట్టిప డింది. కోళ్లు మూడోసారి కూసినప్పుడు లేచాడు ముసలాయన, అవ్దీవ్ తండ్రి. మంచుపట్టిన కిటికీ అద్దాలమీద మెరుస్తున్న వెన్నెలను చూసి స్టౌ దిగి, (చలికి విశాలమైన స్టౌలమీదే పడుకుం టారు పేదలు) బూట్లూ, గొర్రెతోలు కోటూ తొడుక్కుని, టోపీ పెట్టుకుని, ధా న్యం తూర్పారపట్టే చోటుకి నడిచాడు. అక్కడ రెండు గంటలు పనిచేసి, యింటికి తిరిగివచ్చి కొడుకునీ, ఆడవాళ్లనీ లేపాడు. కాసేపట్లో అందరూ పనిలో మునిగిపో యారు.

చంద్రుడు తూర్పున అదృశ్యమయ్యాడు. తెల్లవారింది. పని చాలా వరకు ముగి సింది. అప్పుడు ఆవలిస్తూ అక్కడికి చేరు కున్నాడు అతడి పెద్ద కొడుకు అకీం.

"ఇప్పటిదాకా ఎక్కడ పడి పొర్లుతున్నా వురా? " అంటూ కసురుకున్నాడు ముసలా యన.

"గుర్రాలను చూసి వస్తున్నాను...."

"గుర్రాలట గుర్రాలు. ముసిల్ది కూడా ఆ పని చెయ్యగలదు. బాగా కొవ్వు బలిసింది తాగుబోతు వెధవా, ఆ కర్రతీసుకుని పని ప్రారంభించు" అంటూ అరిచాడు.

"నువ్వే తాగించినట్లు మాట్లాడతావేం" అంటూ గొణుక్కున్నాడు కొడుకు.

కోపంగా చూశాడు తండ్రి.

లయబద్ధంగా అందరి చేతులూ కలి శాయి.

"అమాయకుడు. నీకు బదులు నీ త మ్ముడు పీటర్ సైన్యంలోకెళ్లాడు. అక్కడ, నీలాంటి పనిదొంగలకు బాగా బుద్ధి చెప్పే వాళ్లు. నీలాంటివాళ్లు అయిదుగురితో వాడొక్కడు సమానం" అన్నాడు తండ్రి.

"చాల్లే, యింక మీ చదువుడాపండి" అంది కోడలు కాస్త విసుగ్గా.

"అవునవును. పనిచెయ్యని మీ ఆరు గుర్ని మేపటమేగా నా బాధ్యత! పీటర్, ఇద్దరు మనుషుల పని చేసేవాడు. వాడు వీడిలాగా కాదు"

నేలమీద చెల్లాచెదురుగా పడివున్న ధాన్యాన్ని ఒక చోటికి చేర్చారు. అప్పుడు నెమ్మదిగా నడిచి వచ్చింది ముసలాయన భార్య- కాళ్లకు ఉన్ని గుడ్డలు కట్టుకుని, చెట్ల బెరడుతో చేసిన పాదరక్షలతో. ఆమె నడకకు కింద మంచు పగిలింది.

"ఇటుకలు ఎక్కడికో తోలేదుందట, పెద్ద

## మంచు ముచ్చట్లు!

పాశ్చాత్య దేశాల్లో ఎక్కువగా మంచు కురవడం సహజం. ఆ మంచుపై వారు పరిశోధనల్ని చేసి ఎన్నో విషయాలు కనుగొన్నారు.

★ మంచు అంతా ఒకే రకానికి చెందింది కాదు. పోపో, మేష్డ్ పొటాటో, షాంపేన్, కేలి ఫ్లవర్, స్టిక్‌స్నో, డస్ట్ ఆన్ క్రస్ట్‌లాంటి పేర్లను మంచు రకాన్ని బట్టి పెట్టారు. షాంపేన్ స్నో పౌడర్‌లా ఉంటే, మేష్డ్‌పొటాటో బురదలా ఉంటుంది.



★ మంచు బిందువు అరం గుళం కంటే తక్కువ పరిమాణంతో 180 బిలియన్ నీటి పరమాణువులను కలిగి వుంటుంది. 1887లో మాత్రం 15 అంగుళాల వెడల్పు, 8 అంగుళాల మందంగల స్నోఫ్లేక్‌ని మొంటానా రాష్ట్రంలో కనుగొన్నారు. ఇదే అతి పెద్ద స్నోఫ్లేక్.

★ మంచు తెల్లగా ఉంటుందనుకుంటాం. కాని ఎరుపు, పసుపు, ఆరెంజ్, ఆకుపచ్చ, వంకాయ రంగుల్లో ఉండే మంచు ధ్రువప్రాంతాల్లో కన్పిస్తుంది.

★ 1989లో వాషింగ్టన్ లోని మౌంట్ బేకర్ అనేచోట 1140 అంగుళాల మంచు కురిసింది. ఇది ప్రపంచ రికార్డ్.



★ కెనడాలోని పీవనక్ నుంచి గిల్లమ్ దాకా మంచు రోడ్డును నిర్మిస్తుంటారు. మంచుతో ప్రతిఏటా నిర్మించే అతి పెద్ద రోడ్డు ఇదే.

★ మంచుతుపాను వల్ల సగటున 3.9 కోట్ల టన్నుల బరువు గల మంచు కురుస్తుంది.

★ 2007లో డచ్ దేశస్థుడు విమ్‌హాఫ్ మంచు మీద నగ్న పాదాలతో రెండు గంటల పదహారు నిమిషాల ముప్ఫై నాలుగు క్షణాలు పరుగెత్తి రికార్డు స్థాపించాడు.

★ చైనాలో హెయ్ లాంగ్‌జియాంగ్ వద్ద 2007లో ఆరువందల మంచు శిల్పాలను చెక్కారు. ఇది అతి పొడవైన మంచు శిల్పకళగా గిన్నిస్‌బుక్‌లోకి ఎక్కింది. మంచు శిలలపై 656 అడుగుల పొడవున 115 అడుగుల ఎత్తుగల గుహలు, శిల్పాలను చెక్కారు.

---

రైతు రమ్మని కబురు పెట్టాడు" అందావిడ ధాన్యం దగ్గిరకు వూడ్చి.

"సరే, నువ్వు బండి కట్టుకుని పో. జాగ్రత్త, మళ్లీ నన్ను చిక్కుల్లోకి లాగకు. పీటర్ లేకపోవటంతో, చెయ్యి విరిగినట్టుగా వుంది" అంటూ అకీంను మందలించాడు వృద్ధుడు.

"ఇంట్లో వున్నంతకాలం వాణ్నిమాత్రం దెప్పిపొడవలేదా ఏమిటి? ఇప్పుడు నన్నంటున్నావు" అన్నాడు అకీం.

"నిన్నెంత తిట్టినా తక్కువే. పీటర్‌కూ నీకూ పోలికేమిటి? " అంది తల్లి.

"సరేలే, పోతున్నాను" అన్నాడు కొడుకు.

"తాగుబోతా, సరేలే అంటున్నావా!"

"ఇక మీ సాధింపులు ఆపుతారా? " అంటూ విసుక్కుంది కోడలు.

పీటర్ యిల్లు వదిలినప్పటి నుండీ, తండ్రీకొడుకుల మధ్య ఈ సూటి పోటీ మాటలు కొనసాగుతూనే వున్నాయి. అప్పుడు కూడా గొడ్డులా పనిచేసే కొడుకును దూరం పంపి, పనికి బద్ధకించే అడ్డగాడిదను యింట్లో పెట్టుకున్నాననే అనుకున్నాడు. అయితే యిలా చెయ్యటానికి ఒకే ఒక్క కారణముంది. పెద్దవాడికి నలుగురు పిల్లలున్నారు. పీటర్‌కు ఒక్కడే చంటిపిల్లాడు. కాని వాడు మహా పనిమంతుడు.



క్షణం విరామమెరుగక, రోజంతా పనిచే స్తాడు. ఇతర్ల పనికూడా తనమీద వేసు కుంటాడు. చెట్లు నరకాలన్నా, కట్టెలు కొట్టాలన్నా నాగలి పట్టాలన్నా, బండిలో ధాన్యం నింపి పక్కవూళ్లకు తోలాలన్నా, అన్నీ తానే చేస్తాననేవాడు. చేతికంది వచ్చిన కొడుకును వదులుకున్నందుకు ముసలాయన నిట్టూర్చాడు. సైన్యంలో చేర టమంటే ఆ రోజుల్లో చావుతో సమానం. సైనికుడంటే విరిగిన కొమ్మ. తలచుకొంటే గుండె చెరువవుతుంది. పెద్దకొడుకును మందలించటానికి ములుగర్రలా మాత్రమే వాణ్ణిప్పుడు తలచుకుంటున్నాడు. తల్లి కూడా కొడుకును తలచుకుని దుఃఖించని రోజులేదు. ఇప్పటికి ఏడాది దాటింది. అక్కడ ఎలాగుంటున్నాడో, కాసింత డబ్బు పంపించమని చాలాసార్లు చెప్పి చూసింది. కాని ముసలాయన 'చూద్దాంలే' అంటూనే వున్నాడు.

వాళ్లు సంపన్న రైతులే. ముసలాయన పొదుపుగా బతికి బాగానే వెనకేశాడు. కాని ఎంత అవసరమొచ్చినా సరే, పైసా విదల్చడు.

ఇప్పుడు మళ్లీ చిన్నకొడుకు ప్రస్థావన రావటంతో, ఎలాగైనా ఓట్స్ అమ్మిన తర్వాత, వాడికి ఓ రూబుల్ పంపించ మని పట్టుబట్టాలనుకుంది. అందరూ ఎవరి పనులమీద వాళ్లు వెళ్లిపోయిన తర్వాత భర్తతో మొండికేసి, పంట అమ్మిన తర్వాత రూబుల్ పంపటానికి ఒప్పించింది. మూడు స్లెడ్జిబళ్లలో తొంభై ఆరు బుషెల్ల ధాన్యం నింపి, పైన గోతాంగుడ్డ కప్పి, ప్రయాణానికి సిద్ధం చేసినప్పుడు చర్చి గుమస్తాతో తను



రాయించిన ఉత్తరం భర్త చేతికిచ్చి, టౌనుకు చేరగానే, ఆ వుత్తరంతోపాటు రూబుల్ కూడా సరైన చిరునామాకు చేరే టట్టుగా చూడాలని చెప్పింది.

కొత్త గొర్రెతోలు అంగరఖా తొడుక్కుని, దానిమీద ఇంట్లోనేసిన మరో గుడ్డ చుట్టు కుని, కాళ్లకు తెల్లటి పట్టీలు కట్టుకుని వుత్తరం పర్సులో పెట్టుకుని, ప్రార్థన చేసి ముందరి స్లెడ్జిబండిలో కూర్చుని టౌనుకు బయల్దేరాడు ముసలాయన. చివరి బండిలో అతడి మనవడు కూర్చున్నాడు. టౌను చేరుకుని, సత్రం యజమాని చేత వుత్తరం చదివించుకుని విని సంతోషించాడు.

ఉత్తరంలో తల్లి మొదట అతణ్ణి ఆశీర్వదించి, తర్వాత అభినందించి, చిన్న చిన్న యింటి విషయాలు రాసి, అతడి భార్య అక్సిన్యా తమ దగ్గర వుండటానికి యిష్టపడలేదనీ, మరోచోట ఎక్కడో పనిచేసుకుని బతుకుతున్నా చక్కగా కట్టుబాట్లలోనే వుంటున్నదనీ చెప్పింది. ఆ తర్వాత రూబుల్ పంపిస్తున్న విషయం కూడా చెప్పి 'తనను తలచుకుంటూ బోరుమంది' అని రాశాడు చర్చి గుమాస్తా. కానీ పీటర్‌కీ వుత్తరం చేరలేదు. భార్య వేరుగా వుంటున్న విషయం తెలియదు. రూబుల్ అందలేదు. ఉత్తరంతో సహా అదికూడా తిరిగి వచ్చింది. జార్ చక్రవర్తినీ, మాతృభూమినీ, సనాతన క్రైస్తవమతాన్నీ రక్షించే మహాకార్యంలో పీటర్ యుద్ధంలో మరణించాడు. అదీ వాళ్ళకు చేరిన సందేశం.

వార్త విని తల్లి శోకాలు పెట్టింది. గుండెలు బాదుకుని ఏడ్చింది- తీరిక దొరికినప్పుడల్లా. కాని పని ఆగదు. మరుసటి

ఆదివారం, చర్చిలో పీటర్ పేర ప్రత్యేక ప్రార్థనలు చేయించింది. అందరికీ రొట్టె ముక్కలు పంచిపెట్టింది.

ఏడాదిపాటే కలిసి సంసారం చేసినా, అక్సీన్యా కూడా వెక్కివెక్కి ఏడ్చింది. అతడి అందమైన రూపాన్ని, ప్రేమను తలచుకుని కుమిలిపోయింది. తన కొడుకు వంకాను అనాథను చేసినందుకు కోపం తెచ్చుకుంది. అన్నమీద వున్న ప్రేమ, కట్టుకొన్న పెళ్లాం మీద, కన్నకొడుకుమీద లేదా! ఊరూపేరూ తెలియని కొత్త మనుషుల మధ్య తాను బతకాలా?

అయినా ఒకందుకు ఆమె సంతోషించింది. కిరాణాకొట్టు యజమానివల్ల తను రెండోసారి గర్భం దాల్చింది. ఈ పనిచేసినందుకు యిప్పుడు తననెవరూ నిందించరు. భర్త మరణించాడని చెబితే అతడు తనను తప్పక పెళ్లి చేసుకుంటాడు.

3



**మై**ఖేల్ సెమెనోవిచ్ వొరొంట్సొవ్ (ఇప్పటికే మనకు తెలిసిన సైమన్ వొరొంట్సొవ్‌కు తండ్రి) రష్యన్ రాయబారిగా పనిచేశాడు. ఇంగ్లండులో చదువుకున్నాడు. ఇలా విదేశీ విద్యనభ్యసించడం, ఆనాటి రష్యన్ అధికారుల్లో ఒక అపురూపమైన విషయం. అతడికి అధికారదాహం ఎక్కువ. కిందివాళ్లతో దయగా, ప్రేమగా, పైవాళ్లతో వినయంగా వుంటాడు. అధికారానికి లొంగివుండాలి. లేదా అధికారం చలాయించాలి. ఇలా తప్ప, అతడికి ఈ జీవితం మరోలా అర్థం కాదు. అత్యున్నత పదవులు, గౌరవాలు అతణ్ణి వరించాయి. క్రాస్నో వద్ద నెపోలియన్‌ను పరాజితుడిని చేసిన కమాండర్‌గా అతడికి ప్రత్యేక గుర్తింపు ఉంది.

1852లో అతడికి డెబ్బై దాటాయి. అయినా అంత వయస్సున్నట్టు కనిపించడు. వైస్‌రాయ్‌గా పెద్దజీతం వస్తుంది. తన ఆస్తి, తన భార్య (కౌంటెస్ బ్రాంటిస్కీ) ఆస్తి కలిసి ఎంతుంటుందో ఎవరికీ తెలియదు. క్రిమియాలో సముద్రతీరాన, విశాలమైన గార్డెన్‌లో ఒక రాజమహల్ లాంటిది కట్టించాడు.

డిసెంబర్ 4 నాటి సాయంత్రం, మూడు గుర్రాలు లాగిన ఒక బండీ వచ్చి, టిఫ్లిస్ లోని అతడి మహల్ ముందు ఆగింది. దుమ్ము కొట్టుకుపోయిన ఒక అధికారి, కోచ్‌లోంచి దిగి ఒళ్లు విరుచుకున్నాడు. దూరప్రయాణం చేసివచ్చాడేమో అలసటగా వుంది. హాజీమురాద్‌ను అప్పగించటానికి, జనరల్ కొజ్లోవ్‌స్కీ పంపగా వచ్చాడతడు. అప్పటికి ఆరైంది. వొరొంట్సొవ్‌కది డిన్నర్ టైం. ఆగంతకుడి విషయం తెలిసింది. మొదట వ్యవహారం ముగించాడు. భోజనం కాస్త ఆలస్యమైనా ఫరవాలేదు.

అతడు డ్రాయింగ్ రూంలోకి ప్రవేశించగానే తను డిన్నర్‌కు ఆహ్వానించిన ముప్ఫైమంది అతిథులూ, ప్రిన్సెస్ సవెరెవ్నా వొరొంట్సొవ్నా అభివాదం చేశారు. నల్లటి మిలిటరీ దుస్తుల్లో హుందాగా కనిపించాడు వొరొంట్సొవ్.

షేవ్ చేసుకున్న అతని మొహంలో చిరునవ్వు వెలిగింది. కళ్లు అందర్నీ ప్రేమగా పలకరించాయి. ఆహూతులను లోపలికి ఆహ్వానించి, డైనింగ్ టేబుల్

వద్ద ఆసీనులుకమ్మని అర్థించాడు.

విందు ప్రారంభమైంది. అందరూ సూప్ తాగుతున్నారు. అప్పుడు సంచలన ప్రకటన చేశాడు ఒక జనరల్. కొన్నాళ్లుగా మంతనాలు జరుగుతున్న విషయం తనొక్కడికే తెలుసు. అదేమంటే చెచెన్ నాయకుడు షామిల్‌కు నమ్మినబంటు, అత్యంత ధైర్యవంతుడు, అత్యంత ప్రముఖుడు అయినటువంటి హాజీమురాద్ రష్యన్ పక్షం వచ్చి చేరాడు.

ఆశ్చర్యంగా తలెత్తి చూశారు అతిథులు.

"జనరల్, ఇంతవరకు మీరెప్పుడైనా హాజీమురాద్‌ను కలిశారా? " అంటూ ముద్దుముద్దుగా ప్రశ్నించిందో ప్రిన్సెస్.

"ఓ యస్. చాలాసార్లు"

1843లో చెచెన్లు గెర్గెబెల్ మీద పట్టు సాధించిన తర్వాత జనరల్ పాలెన్ సేనలను తరిమికొట్టి, తన కళ్లముందే జోలో టూఖిన్‌ను హాజీమురాద్ ఎలా చంపిందీ కళ్లక్కట్టినట్టు చెప్పాడు జనరల్.

మౌనంగా అంతా విన్నాడు వొరొంట్సొవ్. అప్పుడప్పుడూ మర్యాదగా నవ్వాడు. కాని తరువాత ముఖ కవళికలు మారిపోయాయి. అతడి వైపే చూస్తూ, హాజీమురాద్‌తో తన రెండవ ఎన్‌కౌంటర్ వివరించాడు జనరల్.

"మీకు బాగా జ్ఞాపకముండేవుంటుంది. మొన్నటికిమొన్న మీమీద దాడిచేయించింది అతడే. మిమ్మల్ని రక్షించటానికి వచ్చిన సైనికదళం కూడా బాగా నష్టపోయింది"

"ఎక్కడ? " అన్నాడు వొరొంట్సొవ్ అర్థం కానట్టు. దార్గో యుద్ధాన్ని ప్రస్తావించాడు జనరల్. అదనపు సైన్యం రాకపోయుంటే వొరొంట్సొవ్ బలగాలు మిగిలివేకావు. వొరొంట్సొవ్ సిగ్గుతో, అవమానంతో తల దించుకోవాల్సిన క్షణమది. కాని ఆ దార్గో యుద్ధంలో తాము విజయం సాధించామని జార్ చక్రవర్తికి నివేదిక పంపాడు వొరొంట్సొవ్. అసలు విషయం అందరికీ అర్థమైనా, అర్థంకానట్టు జనరల్ వైపు చూశారు అతిథులు.

తర్వాత ఆ యుద్ధంలో హాజీమురాద్ ఏవిధంగా పైచేయి సాధించాడో సవిస్తరంగా వివరించాడు. ప్రతిసారీ 'రక్షణకు అదనపు బలగాలు సకాలంలో చేరనట్లయితే' అని నొక్కి పలికాడు.

వొరొంట్సొవ్‌కు ముళ్లమీద కూర్చున్నట్లుగా వుంది. ఎలాగైనా విషయం మార్చాలని "టిఫ్లిస్‌లో తన అధికార నివాసం సుఖంగా వుందా? " అని అడిగిందో ప్రిన్సెస్. ఈ వూహించని ప్రశ్నకు ఆశ్చర్యపోయి, ఏం చెప్పాలో తెలియక, అందరి మొహాలూ ఒకసారి పరిశీలించి, తన ముందు ప్లేట్‌లో వున్నదేదో గబగబా మింగేశాడు జనరల్.

అందరూ కాస్త యిబ్బందిగానే చూశారు. పెద్దాయన మాటలకు అడ్డుపడటం మర్యాద కాదు. అయితే జార్జియాకు చెందిన ఒక ప్రిన్స్- మహా మూర్ఖుడు. ఎప్పుడేం మాట్లాడాలో తెలియదు. అతడు అత్యుత్సాహంగా ఓ పిట్టకథ చెప్పటంతో వాతావరణం కాస్త తేలికపడింది. ఒకసారి అహమద్ ఖాన్‌కు చెందిన వితంతువును హాజీమురాద్ ఎలా ఎత్తుకెళ్లాడో రసవత్త

**కొత్తగాలి...**

**'నిద్ర'....**
**అదో కలల ప్రపంచం...**
**మరి 'మెలకువ'...**
**ఇదో కల్లోల ప్రపంచం!**

– యు. చిట్టిబాబు,
కొత్తపాల్వంచ

రంగా వినిపించాడతడు.

"ఒకరాత్రి మెహతులి గ్రామానికి వచ్చి, తనక్కావలసిన మనిషిని అలా చేతుల్లో ఎత్తి పట్టుకుని, తన అనుచరులతో గుర్రం మీద ఉడాయించాడు"

"ఆవిడ మీదే ఎందుకు మనసుపడ్డాడు? " అని అడిగింది ప్రిన్సెస్.

"ఆవిడ భర్త అతడి శత్రువు. అతడిపై విజయం సాధించలేని హాజీమురాద్ తన ప్రతీకారం అలాగ తీర్చుకున్నాడు"

ప్రిన్సెస్, ఈ మాటల్ని తన పక్కన కూర్చున్న కౌంటెస్‌కు, ఫ్రెంచిలోకి అనువదించి చెప్పింది.

> **కొత్తగాలి...**
>
> **అనంతమైనది.. శాశ్వతమైనది**
> **వస్తూవస్తూ గోలెడుతుంది**
> **పోతూపోతూ ఛీకొడుతుంది**
> **అన్నిటికంటే కమ్మనైనది ఆకలి!**
>
> – నితీష్ చంద్రశేఖర్,
> కర్నూలు

"ఆమెనేం చేశాడింతకూ? " అని ఫ్రెంచిలో అడిగింది కౌంటెస్.

"ఆమెతో చాలా మర్యాదగానే ప్రవర్తించాడు. తరువాత విడుదల చేశాడని కూడా తెలిసింది" అన్నాడు వొరొంట్సొవ్ చిరునవ్వుతూ.

"అవును, విడుదల కోసం డబ్బులు బాగానే డిమాండ్ చేశాడు"

"మొత్తంమీద గౌరవప్రదంగానే వ్యవహరించాడు"

అలా వొరొంట్సొవ్ మాటలతో సంభాషణ కొత్తదారి పట్టింది. హాజీమురాద్‌కు ప్రాముఖ్యం పెంచి మాట్లాడితే, పెద్దాయన సంతోషిస్తాడని టేబుల్ వద్ద కూర్చున్న వాళ్లు తెలుసుకున్నారు.

"కాని, మహా మొండిమనిషి. ఆత్మాభిమానం మెండు. మొత్తం మీద గట్టివాడు"

"అంతెందుకూ 1849లో అతడు 'తెమిర్ ఖాన్‌షురా' గ్రామం మీద దాడిచేసాడు. పట్టపగలే దుకాణాల మీద పడి, దొరికిందల్లా దోచుకెళ్లాడు"

ఆ సమయంలో తెమిర్‌ఖాన్‌షురాలో వున్న ప్రత్యక్ష సాక్షి ఒకరు (ఇతడో ఆర్మీనియన్) పూసగుచ్చినట్టు ఆనాటి దాడిని వర్ణించాడు.

నిజానికి విందులో హాజీమురాద్ గురించి తప్ప మరొక విషయమే ప్రస్తావించలేదెవరూ.

అందరూ అతడి ధైర్యాన్ని, శౌర్యపరాక్రమాలను, ఉదాత్త స్వభావాన్నీ పొగిడినవాళ్లే. ఒకరెవరో ఇరవయ్యారుమంది బందీలను నిర్దాక్షిణ్యంగా చంపించాడన్నారు. కాని మిగతావాళ్లు "అవును మరి, అలాంటి పరిస్థితుల్లో ఎవరు మాత్రమేం చేస్తారు? " అంటూ అతణ్ణే సమర్థించారు.

"అతడు మహానుభావుడు!"

"యూరోపులో గనక జన్మించి వుంటే నెపోలియన్ అంత గొప్పవాడయ్యేవాడు" అంటూ జార్జియన్ ప్రిన్స్ అతణ్ణి ఆకాశానికెత్తేశాడు.

'నెపోలియన్' అనేమాటను వొరొంట్సొవ్ బాగా యిష్టపడతాడని అతడికి తెలుసు. నెపోలియన్‌ను పరాజితుణ్ణి చేసినందుకు చిహ్నంగా మెడమీద 'తెల్లక్రాస్' ధరిస్తాడు వొరొంట్సొవ్.

"నెపోలియన్ అంత కాకపోయినా, గొప్ప కమాండర్ అనొచ్చు" అన్నాడు వొరొంట్సొవ్.

"నెపోలియన్ కాకపోతే మురాద్"

"అతడి పేరు హాజీ మురాద్"

"హాజీమురాద్ లొంగిపోయాడు. ఇక త్వరలోనే షామిల్ కథ కూడా ముగుస్తుంది"

"త్వరలో కాదు. అతి త్వరలో"

ఇలా వ్యాఖ్యానించటంలో అతని ఉద్దేశం 'వొరొంట్సొవ్ నాయకత్వంలో' అని

పొగడ్తలు ఆగలేదు. వొరొంట్సొవ్ దీనికి అడ్డుకట్ట వెయ్యాలనుకున్నాడు. కాని అలాంటి కబుర్లు వినటం సరదాగానే వుంది. తృప్తిగా భార్యతో కలిసి డ్రాయింగ్ రూంలోకి వచ్చాడు.

డిన్నర్ తర్వాత కాఫీ సర్వ్ చేశారు. ఆ తర్వాత పేకాట ప్రారంభమైంది. బంగారపు నశ్యపు డబ్బా మీద అలెగ్జాండర్ బొమ్మ వున్న మూత తీయబోతున్నప్పుడు వొరొంట్సొవ్‌నెవరో పిలిచారు. తను ఇక పేకముక్కలు పంచటమే తరువాయి.

ఇటాలియన్ సేవకుడు "మరో ఆగంతుకుడు, యువర్ ఎక్సెలెన్సీ" అంటూ ప్రకటించాడు.

పేకముక్కలు కిందపడేసి తనకు వచ్చిన లేఖను తెరిచి చూశాడు వొరొంట్సొవ్. అది కొడుకు రాసింది. హాజీమురాద్ లొంగుబాటు, అంతకుముందు జరిగిన ఘర్షణ గురించి సుదీర్ఘంగా వివరించాడందులో.

ఏం రాశాడంటూ అడిగింది అతడి భార్య.

"అదే విషయం. అంతా మనమంచికే అనుకోవాలి" అంటూ వుత్తరాన్ని భార్యకు అందజేశాడు.

మనసు తేలికగా వుంది. సంతోషం చెప్పలేనట్టుగా వుంది. అలాంటప్పుడతడు చిటికెడు ఫ్రెంచి నశ్యం పీలుస్తాడు.

★ ★ ★

మరుసటి రోజు ఉదయం హాజీమురాద్ చేరుకునేటప్పటికే వొరొంట్సొవ్ వెయిటింగ్ రూం వివిధ విజ్ఞప్తులతో వచ్చిన జన సందోహంతో కిటకిటలాడుతోంది. నిన్న సరదాగా, పూలరంగడిలా కనిపించిన మనిషి ఈరోజు యూనిఫాంలో, సైనిక లాంఛనాలతో అధికార దర్పంతో కనిపించాడు. ప్రభుత్వ నిధులను స్వంతానికి వాడుకుని కోర్ట్ మార్షల్‌కు రెడీగావున్న కమాండర్ ఒకడు దిగులుగా నిల్చున్నాడు. వోడ్కా అమ్మకం మీద తనకే గుత్తాధిపత్యం ఇచ్చిన అనుమతిని కొనసాగించాలని అభ్యర్థిస్తూ వచ్చిన ఆర్మీనియన్ కూడా ఏలినవారి దర్శనం కోసం నిరీక్షిస్తున్నాడు.

## అబ్బూరివారి చతురోక్తులు



అబ్బూరి రామకృష్ణారావుగారు తెలుగుజాతి గర్వించదగ్గ గొప్ప కవి, విమర్శకుడు, ఉద్యమకారుడు. ఆయన రాసింది తక్కువే అయినా గొప్ప రచనలను అందించారు. రాయగలిగిన శక్తి వుండీ ఆయన రాయలేదు. ఆయన హాస్యోక్తులు విసరడంలో దిట్ట. ఆయన చతురోక్తులు కొన్ని...

### ఆత్మస్తుతికి అడ్డుకట్ట

సుప్రసిద్ధ కథా రచయిత, నవలాకారుడు రాచకొండ విశ్వనాథ శాస్త్రి రాసిన 'తిరస్కృతి' అనే నాటకాన్ని అబ్బూరి రామకృష్ణారావు చూశారు. ఈ విషయం తెలుసుకున్న రావిశాస్త్రి తన నాటకం గురించి కాస్త స్వోత్కర్ష చేసుకుంటూ అబ్బూరివారితో 'ఆ నాటకంలో సన్యాసిరాజు పాత్ర చాలా బాగుంది కదండీ?' అన్నాడు.



దానికి అబ్బూరి రామకృష్ణారావు 'పప్పుచారులో ఉప్పు మాత్రం బాగుంది కదా అంటే ఎలాగోయ్! మొత్తం పప్పుచారు అంతా బాగుండాలి కదా?' అని చురక అంటించారు.

యుద్ధంలో మరణించిన ఒక ఆఫీసర్ భార్య పెన్షన్ ఇంకా మంజూరు కాలేదని వచ్చింది. పిల్లలకు స్కూలు ఫీజు కూడా కట్టలేకపోతున్నది! చర్చి ఆస్తులను కొన్ని తనకు బదలాయించాలని (ప్రభుత్వం స్వాధీనం చేసుకున్న ఆస్తులు) అర్జీ పెట్టుకోవటానికి వచ్చాడొక జార్జియన్ ప్రిన్స్. కాకసస్ ప్రాంతంలో అల్లర్లు అణిచి, లొంగదీసుకోవటానికి సరికొత్త ప్రణాళికతో నిరీక్షిస్తున్నాడొక అధికారి. వొరొంట్సొవ్ దర్శనం లభించిందని ఇంటివద్ద చెప్పుకోవచ్చనే ఒకే ఒక కారణంతో వచ్చాడొక ఖాన్.

అందరూ తమ వంతుకోసం నిరీక్షిస్తూ ఉన్నారు. ఒక వైపు నుండి అతని ఛెంబర్‌లోకి ప్రవేశించి, మరోవైపు నుండి వచ్చేస్తున్నారు.

హాజీమురాద్ వెయిటింగ్ రూంలోకి ప్రవేశించగానే అందరూ అతడి మీదే దృష్టి కేంద్రీకరించారు. అతడు కొద్దిగా కుంటుతాడు. అది కూడా వాళ్లను ఆకర్షించింది. గుసగుసలాడుతున్నారు.

మెడచుట్టూ వెండి లేసుతో అల్లిన బనియన్‌మీద తెల్లటి, పొడుగాటి సర్కేషియన్ కోటూ, కాళ్లకు నల్లటి మేజోళ్లూ (లెగ్గింగ్స్) అవే రంగుబూట్లూ వేసుకుని వచ్చాడు. తలమీది టోపీ టర్బన్‌లా కనిపించింది. అతడి జీవితం మలుపు తిరిగింది ఈ టర్బన్ వల్లే. ఇది పెట్టుకున్నందుకు అహమద్‌ఖాన్ అతణ్ణి నిందించాడు. తరవాత ఇదే కారణంగా జనరల్ క్లూగనౌ అరెస్టు చేశాడు. వీళ్లమీది కోపంతో తను షామిల్ పక్షం చేరిపోయాడు.

వెయిటింగ్ హాల్‌లో ఠీవిగా నడిచాడు హాజీమురాద్. అతడి కుంటి నడకలో కూడా ఒక రాజసం వుంది. అతడి కళ్లు వొరొంట్సొవ్ ఛెంబర్ మీద వున్నాయి. హాల్లో వున్న అంతమందీ తననే చూస్తున్నారన్న సంగతి అతడికి పట్టలేదు.

ప్రిన్స్ సహాయకుడు లారిస్ మెలికోవ్ ఛెంబర్ నుండి బయటికి వచ్చి, స్వయంగా హాజీమురాద్‌ను వెంటతీసుకుని లోపలికి వెళ్లాక, తన స్థానంలో లేచి నిల్చుని అతిథిని ఆహ్వానించాడు వొరొంట్సొవ్. అతను కమాండర్-ఇన్-చీఫ్ కూడా. మొహంలో నిన్నటి చిరునవ్వు లేదు, అధికారుల్లో కనిపించే కాఠిన్యమే తప్ప.

ఛెంబరులో కిటికీలకు ఆకుపచ్చ వెనెషియన్ బ్లైండ్‌లున్నాయి. ఛాతీమీద రెండు చేతులూ పెట్టుకుని, కళ్లు వాల్చుకుని, నెమ్మదిగా స్పష్టంగా, తన కుమిక్ మాండలికంలో మాట్లాడాడు హాజీమురాద్.

"మహా ఘనత వహించిన, మహాపరాక్రమశీలి అయిన జార్ చక్రవర్తికి నన్ను నేను సమర్పించుకుంటున్నాను. ఇక నుండీ ఆయన రక్షణలో వుంటాను. ఆయన సేవలోనే శేషజీవితం గడుపుతాను. నా చివరి నెత్తుటి బొట్టు కూడా ఆయన కోసమే అర్పిస్తాను. ఇకనుండీ షామిల్ - మీకూ, నాకు కూడా శత్రువే. అతనితో జరిగే యుద్ధంలో నేను నా ప్రాణాలొడ్డటానికి సిద్ధంగా వున్నాను"

దుబాసీ రష్యన్‌లోకి అనువదించాడు. వొరొంట్సొవ్, హాజీమురాద్ ఒకర్నొకరు చూసుకున్నారు.

## కొత్తగాలి...

**ఇంపుగా వున్నా**
**వినబుద్ధేయదు పద్యం**
**కంపుగా వున్నా**
**తాగబుద్ధేస్తుంది మద్యం**

*– బద్దిగం పాండురంగారెడ్డి,*
*కరీంనగర్*

మాటల్లో చెప్పలేనిదీ, దుబాసీ అనువదించలేనిదీ ఆ చూపుల్లో వ్యక్తమైంది. వాస్తవమేమిటో ఇద్దరికీ తెలుసు. 'హాజీమురాద్ చెప్పిన మాట ఒక్కటీ నమ్మలేదు వొరొంట్సొవ్. రష్యన్‌లకు అతడెప్పుడూ శత్రువే. అనివార్యమైన పరిస్థితుల్లో లొంగిపోయాడు. అనివార్యమైన పరిస్థితుల్లో తామూ ఆ లొంగుబాటు అంగీకరించక తప్పలేదు' అన్నాయి వొరొంట్సొవ్ కళ్లు. తనను నమ్మవచ్చునన్నాయి హాజీమురాద్ కళ్లు. 'వయసుమీరిన ఈ జనరల్ మరణం గురించి ఆలోచించక, యుద్ధ వ్యూహాలెందుకు రచిస్తున్నాడు? ఈ జిత్తులమారితో జాగ్రత్తగా వ్యవహరించాలి' అనుకున్నాడు హాజీమురాద్. వొరొంట్సొవ్‌కి ఈ విషయం కూడా బాగానే అర్థమైంది. కాని యుద్ధసన్నాహాలు చేస్తున్నప్పుడు పరస్పర విశ్వాసం ప్రకటించుకోక తప్పదు.

'చక్రవర్తిగారు మహా దయాళువు. నేను అభ్యర్థిస్తే సైన్యంలో చేర్చుకుంటాడు' అని చెప్పమని దుబాసీని ఆదేశించాడు వొరొంట్సొవ్. ఆ తర్వాత హాజీమురాద్ వైపు చూస్తూ "చక్రవర్తిగారి నిర్ణయం వచ్చేదాకా అతడు నా అతిథిగా వుంటాడు. అతిథికి జరగవలసిన మర్యాదలన్నీ జరుగుతాయి" అన్నాడు.

చేతులు ఛాతీకి నొక్కుకుని హాజీమురాద్ వుద్రేకంగా ఏదో చెప్పగా దుబాసీ ఇలా అనువదించాడు.

"1839లో అవేరియాకు అధికారిగా వున్నప్పుడు రష్యన్లకు సేవ చేశాను. అహమద్‌ఖాన్ నా గురించి జనరల్ క్లూగెనౌకు పితూరీలు చెప్పకుండా వుంటే షామిల్‌తో జతకట్టేవాణ్ణే కాను"

"తెలుసు, తెలుసు" అంటూ ప్రిన్స్ సోఫాలో కూర్చొమ్మని చేయి చూపించాడు. కాని హాజీమురాద్ కూర్చోలేదు. అంత పెద్దవాడి ముందు తను కూర్చోలేనన్నట్లుగా భుజాలు ఎగరేసి తల వంచుకున్నాడు.

కాసేపటికి మళ్లీ "అహమద్‌ఖాన్, షామిల్ ఇద్దరూ నా శత్రువులు. ఇప్పుడు అహమద్‌ఖాన్ లేడు. అందువలన అతడి మీద ప్రతీకారం తీర్చుకోలేను. కాని షామిల్ బతికేవున్నాడు. అతణ్ణి చంపేదాకా నా పగ చల్లారదు" అన్నాడు.

"ఇంతకూ ఎలా పగ తీర్చుకుంటాడు? కూర్చొమ్మను" అన్నాడు ప్రిన్స్, దుబాసీతో.

కూర్చొనటానికి నిరాకరించి 'నేను రష్యన్లతో చేరిందే, షామిల్ మీద ప్రతీకారం తీర్చుకోవటానికి' అన్నాడు హాజీమురాద్.

"అంతా బాగానే వుందిగాని, ఏం చెయ్యదలుచుకున్నాడో చెప్పడం ముఖ్యం" అన్నాడు ప్రిన్స్.

ఈసారి హాజీమురాద్ సోఫాలో కూర్చుని, తనకు రష్యన్ సైన్యం తోడుగా వుంటే దాగెస్తాన్‌లో అల్లకల్లోలం సృష్టించి, షామిల్‌కు నిలువనీడ లేకుండా చేయటం ఖాయమని చెప్పాడు.

"ఎక్సెలెంట్! ఆలోచిస్తాను" అన్నాడు ప్రిన్స్.

"సర్దార్ వొరొంట్సొవ్‌కు మరో మాట కూడా చెప్పండి.. నా కుటుంబం షామిల్ ఆధీనంలో ఉంది. వాళ్ళక్కడ వున్నంత వరకూ, నేను మీకు సేవ చేయలేను. నేను

బహిరంగంగా అతడి మీద తిరుగుబాటు చేస్తే షామిల్ నా భార్యనూ, తల్లినీ, పిల్లల్నీ చంపేస్తాడు. మనం పట్టుకున్న షామిల్ తరపు బందీలను, నా కుటుంబ సభ్యులను మార్చుకుంటే, ఆ తర్వాత నేను షామిల్‌ను తప్పక చంపుతాను. లేదా చస్తాను" అన్నాడు హాజీమురాద్.

"ఆలోచిస్తాను"

వొరొంట్సొవ్‌తో హాజీమురాద్ తొలి యింటర్వ్యూ అలా ముగిసింది.

ఆ సాయంత్రం వొరొంట్సొవ్ ఓ ఇటాలియన్ ఒపెరాను ఆనందిస్తున్నప్పుడు, హాజీమురాద్ కూడా వచ్చి ముందు వరుసలో కూర్చున్నాడు. కాని ఆ నృత్యనాటికలో ఆసక్తి కనపర్చలేదు. మధ్య మధ్య లేచి నిలబడి అందరి దృష్టినీ ఆకర్షించాడు.

మరుసటి రోజు సాయంత్రం వొరొంట్సొవ్ నివాసంలో యథావిధిగా మరో విందుపార్టీ జరిగింది. అందమైన పడతులు కురుచ దుస్తులతో అర్ధనగ్నంగా వచ్చారు. మెడ, చేతులు, వక్షోజాల మీద ఆచ్ఛాదన సరిగా లేదు. యువకులు వాళ్ళను ఆలింగనం చేసుకున్నారు. బఫే ప్రారంభమైన తర్వాత షాంపేన్ ప్రవహించింది. స్త్రీలకు మిఠాయి అందించారు. వృద్ధురాలైన 'సర్దార్' భార్యకూడా అర్ధనగ్నంగా వచ్చి అందరితో కలిసిపోయింది. పరిస్థితిని హాజీమురాద్‌కు వివరించి చెప్పటానికి ప్రయత్నించాడు దుబాసీ. అయినా ఆ వాతావరణం అతడికి నచ్చలేదు. దుస్తులు సరిగా ధరించని పడతులు, అతడికి సమీపంగా వచ్చి నిలబడి పరిచయం చేసుకోవాలన్నట్టుగా చిరునవ్వు నవ్వారు! 'తామంటే ఇష్టమేనా?' అని వాళ్ల ప్రశ్న. తనకు వీళ్ళంటే ఇష్టమా? భుజాలమీదా, ఛాతీ మీదా బంగారు పతకాలు ధరించిన జనరల్ వొరొంట్సొవ్ కూడా చివరికి అదే అడిగాడు. "ఈ పార్టీ నీకు నచ్చలేదా?" ఇంత సంపద, విలాస జీవితం, సుందరాంగనల సాంగత్యం, మధువు నచ్చని మనుషులుంటారా? అనేది ఆయన ఉద్దేశం కాబోలు. తన అభిప్రాయం చెప్పకుండా "మా ఇళ్లల్లో ఇలాంటివి వుండవు" అన్నాడు హాజీమురాద్.

విందులో సరదాగా గడుపుతున్న వొరొంట్సొవ్‌తో మరోసారి తన కుటుంబాన్ని రక్షించాలని ప్రస్తావించాడు. అయితే వొరొంట్సొవ్ ఆ మాటలు వినిపించనట్టుగా మరెవరితోనో మరేవో కబుర్లలో మునిగిపోయాడు.

రాత్రి పదకొండు దాటింది. 'తను నిష్క్రమించవచ్చా?' అని లారిస్ మెలికొవ్‌ను అడిగాడు హాజీమురాద్. 'వెళ్లితే ఫరవాలేదుగాని ఉంటే బాగుంటుంది' అన్నాడతడు. అయినప్పటికీ తన కోసం నిరీక్షిస్తున్న బండి ఎక్కి నివాసానికి చేరుకున్నాడు హాజీమురాద్.

★ ★ ★

హాజీమురాద్ అప్పటికి టిఫ్లిస్‌కు చేరి అయిదురోజులు. ఒక ఉదయం వొరొంట్సొవ్ ఆదేశానుసారం లారిస్ మెలికొవ్ వచ్చి పలకరించాడు.

"సర్దార్‌కు సేవచేసే అవకాశంకోసం నిరీక్షిస్తున్నాను" అన్నాడు హాజీమురాద్ వినయంగా, లౌక్యంగా. ఆ తర్వాత మరోసారి తలదించుకుని "ఆజ్ఞాపించండి" అన్నాడు.

కుర్చీ హాజీమురాద్‌కు సమీపంగా జరుపుకుని "నీ గత జీవితం గురించిన పూర్తి సమాచారం తెలుసుకోవాలనుకుంటున్నారు వైస్‌రాయ్. అతనికిప్పటికే తెలియదని కాదు. కాని నీ నోటితో నువ్వు చెబితే మరోసారి తెలుసుకోవాలనుకుంటున్నారు. అన్నాడు లారిస్ మెలికొవ్. అతడు టార్టార్ భాష ధారాళంగా మాట్లాడగలడు.

"నువ్వు చెబితే నేను దాన్ని రష్యన్‌లో రాసుకుని ఆయనకు చూపిస్తాను. ఆ తర్వాత ఆయన దాన్ని చక్రవర్తికి పంపుతారు"

ఎవరి మాటకూ అడ్డుపడకపోవటం హాజీమురాద్ ప్రత్యేకత. అతడు చెప్పిందంతా ఓపిగ్గా విని "చెబుతాను" అన్నాడు. తన జీవితకథ చక్రవర్తి కూడా చదువుతాడంటే గర్వంగా ఉంది.

"ఏదీ వదిలిపెట్టకుండా ఉన్నదున్నట్టుగా చెప్పాలి" అంటూ జేబులోంచి నోట్‌బుక్ తీశాడు లారిస్-మెలికొవ్.

"మొదటి నుండీ చెప్పనా? "

"మొట్టమొదటి నుండీ.. ఎక్కడ పుట్టావు? ఎప్పుడు పుట్టావు? "

సోఫాలో వెనక్కువాలి కూర్చుని, ఓ పొడుగాటి కర్ర తీసుకుని చాకుతో దాన్ని చెక్కుతూ తన కథ ప్రారంభించాడు హాజీ మురాద్.

"రాసుకోండి, పుట్టింది సెల్మెస్‌లో. అదో కుగ్రామం. మా భాషలో చెప్పాలంటే గాడిద తలకాయంతుంటుంది. కుంజాక్ నుండి కొద్ది దూరంలో. కుంజాక్‌లో ఖాన్లుంటారు. వాళ్లకూ మాకూ దగ్గర సంబంధాలుండేవి. మా పెద్దన్న ఉస్మాన్ పుట్టినప్పుడు, మా అమ్మ ఖాన్‌లలో పెద్దవాడు అబునట్సల్ ఖాన్‌కు పాలదాయిగా ఉంది. ఆ తర్వాత రెండవవాడు ఉమ్మాఖాన్‌కు పాలిచ్చి పెంచింది. కాని మా రెండో అన్న అహ్మద్ చనిపోయాడు. నేను పుట్టినప్పుడు, వాళ్లకు బులాచ్‌ఖాన్ పుట్టాడు. ఈసారి మా అమ్మ వాళ్లింటికి పాలదాయిగా పోలేదు. మా నాన్న ఆజ్ఞాపించినా సరే, ఆమె ససేమీరా అంది. పరాయివాళ్ల పిల్లలకు పాలిచ్చి, నా కొడుకును చంపుకోలేను" అంటూ మొండికేసింది. పిచ్చి కోపంతో మా నాన్న, ఆమెను పొడిచి చంపబోయాడు. గాని ఇరుగుపొరుగులు వచ్చి రక్షించారు. ఆ తర్వాత ఆమె నా

## మీరు కూడా 'మార్క్సిస్టు'లేనా?

అబ్బూరివారు కంట్రోలర్ ఆఫ్ ఎగ్జామ్స్‌గా పనిచేసేవారు. అప్పుడాయనను మిత్రులుగా భావిస్తూ కొందరు, ఇంకేవో పరిచయాలు చెప్పుకుంటూ మరికొందరు వచ్చేవారు. వారందరూ ఆయనను మంచి



చేసుకుని మార్కులు వేయించుకునేందుకు శతవిధాలా ప్రయత్నించేవారు. ఒకసారి అలాంటివారు చాలామంది వచ్చి వెళ్లాక, చివరిగా ఒక వ్యక్తి లోనికి వచ్చాడు. ఆయనతో అబ్బూరివారు సరదాగా 'మీరు కూడా మార్క్సిస్టులేనా? ' అన్నారు.

అసలు విషయం అర్థమైన అతను కూడా ఆయన ఛలోక్తికి నవ్వుకున్నాడు.

కోసం ఓ పాట కట్టింది. అదినేను చెప్పక్కర్లేదు..."

"అన్నీ చెప్పాల్సిందే నేను రాసుకుంటున్నాను."

హాజీమురాద్ ఆ రోజులు గుర్తుకు తెచ్చుకోవటానికి ప్రయత్నించాడు. మట్టితో కట్టిన చిన్న ఇల్లు. తల్లి తనను ఫర్‌కోట్ మీద పడుకోబెట్టింది. తండ్రి బాకుతో ఎక్కడ గాయం చేశాడో చూపించమని అడిగాడు తల్లిని. అలా గుర్తుకువచ్చింది పాట.

'తళతళ మెరిసే బాకు నా గుండెల్లో దిగింది/ నా బాలభానుడు, నా బంగారు కొండను అక్కడే హత్తుకున్నాను/ ధారగా

కారిన నెత్తుటితో వాడు స్నానమాడాడు/ మందులు, మాకులు లేకుండానే ఆ గాయం మానింది/ చావంటే నాకు భయంలేదు/ నా కొడుకునూ అది భయ పెట్టలేదు'

మా అమ్మ యిప్పుడు షామిల్ చెరలో వుంది. ఆమెను రక్షించాలి" ఒక్కొక్కటీ జ్ఞాపకం వస్తున్నాయి.

కొండ కింద ఎప్పుడూ వూరే జలధార. తల్లి వేసుకున్న వదులు పైజామాను పట్టు కుని వెంట నడిచేవాడు. ఆమె నీళ్లకోసం వెళ్ళినప్పుడల్లా తను వెంట వుండాల్సిందే. మొదటిసారి ఆమె తన తలగొరిగినప్పుడు, తళతళా మెరిసే ఇత్తడి గిన్నెలో, తన ప్రతి బింబం చూసి, తనిలా ఉంటాడా అనుకుని ఆశ్చర్యపోయాడు. బక్కచిక్కిన కుక్క ఒక నాడు తన మొహం నాకింది. ఆకలిగా ఉన్నప్పుడు తల్లి యిచ్చిన తియ్యటి రొట్టెవా సన. బుట్టలో తనను పెట్టుకుని తల్లి తాత గారింటికి తీసికెళ్లిందొకసారి. ఆ నెరసిన జుత్తూ, ముడతలు పడిన తాత మొహం. ఆ వయసులోనూ సుత్తితో కొడుతూ వెండి రేకులు తయారు చేస్తున్నాడాయన.

మొత్తం మీద మా అమ్మ పాలదాయిగా పోలేదు. ఖాన్‌లు కొత్త పాలదాయిని పెట్టుకున్నారు. అయినా వాళ్లకు మా అమ్మంటే ప్రేమే. అప్పుడప్పుడూ మమ్మల్ని వాళ్లింటికి తీసుకెళ్లేది. అక్కడ వాళ్లపిల్లల తో ఆడుకునేవాళ్లం.

నాకు పదహారేళ్లున్నప్పుడు మురిద్‌లు మా వూళ్లకు రావటం ప్రారంభమైంది. 'ముసల్మాన్‌లారా! నాస్తికులకు, అవిశ్వాసు లకు వ్యతిరేకంగా పవిత్ర యుద్ధం చెయ్యండి' ఇదీ వాళ్ల నినాదం. ఇదేవాళ్ల ప్రచారం. మొదట చెచెన్‌లు వాళ్లవైపు వెళ్లి పోయారు. తరువాత అవర్‌లుకూడా వాళ్ల ననుసరించారు. అప్పుడు నేను ఖాన్‌ల ఇంట్లో, వాళ్లలో ఒకడిగా బతుకుతున్నాను. వాళ్ళు బాగా సంపన్నులు. నాకూ బోలెడు డబ్బుండేది. అప్పటికే స్వంత గుర్రాలూ, ఆయుధాలూ ఉండేవి. ఇమాం కాజీమల్లా హత్య జరిగి, హంజద్ కొత్త ఇమాంగా వచ్చిందాకా ఆ విలాస జీవితం కొనసా గింది. ఒకనాడు హంజద్ తన మనుష లతో ఖాన్‌లకో సందేశం పంపాడు. అది సందేశం కాదు, బెదిరింపు. ఖాన్‌లందరూ పవిత్ర యుద్ధంలో చేరకపోతే వంశనాశ నమే.

ఇది నిజంగా కీలక విషయమే. ఖాన్ లకు రష్యన్లంటే భయం. పవిత్ర యుద్ధంలో చేరితే పరిణామాలు మరెంత భయంకరంగా వుంటాయో తెలియదు. ఇంటి యజమాని నన్నూ, తన రెండో కొడుకు ఉమ్మాఖాన్‌నూ టిఫ్లిస్ పంపిం చాడు. అక్కడ మేం రష్యన్ కమాండర్-ఇ న్-చీఫ్ బేరన్ రోసెన్‌ను, హంజద్‌కు వ్యతి రేకంగా పని చెయ్యటంలో సహాయం కోసం అర్థించాలి. అతడు మమ్మల్ని చూడ లేదు. సహాయం చేస్తానని కబురు పంపిం చాడు గాని ఏమీ చెయ్యలేదు. రష్యన్ ఆఫీ సర్లు వచ్చి, ఉమ్మాఖాన్‌తో పేకాట ఆడి వెళ్లిపోయారు. అతడికి తాగుడు అలవాటు చేశారు. వెళ్లకూడని చోట్లకు తీసికెళ్లారు. పేకాటలో, యితర వ్యసనాలలో వున్న దంతా పోగొట్టుకున్నాడు ఉమ్మాఖాన్. అతడి శరీరం గట్టిదే. కాని ఆత్మ బల హీనం. తన గుర్రాలను, ఆయుధాలను కూడా పేకాటలో పోగొట్టుకునేవాడే- నేను అడ్డుపడకపోతే.

టిఫ్లిస్ అనుభవంతో నా అభిప్రాయాలు మారిపోయాయి. ఖాన్‌లను పవిత్ర యుద్ధంలో చేరవలసిందేనని సలహా యిచ్చాను"

"అభిప్రాయాలెందుకు మార్చుకున్నావు? రష్యన్ల ప్రవర్తన నీకు నచ్చలేదా?"

కాసేపు ఆలోచించి "నచ్చలేదు. అంతే

కాదు. పవిత్ర యుద్ధంలో చేరాలనుకోవటా నికి మరో కారణం కూడా వుంది"

"ఏమిటది? "

"మా వూరి దగ్గర నేనూ, ఖాన్ కలిసి తిరుగుతున్నప్పుడు ముగ్గురు మురిద్‌లు తారసపడ్డారు. ఇద్దరు పారిపోయారు గాని ఒకణ్ణి నేను నా పిస్టల్‌తో కాల్చాను.

ఆయుధాలు తీసుకోవటానికి సమీపించి నప్పుడు అతడింకా ప్రాణాలతో వున్నాడు. నువ్వు నన్ను చంపావు. సంతోషమే. నువ్వు కూడా ముసల్మాన్‌వేగా. గజావత్ (పవిత్ర యుద్ధం)లో చేరిపో. ఇది దేవుడి ఆజ్ఞ అంటూ శ్వాస వదిలాడు"

"చేరిపోయావా మరి? "

"లేదు, కాని ఆలోచించాను. హంజద్ మనుషులు కుంజాక్‌కు వచ్చినప్పుడు మేం 'గజావత్'లో చేరటానికి సుముఖమేననీ, కాని అంతకుముందు ఇమాం ఎవరైనా పండితులను పంపించి, ఈ పవిత్ర యుద్ధ మంటే ఏమిటో, ఎందుకు చెయ్యాలో తెలి యచెబితే బాగుంటుందనీ మా గ్రామపె ద్దల ద్వారా సమాచారం పంపించాం. ఇందుకు ప్రతిగా హంజద్ ఏం చేశాడో తెలుసా? మా గ్రామపెద్దల మీసాలు గొరి గించి, ముక్కులు కుట్టించి, వాటికి బరు వులు వేళ్లాడదీసి పంపించాడు. అయితే హంజద్, మాకు పవిత్ర యుద్ధం గురించి బోధించడానికి ఒక షేక్‌ను పంపించటా నికి సిద్ధంగా వున్నాడనీ, ఖాన్‌లు తమ చిన్న కొడుకును తమకు బందీగా పంపిం చాలనీ షరతు విధించాడు. ఖాన్‌ల తల్లి (ఖాన్షా) తన చిన్న కొడుకు బులాక్ ఖా న్‌ను పంపింది. 'మిగతా యిద్దరు కొడుకు లను కూడా పంపించండి. అందర్నీ ప్రేమగా చూసుకుంటాను. వాళ్లకు తండ్రి లాంటి వాణ్ణి' అన్నాడు హంజద్. ఖాన్షా మూర్ఖురాలు. ఉమ్మాఖాన్‌నూ, నన్నూ పంపింది. కొందరు దారిలోనే ఎదురువచ్చి మమ్మల్ని హంజద్ వద్దకు తీసికెళ్లారు. గుడారంలో వుంటున్నాడతడు. 'నేను మీ కుటుంబానికి ఏ అపకారమూ తలపెట్ట లేదు. తలపెట్టను కూడా. పవిత్ర యుద్ధా నికి జనాన్ని ప్రేరేపించటమే నా లక్ష్యం. నా తండ్రి, మీ తండ్రికి సేవ చేసినట్టుగానే, నేను మీకు సేవ చేస్తాను. నన్ను మీ యింట్లో వుండనివ్వు. మీకు మంచి సలహా లు ఇస్తాను' అంటూ ప్రేమగా మాట్లా డాడు హంజద్.

ఉమ్మాఖాన్ ధైర్యంగా మాట్లాడలేదు. ఏం జవాబు చెప్పాలో తెలియక మౌనంగా వుండిపోయాడు. ప్రతిపాదన బాగానే వుంది గనక, హంజద్‌ను కుంజాక్‌కు రమ్మనీ, అక్కడ ఖాన్షా, ఆమె పిల్లలూ అత నికి స్వాగతం పలుకుతారని చెప్పబో యాను. కాని నన్ను మధ్యలోనే ఆపి- అదే షామిల్‌ను మొదటిసారి చూడటం- 'అడి గింది నిన్ను కాదు. ఖాన్‌ను' అన్నాడత ను.

నేను మాట్లాడలేదు. ఉమ్మాఖాన్‌ను గుడారంలోకి తీసికెళ్లాడు హంజద్. ఆ తర్వాత, తన మనుషులతో కలిసి కుం జాక్‌కు వెళ్ళమని ఆదేశించాడు. అతని వెంటవచ్చిన హంజద్ మనుషులు తన పెద్ద కొడుకును పంపించమని ఖాన్షాను వేధించారు. ఇందులో ఏదో కుట్ర వుందని

> **కొత్తగాలి...**
>
> **పడుచు బుగ్గ**
> **ఎర్రబారిన పండు**
> **చిలుక ముక్కు**
>
> – కినపర్తి దాలినాయుడు,
> విజయనగరం

అర్థమైపోయింది. పంపించవద్దని ఖాన్షాకు నచ్చచెప్పటానికి ప్రయత్నించాను. కాని 'గుడ్డుకు వెంట్రుకలుండనట్టే, ఆమెకు బుద్ధి లేదు' కొడుకును వెళ్లమని ఆదేశించింది. అబు నట్సుల్ ఖాన్‌కు వెళ్లటం యిష్టం లేదు. అతణ్ణి చూసి 'భయపడుతున్నావా?' అని అడిగిందామె. మగాళ్లను ఎలా గాయపరచాలో ఆమెకు బాగా తెలుసు- కందిరీగకు కుట్టడం తెలిసినట్టుగా. తల్లికి జవాబు చెప్పలేదు గాని గుర్రానికి జీను సిద్ధం చెయ్యమని సేవకుణ్ణి ఆదేశించాడు అబునట్సుల్ ఖాన్. నేనూ అతడి వెంట వెళ్లాను.

హంజద్ మాకు యిదివరకటికన్న ఘనంగా స్వాగతం పలికాడు. సగం దూరంలోనే మాకెదురొచ్చి స్వయంగా వెంటపెట్టుకుని వెళ్లాడు. అనేక మంది అశ్వికులు, రంగురంగుల జెండాలతో, స్వాగత గీతాలతో గాలిలో తుపాకులు పేలుస్తూ మమ్మల్ని ఆహ్వానించారు.

నివాస స్థలానికి చేరగానే హంజద్, అబు నట్సుల్ ఖాన్‌ను గుడారంలోకి తీసికెళ్లాడు. నేను గుర్రాల వద్ద నిరీక్షించాను.

ఎంతసేపటికీ అతను వెలుపలికి రాకపోవడంతో కొండల్లో తిరిగి వద్దామనుకున్నాను. నేను సగం దూరం వెళ్లానో లేదో గుడారం లోపల తుపాకీ పేలిన శబ్దాలు వినిపించాయి. పరిగెత్తి చూద్దునుకదా, ఉమ్మాఖాన్ నెత్తుటి మడుగులో పడున్నాడు.

అబు నట్సుల్ ఖాన్ మురిద్‌లతో యుద్ధం చేస్తున్నాడు. కత్తి గాటుకు కాబోలు అతని చెక్కిలి మాంసం వెళ్లాడుతోంది. ఒక చేత్తో దాన్ని నొక్కుకుంటూ, మరొక చేత్తో ఎదుట ఉన్నవాళ్లను చాకుతో పొడుస్తున్నాడు. హంజద్ సోదరుణ్ణి మట్టి కరిపించి, మరొకడి మీదికి లంఘించాడు. సరిగా అప్పుడే మురిద్‌లు అతడి మీద గుళ్ల వర్షం కురిపించారు. మరుక్షణం అతనూ నేలకొరిగాడు"

దాంతో చెబుతున్న హాజీమురాద్ మొహం ఎర్రబడింది. కళ్లలో నెత్తురు కమ్ముకుంది.

"భయంతో పలాయనం చిత్తగించాను"

"నిజంగా? నీకు భయమంటే తెలియదంటారు"

"ఆ తర్వాత, మరెప్పుడూ భయపడలేదు. ఆనాడు మాకు జరిగిన అవమానాన్ని ఎప్పటికీ మరచిపోను. ఇంక దేనికి భయం?"

"చాలా చెప్పాను. నాకు నమాజు సమయమయింది" అన్నాడు హాజీమురాద్, వొరొంట్సొవ్ తనకు కానుకగా యిచ్చిన రిపీట్ వాచ్‌స్ప్రింగు నొక్కి చూస్తూ. పన్నెండుంబావయింది. గడియారాన్ని చెవి దగ్గర పెట్టుకుని చిన్న పిల్లాడిలా వాచీ చప్పుడు వింటూ "సోదరుడు వొరొంట్సొవ్ బహుమతి" అన్నాడు.

"మంచి వాచ్. మీ నమాజు తర్వాత కలుస్తాను" అన్నాడు లారిస్ మెలికొవ్.

హాజీమురాద్ తన పడక గదిలోకి నిష్క్రమించాడు.

హాల్లో ఒంటరిగా కూర్చున్న లారిస్ మెలికొవ్ హాజీమురాద్ చెప్పినవన్నీ సరిగా రాసుకున్నానో లేదోనని మరోసారి చెక్ చేసుకుని సిగరెట్ వెలిగించాడు. పక్క గదిలో ఏదో చప్పుడైంది. దగ్గరగా వెళ్లాడు. లోపల్నించి టార్టార్ భాషలో మాటలు వినిపిస్తున్నాయి. వాళ్లు హాజీమురాద్‌కు సంబంధించిన మురిద్‌లు కావచ్చు గది తలుపు తెరిచి లోపలికెళ్లాడు.

పర్వతాలలో నివాసముండేవాళ్ల వద్ద వచ్చే ఒక ప్రత్యేకమైన వాసనతో నిండింది గది. నేల మీద బురఖా పరచివున్నది. మాసిన బనియన్ తొడుక్కుని ఒంటి క

న్ను గంజాలో దాని మీద కూర్చుని వున్నాడు. అతడు కళ్లెంతాడు అల్లుతు న్నాడు. ఏదో మాట్లాడుతున్నట్టుంది. గొంతు బొంగురుగా వుంది. కొత్త మనిషి గదిలోకి ప్రవేశించటం చూసి మాటలాపి తన పని కొనసాగించాడు.

గంజాలో ముందర నిల్చుని నవ్వుతు న్నాడు ఖాన్ మహోమా. అతడి తెల్లటి పళ్లు మెరుస్తున్నాయి. కనుబొమ్మలు లేని నుదురు వింతగా కనిపిస్తున్నది. చొక్కా చేతులు పైకి మడుచుకుని జీను పట్టీలకు పాలిష్ పెడుతున్నాడు ఎల్దార్. అందర్లోకీ ముఖ్యుడు ఖనేఫీ అక్కడ కనిపించలేదు.

## కొత్తగాలి...

**నవనాగరికం**
**చెల్లికీ, చెలికీ**
**భారం, భేదం**
**మార్చేయత్నం**

– చక్కాల లక్ష్మీప్రియంవద,
కావలి

అతడు వంటింట్లో డిన్నర్ తయారు చేస్తు న్నాడు.

"దేని గురించి వాదులాడుకుంటు న్నారు? " అని అడిగాడు లారిస్‌మెలికొవ్.

"అతడు (హాజీమురాద్) షామిల్‌ను పొగుడుతుంటాడు. రాత్రీపగలూ షామిల్ చాలా గొప్పవాడు, పండితుడు, మహా పవిత్రుడు, మహా ధైర్యశాలి అంటూ..." అన్నాడు ఖాన్‌మహోమా.

"అతణ్ణి వదిలి వచ్చి యింకా పొగడటం దేనికి? "

"అదేగదా, అక్కడ వుండలేకనే యిక్కడి కొచ్చాడు. అయినా అతడంటే ఎక్కడ లేని గౌరవం" అన్నాడు ఖాన్ మహోమా మళ్లీ మొహం చిట్లించి.

"అతడు నిజంగా అంత సాధుపుంగవుడ నుకుంటున్నాడా? "

"మహాత్ముడు కాకపోతే జనం అతడు చెప్పిన మాట ఎందుకు వింటున్నారు మరి? "

"షామిల్‌లో అలాంటిదేమీ లేదుగాని, మన్సూర్ మాత్రం నిజంగా సాధుపుంగవుడు. అతడు ఇమాంగా వున్నప్పుడు జనం యిలా లేరు. అతడు గుర్రం మీద వూళ్లలోకి వచ్చినప్పుడు, జనం అతడి కోటు కొసలను ముద్దాడేవారు. తాము చేసిన పాపాలు చెప్పుకొని, యికముందర అలా చెయ్యమని ఒట్టు పెట్టుకునేవారు. అప్పుడు మా ప్రజలందరూ సాధువులలాగే బతికారని చెబుతారు పెద్దవాళ్లు. ఆ కాలంలో తాగుడు లేదు. చుట్ట కాల్చటం లేదు. నమాజును అశ్రద్ధ చేయటం లేదు. ఎవరైనా తప్పుచేసినా పెద్ద మనసుతో క్షమించేవాళ్లు. ఒకరికోసం ఒకరు ప్రాణాలర్పించటానికైనా సిద్ధంగా వుండేవారు. ఎవరికైనా దారిలో డబ్బు కనిపిస్తే దాన్నో కర్రకు కట్టి అక్కడే వదిలివెళ్లేవారు. అది ధర్మకాలం గనకే దేవుడు అందర్నీ చల్లగా చూశాడు. ఇప్పటిలా కాదు" అన్నాడు ఖాన్ మహోమా.

"మా పర్వత ప్రాంతాల్లో యిప్పుడు కూడా ఎవరూ తాగరు. చుట్ట కాల్చరు" అన్నాడు గంజాలో.

"నీ షామిల్‌కు నాగరికత తెలియదు. వాడో రెండుకాళ్ల జంతువు" అన్నాడు ఖాన్ మహోమా.

"అవును. పర్వత ప్రాంతాల్లో వుండేవాళ్లు కాస్త మొరటుగానే వుంటారు" అన్నాడు గంజాలో.

"పర్వతాల్లో గద్దలుంటాయి"

"మాటకు మాట బాగా చెప్పావు" అన్నాడు ఖాన్ మహోమా, తిట్టిన తన

మిత్రుణ్ణి మెచ్చుకుంటూ ఆ తర్వాత.

లారిస్ మెలికోవ్ చేతిలో వెండి సిగరెట్ కేసు చూసి "ఓ సిగరెట్ ఇవ్వు" అన్నాడు.

"మీరు సిగరెట్లు కాల్చకూడదు గదా?" అన్నాడు లారిస్ మెలికోవ్.

హాజీమురాద్ పడకగది వైపు చూస్తూ, "ఎవరూ చూడనప్పుడు కాలిస్తే ఫరవాలేదు" అన్నాడు ఖాన్ మహోమా. కాని ఆ తర్వాత సిగరెట్ వెలిగించి పొగ లోపలికి పీల్చకుండా వదిలేశాడు.

"ఇది చాలా తప్పు" అంటూ కోపంగా గదిలోంచి వెళ్లిపోయాడు గంజాలో.

లారిస్ మెలికోవ్ అతడి వైపే చూశాడు. ఆ వూళ్లో సిల్క్ బనియన్లు, టోపీలు ఎక్కడ దొరుకుతాయని అడిగాడు ఖాన్ మహోమా.

"ఏం, అన్ని డబ్బులున్నాయా?" అన్నాడు లారిస్ మెలికోవ్.

"ఎంతోకొంత వుందిలే"

"ఆ డబ్బు ఎక్కణ్ణించి వచ్చిందో అడగండి" అన్నాడు ఎల్దార్, లారిస్ మెలికోవ్‌తో.

"ఆటలో గెల్చుకున్నాను" అని తను క్రితం రోజు టిఫ్లిస్‌లో తిరుగుతున్నప్పుడు రష్యన్లు, ఆర్మీనియన్లు బొమ్మాబొరుసూ ఆడటం చూసి తనూ పందెంకాసి గెలిచానని చెప్పాడు. "వాళ్లు బంగారు, వెండి నాణాలతో ఆడుతున్నారు. నేను రాగి నాణాలతో ఆడాను. అయినా గెలిచాను"

"భలేగా వుందే. ఎలా ఆడావు? ఎంత డబ్బు పణంగా పెట్టావేమిటి?"

"పన్నెండు కోపెక్కులే"

"పోయుంటే?"

"ఇదుందిగా!" అంటూ తన పిస్టల్ చూపించాడు ఖాన్ మహోమా.

"అది కూడా యిచ్చేసేవాడివా?"

"ఇవ్వటమే? కాలికి బుద్ధి చెప్పేవాణ్ణి. ఎవరన్నా ఆపటానికి ప్రయత్నిస్తే దీంతో కాల్చి చంపేవాణ్ణి"

"నిజంగా గెలిచావా?"

"మొత్తం గెలుచుకున్నాను"

ఖాన్ మహోమా, ఎల్దార్‌లు ఎలాంటి వాళ్లో లారిస్ మెలికోవ్‌కు బాగా అర్థమైంది. ఖాన్ మహోమాకు పైలాపచ్చీసు జీవితం యిష్టం. తన జీవితమే కాదు-ఎవరి జీవితమూ అతడికి ముఖ్యం కాదు. ఇలా చీకూ చింతాలేకుండా తిరగవచ్చుననే అతడు రష్యన్ పక్షం వచ్చాడు. ఇలా బతకగలిగే అవకాశమిస్తానంటే అతడు తిరిగి షామిల్ వైపు పొమ్మన్నా పోతాడు. ఎల్దార్‌ను మాత్రం అర్థం చేసుకోవటం కష్టం. అతడికి నియమనిష్ఠలెక్కువ. శారీరకంగానూ, మానసికంగానూ బలవంతుడు.

గంజాలో ఒక్కడే అతడికి అంతు చిక్కలేదు. వాడికి షామిల్ అంటే ఆరాధనా భావం, రష్యన్లంటే ద్వేషం, అసహ్యం. ఇలాంటి వాడు మరి హాజీమురాద్‌తో కలిసి తమవైపు ఎందుకొచ్చాడు? తమ వున్నతోద్యోగులు కొందరు అనుమానం వ్యక్తం చేసినట్టుగా షామిల్ పట్ల అతడు చూపించింది కపట వైరమేమో? అతడు లొంగిపోయినట్టుగా నటిస్తున్న షామిల్ తరఫు గూఢాచారి కావచ్చు.

ఇక హాజీమురాద్! గంజాలోతో మాట్లాడిన తర్వాత అనుమానం బలపడింది. హాజీమురాద్ బాగా నటించగలడు. ద్వేషం దాచుకొని ప్రేమ చూపించగలడు.. కాని అంత సమర్థుడు కాదు గంజాలో.

లారిస్ మెలికోవ్ మరి కొంతసేపు అతణ్ణి అవీయివీ అడిగాడు. కాని గంజాలో నోరు మెదపకుండా తన పని చేసుకుంటూ అవును, కాదంటూ తలూపాడు.

కాసేపటికి హాజీమురాద్ మరొక అనుచరుడు ఆవర్ ఖనేఫీ అక్కడికి వచ్చాడు. అతనూ బలాఢ్యుడే. ఎప్పుడూ ఏదో ఒక పనిలో నిమగ్నమై వుంటాడు. హాజీము

రాద్ నమ్మినబంట్లలో ముఖ్యుడితడు.

బియ్యం తీసుకుపోవడానికి గదిలోకి ప్రవేశించగానే లారిస్‌మెలికోవ్ అతణ్ణాపి "ఎక్కడి నుంచి వచ్చావు? ఎన్నాళ్లుగా హాజీమురాద్‌తో వుంటున్నావు? " అని ప్రశ్నించాడు.

"నాదీ, అతన్దీ ఒకే వూరు. అయిదేళ్లుగా కలిసి వుంటున్నాం. నా తండ్రి, అతడి అంకుల్ని చంపాడు. వాళ్లు నన్ను చంపాల నుకున్నారు. నన్ను తన పెంపుడు తమ్ము డిగా స్వీకరించమని అతణ్ణడిగాను" అంటూ తన కథ చెప్పాడు ఖనేఫీ.

"పెంపుడు తమ్ముడంటే? "

"రెండు నెలల పాటు జుత్తు, గోళ్లు కత్తి రించుకోలేదు అప్పుడు. హాజీమురాద్ యింటికెళ్లి ఆయన తల్లిని శరణుగోరాను. ఆమె నన్ను క్షమించింది. అలా, అతడికి తమ్ముణ్ణయ్యాను"

పక్కగదిలోంచి హాజీమురాద్ గొంతు వినిపించింది. ఎల్దార్ వెంటనే చేతులు తుడుచుకుని పెద్ద పెద్ద అంగలతో గది విడిచి వెళ్లాడు. ఆ వెంటనే తిరిగి వచ్చి "మిమ్మల్ని లోపలికి రమ్మంటున్నాడు" అని చెప్పాడు.

ఖాన్ మహోమాకు మరో సిగరెట్టిచ్చి, హాజీమురాద్ గదిలోకి వెళ్లాడు లారిస్ మె లికోవ్.

★ ★ ★

గదిలోకి ప్రవేశించిన లారిస్ మెలికో వ్‌ను నవ్వుతూ ఆహ్వానించిన హాజీము రాద్ "ప్రారంభించనా? " అన్నాడు.

"తప్పకుండా ఇప్పటిదాకా మీ వాళ్లతో మాట్లాడాను. ఒకడు భలే సరదాగా వున్నాడు"

"వాడు ఖాన్ మహోమా, చిల్లర వెధవ" అన్నాడు హాజీమురాద్.

"మరొకడు చూడటానికి భలే అందంగా వున్నాడు"

"ఎల్దార్. అలా కనిపిస్తాడు గాని, వాడు వుక్కు మనిషి"

కాసేపిద్దరూ మౌనంగా వున్నారు.

"ప్రారంభించనా? ఖాన్‌లు ఎలా హత్యకు గురయ్యారో చెప్పాను గదా! ఆ తర్వాత కుంజాక్‌కు వచ్చిన హంజద్ వాళ్ల భవంతిలో తిష్టవేశాడు. ఖాన్షా ఒక్కతే యింకా బతికున్నది. ఆమెకు కబురు పెట్టాడు హంజద్. 'ఇంత అవమానమా!' అంటూ నానా తిట్లూ తిట్టింది ఖాన్షా. హంజద్ తన 'మురిద్' అసెల్దార్‌కు సైగ చేశాడు. వాడు వెనకనుండి ఆమె తలనరి కాడు"

"ఆమెనెందుకు చంపాల్సి వచ్చింది? "

"ముందు కాళ్లెక్కడికి తీసుకెడితే వెనకా ళ్లు అక్కడికే పోతాయి. మొత్తం కుటుం బాన్ని నాశనం చేశాడు. అందరికన్నా చిన్నవాణ్ణి, ఓ కొండపై నుంచి తోసి చంపే శాడు షామిల్"

"అలా అవేరియా అంతా హంజద్‌కు లొంగిపోక తప్పలేదు. కాని నేనూ, నా తమ్ముడు మాత్రం లొంగిపోవటానికి నిరా కరించాం. ఖాన్‌ల హత్యకు ప్రతీకారం తీర్చుకోవాలనుకున్నాం. లొంగిపోయినట్టు నటించాం. కాని లోపల వాడిని ఎలా చంపాలా? అని ఆలోచిస్తూనే ఉన్నాం. నెత్తురు సలసలా కాగింది. మా తాత సల హాతో ఓ ప్రణాళిక సిద్ధం చేసుకున్నాం. అతడు భవంతి వెలుపలి కొచ్చినప్పుడు చుట్టుముట్టి చంపెయ్యాలి. ఈ విషయం హంజద్‌కు చేరవేశారెవరో. మా తాతను పిలిచి 'నీ మనవలు నా మీద కుట్ర చేస్తు న్నారని తెలిసింది. అదే నిజమయితే, నువ్వూ, వాళ్లూ ఒకే ఉరికంబానికి వేళ్లాడ తారు. నేను దేవుడి మనిషిని. దేవుడి పని చేస్తున్నాను. నాకెవరూ అడ్డుతగలకూ డదు. అర్థమైందా? ' అని హెచ్చరించి పంపాడు.

తాత, తిరిగివచ్చి మాకీ విషయం చెప్పాడు.

ఇక నిరీక్షించకూడదు. పని త్వరగా పూర్తి చెయ్యాలి. మసీదులో తొలిరోజు విందు నాటికి ముహూర్తం పెట్టుకున్నాం. మిగతా కామ్రేడ్‌లు అందుకు అంగీకరించ లేదు గాని నేనూ, నా తమ్ముడూ మొండి కేశాం. ఇద్దరం రెండేసి పిస్టల్‌లని మా బుర్ఖాలలో దాచుకుని మసీదుకెళ్లాం. ముప్ఫైమంది మురిద్‌లు వెంటరాగా, మసీదులోకి ప్రవేశించాడు హంజద్. అందరి చేతుల్లోనూ ఖడ్గాలు తళతళా మెరుస్తున్నాయి. అసెల్దార్ (ఖాన్లా శిర చ్ఛేదం చేసినవారు) మమ్మల్ని చూసి, బుర్ఖాలు తీసి ముందుకు రమ్మన్నాడు. నా చాకుతో వాడిని పొడిచి చంపి, హంజద్ వైపు పరిగెత్తాను నేను. కాని అప్పటికే నా తమ్ముడు ఉస్మాన్ హంజద్‌ను కాల్చాడు. బులెట్ తగిలినా, హంజద్ మావాడి పైకి లంఘించాడు. కాని నేను మరొక్క వేటుతో అతడి కథ ముగించాను. వాళ్లు ముప్ఫైమంది. మేం ఇద్దరం. వాళ్లు ఉస్మా న్‌ను చంపేశారు. నేను కిటికీ లోంచి దూకి పారిపోయాను.

హంజద్ మరణించాడని తెలిశాక, జనం తిరగబడ్డారు. చాలామంది మురిద్‌లు పలాయనం చిత్తగించారు. మిగిలిన వాళ్లను జనం చంపేశారు"

హాజీమురాద్ ఆగి ఊపిరి తీసుకుని, తిరిగి ప్రారంభించాడు.

"అప్పటికి సమస్య పరిష్కారమైనట్టేనని అనిపించింది. కాని త్వరలోనే కథ మళ్లీ మొదటికొచ్చింది. హంజద్ తర్వాత షామిల్ అధికారం చేపట్టాడు. రష్యన్లను ఎదిరించటానికి, నేను తనతో చేయి కల పాలని కోరుతూ నా వద్దకు తన దూత లను పంపాడు. నేను నిరాకరిస్తే, నన్ను చంపటమే కాక, కుంజాక్ గ్రామాన్నే నేల మట్టం చేస్తానని బెదిరించాడు.

నేనతనకి ఎలాంటి సహాయమూ చెయ్యను. అతణ్ణి మా గ్రామానికి కూడా రానివ్వనని నిర్ణయం తెలియచేశాను"

"నువ్వతనితో ఎందుకు చేతులు కలప లేదు? "

నుదురు చిట్లించి కాసేపు మౌనంగా ఉన్నాడు హాజీమురాద్.

"ఎలా కలపగలను? నా తమ్ముడు ఉస్మాన్, అబు నట్సల్ ఖాన్‌లను చంపిన వాడికి ఎలా సహకరిస్తాను? జనరల్ రోసెన్ నన్ను అవేరియా పరిపాలించుకొమ్మని ఆదేశించాడు. కాని అతడే కాజీ కుముల్‌కు అధికారిగా మొదట మహమ్మద్ మీర్జానూ, తర్వాత అహ్మద్ ఖాన్‌నూ

> **కొత్తగాలి...**
>
> **భారతీయ శాంతిమంత్రం**
> **పగవాడి పరిహాసం**
> **సరిహద్దుల్లోకి ఎగిరి వెళ్లిన పావురం**
> **వాడికి ఫలహారం**
>
> *- కందాళై రాఘవాచార్య,*
> *నిజామాబాద్*

నియమించాడు. అహ్మద్ ఖాన్‌కు నేనంటే ద్వేషం. ఖాన్లా కూతురు సుల్తానెట్టాను తన కొడుక్కు చేసుకోవాలని అతడి కోరిక. ఆమె అందుకు నిరాకరించింది. అలా ఆమె నిరాకరించటానికి కారణం నేనే అని అతడి అనుమానం. నన్ను చంపించటానికి తన మనుషులను కూడా పంపాడు. ఏదో రకంగా నేను తప్పించుకున్నాను. ఆ తర్వాత జనరల్ క్లూగెనౌకు నా గురించి పితూరీలు చెప్పాడు. నేను రష్యన్లకు కలప సరఫరా ఆపివెయ్యమని ఆవర్‌లకు చెప్పా ననీ, నేనీ పాగా (తలకున్న పాగా

చూపిస్తూ) పెట్టుకుంటాననీ, అంటే దీని అర్థం నేను షామిల్ పక్షం చేరినట్టేననీ ఉన్నవీ లేనివీ కల్పించి జనరల్‌కు నామీద దురభిప్రాయం కలుగచేశాడు. మొదట జనరల్ వీటిని నమ్మలేదన్నారు గాని, అతడు టిఫ్లిస్ వెళ్ళిపోయిన తర్వాత అహ్మద్ ఖాన్ ఆగడాలకు అడ్డులేకుండా పోయింది. అతడి సైనికులు వచ్చి నన్ను బంధించి, సంకెళ్లు వేసి శతఘ్ని ముందు నిలబెట్టారు.

అలా ఆరు రోజులు గడిచాయి. ఏడో రోజున కట్లు విప్పి నన్ను తెమిర్‌ఖాన్ షురాకు తీసికెళ్లారు. తుపాకులు ఎక్కుపెట్టిన నలభైమంది సైనికులు నాకు కాపలా. పారిపోవటానికి ప్రయత్నిస్తే తక్షణం కాల్చెయ్యాలని వాళ్లకు ఆదేశాలున్నాయి.

> ## కొత్తగాలి...
>
> **అందని**
> **ద్రాక్ష**
> **ఇంకా**
> **కాంక్ష**
>
> – ఎ. జనార్దనం,
> విశాఖపట్నం

మేం మనోష్కాను సమీపించినప్పుడు, దారి ఇరుకయ్యింది. ఒకవైపు నూట ఇరవై గజాల లోతు గల లోయ ఉంది. నేను అటుగా నడిచాను. అంచున నిల్చున్నప్పుడు ఒక సైనికుడు నన్ను ఆపటానికి ప్రయత్నించాడు గాని అతణ్ణి కూడా వెంట లాక్కుని కిందికి దూకాను. అతడు మరణించాడు. చూస్తున్నారుగా, నేను బతికే ఉన్నాను.

పక్కటెముకలు, కాళ్లూచేతులు విరిగాయి. పాకటానికి ప్రయత్నించాను గాని మగత కమ్ముకున్నది. తిరిగి స్పృహ వచ్చే సరికి నెత్తుటి మడుగులో ఉన్నాను. ఒక గొర్రెల కాపరి చూసి ఊరివాళ్లను పిలిచాడు. నేను వాళ్లతోనే కొన్నాళ్లు గడిపాను. గాయాలు మానాయి గాని ఓ కాలు పొట్టిదైంది. అయితేనేం, బాగానే నడుస్తున్నాను గదా!

నా గురించి తెలిసి పక్క ఊళ్ల జనం కూడా చూడటానికి వచ్చారు. మరికాస్త కోలుకున్న తర్వాత నా స్వగ్రామం సెల్మెస్‌కు వెళ్లిపోయాను. ఆవర్లు మళ్లీ నన్ను అధికారం చేపట్టమన్నారు. నేను అంగీకరించాను" అంటూ సంతృప్తిగా నిట్టూర్చి ముగించాడు.

ఆ తర్వాత ఒక సంచిలోంచి రంగువెలిసిన కాగితాలు కొన్ని తీసి లారిస్ మెలికోవ్‌కు అందించాడు. అవి తనకు జనరల్ క్లూగెనౌ రాసిన లేఖలు.

"లెఫ్టినెంట్ హాజీమురాద్! మీరు నావద్ద సమర్థవంతంగా పనిచేశారు. నేను మీ నిజాయితీని శంకించలేదు. కాని ఇటీవల మీరు మాకు ద్రోహిగా మారారన్న విషయం నా దృష్టికి వచ్చింది. మీరు పాగా ధరిస్తున్నారనీ, షామిల్‌తో తరచుగా సమావేశమవుతున్నారనీ తెలిసింది. రష్యన్ ప్రభుత్వాన్ని ఎదిరించమని మీరు మీ ప్రజలను ప్రోత్సహిస్తున్నారు. నేను మీ అరెస్టుకు ఆజ్ఞాపించాను గాని మీరు మా వాళ్ల కళ్లుగప్పి పారిపోయారు. ఇది మంచి చేస్తుందో చెడు చేస్తుందో నాకు తెలియదు. మీరు నేరస్థుడో, నిరపరాధో కూడా ఇప్పుడే నిర్ణయించలేను. అందువలన నా సలహా పాటించి, మీరు నిజంగా ఏ నేరమూ చెయ్యలేదని భావించినట్టయితే, జార్ చక్రవర్తికి నిజాయితీగా భక్తిశ్రద్ధలతో సేవ చేస్తున్నానని నమ్ముతున్నట్టయితే వెంటనే నావద్దకు రండి. నేను మీకు అభయం ఇస్తున్నాను. నేను మీకు రక్ష

ణగా ఉంటాను. ఖాన్ స్వయంగా నా అదుపాజ్ఞలలోనే ఉంటాడు గనక అతడు మీకేమీ కీడు తలపెట్టలేడు"

ఇచ్చిన మాట నిలబెట్టుకుంటానని క్లూగెనౌ మరోమారు స్పష్టం చేశాడు.

లారిస్ మెలికొవ్ రెండో ఉత్తరం చదవేలోగా తను మొదటి ఉత్తరానికి రాసిన జవాబు గురించి చెప్పాడు హాజీమురాద్.

"నేను పాగా పెట్టుకున్నది షామిల్ కోసం కాదు. నా పవిత్ర ఆచారాన్ని అనుసరించటం కోసమని రాశాను. నాకు షామిల్ వద్దకు వెళ్లవలసిన అవసరమూ, వెళ్లాలనే కోరికా లేవు. అతడు నా తండ్రిని, సోదరులను, బంధువులను చంపాడు. అయితే నేను రష్యన్ల పక్షం కూడా చేరలేను. ఎందుకంటే వాళ్లు నాతో అమర్యాదగా ప్రవర్తించారు. కుంజాక్‌లో నేను బందిగా ఉన్నప్పుడు ఒక నీచుడు నామీద ఉమ్మేశాడు. వాణ్ణి చంపితే తప్ప, మీతో జతకట్టలేను. ముఖ్యంగా పరమ దుర్మార్గుడు అహ్మద్‌ఖాన్ అంటే నాకు భయం. వాడున్న చోట నేనుండలేను. నా ఉత్తరానికి జనరల్ రాసిన జవాబిది" అంటూ మరో రంగు వెలసిన కాగితం అందించాడు హాజీమురాద్.

'నీ ఉత్తరానికి ధన్యవాదాలు. ఎవడో నిన్ను అవమానించినందుకు గాను, మాతో చేరనంటున్నావు. రష్యన్ చట్టాల ప్రకారం అందరికీ న్యాయం జరుగుతుంది. వాడిని నీ కళ్లముందే శిక్షించగలం. ఈ విషయంలో ఇప్పటికే ఆదేశాలు జారీచేశాను.

మరో విషయం కూడా గుర్తుంచుకో, హాజీమురాద్! నా పదవినీ, హోదాను కూడా నువ్వు గౌరవించనందుకు నాకు నీమీద కోపంగా ఉంది. అయినా క్షమిస్తున్నాను. పర్వతాలలో ఉండే మీరు మనుషుల్ని ఓ పట్టాన నమ్మరు. కేవలం ఆచారం కోసమే పాగా పెట్టుకున్నట్టయితే భయమెందుకు? రష్యన్ ప్రభుత్వాన్ని చూసి బెదిరిపోవటమెందుకు? నిన్ను అవమానించిన వాణ్ణి నీ కళ్లముందే శిక్షిస్తాం. వాడి ఆస్తి జప్తు చేసి నీపేర రాసిస్తాం. రష్యన్లకు మీరంటే అపార గౌరవం. ఎవడో అనామకుడు అవమానించినంత మాత్రాన మా దృష్టిలో మీ స్థాయి ఏమాత్రం తగ్గలేదు.

అనేక మంది పాగా ధరించటానికి నేను స్వయంగా అనుమతించాను. ఈ ఉత్తరాన్ని మీకు చేర్చిన వ్యక్తితో కలిసి నావద్దకు వెంటనే రా'

"అయినా నేను అతడి మాటల్ని నమ్మలేదు. క్లూగెనౌ వద్దకెళ్లలేదు" అన్నాడు హాజీమురాద్. కాసేపాగి సాలోచనగా,

> **కొత్తగాలి...**
>
> **మానవులకు ఆరోగ్యమే**
> **మహా భాగ్యం!**
> **ఇహలోక సౌఖ్యాలకు**
> **అదే గదా భోగ్యం!**
>
> – పారుపల్లి వెంకటేశ్వరరావు,
> హైదరాబాద్

"అహ్మద్‌ఖాన్ మీద ప్రతీకారం తీర్చుకోవటం నా లక్ష్యం. అందువల్ల నేను రష్యన్ల పంచన చేరే ప్రసక్తేలేదు. ఆ తర్వాత అహ్మద్‌ఖాన్ మా గ్రామం సెల్మెస్‌ను చుట్టుముట్టి నన్ను బందీగా పట్టుకుని చంపటానికి ప్రయత్నించాడు. నా దగ్గర అప్పుడంత సైన్యం కూడా లేదు. అతణ్ణి ఎదిరించే శక్తి లేదు. సరిగ్గా అప్పుడు షామిల్ దూతలు వచ్చి, అహ్మద్‌ఖాన్‌తో యుద్ధంలో నాకు సాయం చేస్తామన్నారు. ఓడిస్తే అతణ్ణి చంపి, అవేరియాకు నేనే ఏకచత్రాధిపతిని కావచ్చు. అలా అన్ని విషయాలూ బేరీజు వేసుకుని నేను షామి

ల్‌తో చేరిపోయాను. అప్పటినుండీ రష్యన్లతో యుద్ధం చేస్తూనే వున్నాను"

ఆ తర్వాత తను చేసిన పోరాటాలన్నీ ఒక్కొక్కటీ వివరంగా చెప్పాడు హాజీమురాద్. అందులో కొన్నింటి గురించి లారిస్ మెలికోవ్‌కు అప్పటికే తెలుసు. మెరుపు యుద్ధాలు చెయ్యటం హాజీమురాద్ ప్రత్యేకత. ఇంచుమించు అన్నింటిలోనూ అతడిదే పైచేయి.

"అయినప్పటికీ నాకూ షామిల్‌కూ మధ్య దోస్తీ లేదు. అతడికి నేనంటే భయం. కాని నా అవసరముంది. షామిల్ తర్వాత ఎవరు యిమాం కావాలని ఎవరో అడిగారొకసారి. 'ఎవరు విజేత అయితే వాడే ఇమాం' అన్నాను.

ఈ విషయం తెలిసి షామిల్ నన్ను వదిలించుకోవటానికి ప్రయత్నించాడు. అతడు నన్ను తబసరాన్ పంపించాడు. నేను అక్కడ వెయ్యి గొర్రెలు, మూడు వందల గుర్రాలు పట్టి తెచ్చాను. అయినా అతడు సంతోషించలేదు. పైగా నన్ను నిందించి 'నాయబ్'(గవర్నర్) పదవి నుండి తొలగించాడు. నా వద్ద వున్న ధనమంతా తిరిగి యివ్వమన్నాడు. నేను వెయ్యి బంగారు నాణాలు పంపించాను. అతని మురిద్‌లు వచ్చి నా ఆస్తినంతా లాక్కున్నారు. నన్ను తన వద్దకు రమ్మని ఆజ్ఞ జారీ చేశాడు. నన్ను చంపుతాడని తెలుసు. నేను వెళ్లలేదు. నన్ను బందీగా పట్టుకురమ్మని తన మనుషుల్ని పంపించాడు. అప్పుడు నేను వొరొంట్సొవ్‌ను ఆశ్రయించాను. నా కుటుంబాన్ని వూళ్లో వదిలి ఒంటరిగా ఆయన దగ్గరకెళ్లాను. నా తల్లి, నా భార్యలు, నా కొడుకులు అతడి చెరలో వున్నారు. సర్దార్‌కు చెప్పండి. నా కుటుంబం షామిల్‌కు బందీగా వున్నంత కాలం నేను నిస్సహాయుణ్ణి. మీకేవిధంగానూ వుపయోగపడలేను"

"చెబుతానులే" అన్నాడు లారిస్ మెలికోవ్.

"నా కోరిక మన్నించి నా కుటుంబాన్ని రక్షించండి. అంతా మీ చేతుల్లో వుంది. నన్నూ, నా వాళ్లనూ షామిల్ చెరనుండి విడుదల చెయ్యమని మరీమరీ వేడుకుంటున్నాను" అంటూ ముగించాడు హాజీమురాద్.



డిసెంబర్ 20న మినిస్టర్ ఆఫ్ వార్, ప్రిన్స్ చెర్నిషోవ్‌కు ఫ్రెంచిలో వొరొంట్సొవ్ రాసిన వుత్తరం యిలా వుంది-

డియర్ సర్,

నేనీ వుత్తరం ఆలస్యంగా రాయటానికి ఒకే కారణం, హాజీమురాద్‌తో ఏం చెయ్యాలో ఇంకా మేం నిర్ణయించుకోలేదు. గత రెండుమూడు రోజులుగా నా ఆరోగ్యం అంత బాగాలేదు.

హాజీమురాద్ మనవైపు వచ్చి చేరాడని నేనిదివరకే రాశాను. ఎనిమిదవ తేదీనాడు అతడు టిఫ్లిస్ చేరుకున్నాడు. ఏడెనిమిది రోజులుగా అతడితో మాట్లాడుతూనే వున్నాను. భవిష్యత్తులో అతడు మనకెలా వుపయోగపడతాడు? ప్రస్తుతం అతణ్ణి ఏంచెయ్యాలి? అని ఆలోచిస్తున్నాను. తన కుటుంబం గురించి అతడు చాలా ఆందోళన చెందుతున్నాడు. వాళ్లు షామిల్ చెరలో వున్నంతకాలం తను మనకేవిధం

గానూ వుపయోగపడలేననీ, కృతజ్ఞతగా ఏ ప్రత్యుపకారమూ చెయ్యలేననీ పదేపదే చెబుతున్నాడు.

అతడు రాత్రుళ్లు ప్రశాంతంగా నిద్రపోలే కపోతున్నాడని తెలిసింది. భోజనం కూడా ముట్టడంలేదు. నిరంతరం ప్రార్థనలో గడుపుతున్నాడు. కోసక్కులతో కలిసి గుర్రపుస్వారీ చెయ్యటమొక్కటే అతడి వినోదం. పైగా అది అతడికి మొదటినుండీ వున్న అలవాటు. ప్రతిరోజూ నావద్దకొచ్చి- తన కుటుంబం గురించి ఏమైనా తెలిసిందా -అని అడుగుతాడు. మనం పట్టుకున్న షామిల్ మనుషులందర్నీ అతడికి తిరిగి అప్పగించి తన వాళ్లను విడుదల చేయించమని ప్రాధేయపడతాడు. కావాలంటే డబ్బులిస్తానంటాడు. 'నా కుటుంబాన్ని రక్షించండి. మీకు సేవచేసే అవకాశం కల్పించండి' ఇది అతని నివేదన. 'ఆ తర్వాత నా సేవతో మీరు తృప్తిచెందకపోతే, నన్ను శిక్షించండి' అంటాడు మరోసారి. అక్కడ కుటుంబ సభ్యులున్నంత వరకూ యితడివల్ల మనకుపయోగంలేదని తెలుసు. పరిహారంగా పెద్దమొత్తంలో డబ్బిచ్చి వాళ్లను విడిపించుకోవాలంటే, అంత డబ్బు మంజూరుచేసే అధికారం నాకు లేదు. హాజీమురాద్ వెంటనే తిరిగి రాకపోతే అతడి తల్లినీ, యితర కుటుంబ సభ్యుల్నీ చంపుతానని షామిల్ బెదిరించే అవకాశమూ వుంది. నిజంగా అలాంటి పరిస్థితి వస్తే ఏం చేస్తావని ఒకసారి అతణ్ణడిగాను. చేతులు పైకెత్తి అంతా దేవుడి దయ అంటూ నిట్టూర్చాడు. అయితే ఏది ఏమైనా అతడికి లొంగిపోనంటాడు. లొంగిపోతే తనను ఎలాగూ చంపేస్తాడు గదా అంటాడు. తొందరపడి తన కుటుంబాన్ని అతడు నాశనం చెయ్యడని హాజీ మురాద్ నమ్మకం. దాగెస్తాన్‌లో వున్న అనేకమంది ప్రముఖులు అలాంటి పనిచెయ్యకుండా అతడిమీద వత్తిడి తెస్తారు.

## సచిత్ర వార పత్రిక!

ఓసారి ఎవరో అప్పట్లో ప్రచురితమవుతున్న 'సత్యవాణి' అనే సచిత్ర వారపత్రికను అబ్బూరివారికి ఒక కాపీ తెచ్చి ఇచ్చారు. ఎన్నిసార్లు, ఎటు తిరగేసి చూసినా కనీసం ఒక్క బొమ్మ కూడా ఆ వారపత్రికలో అబ్బూరివారికి కనిపించలేదు.



వెంటనే అతడు ఆ పత్రికను తెచ్చిచ్చిన వ్యక్తితో 'ఏమయ్యా! ఇది సచిత్ర వార పత్రిక ఎలాగవుతుందయ్యా! దీన్ని నిజానికి నచిత్ర వారపత్రిక అని ప్రకటించాల్సి వుంటుంది' అన్నారు అబ్బూరివారు ఛలోక్తిగా.

కనీసం చెచెన్యా సరిహద్దులకు తను చేరుకోగలిగితే ఎవరో ఒకరు తన కుటుంబ సమాచారం చేరవేస్తారు. ఆ అవకాశమైనా తనకు లభించదా అని వాపోతాడు.

ఇరవై ముప్ఫై మంది కోసక్కుల రక్షణ దళంతో గ్రోజ్నీ వెళ్లిపోతానంటాడొకసారి.

నేనీ విషయాలన్నీ యింత వివరంగా మీకెందుకు రాస్తున్నానో, మీకిప్పటికే అర్థమైవుంటుంది. నా బాధ్యతను నేను విస్మరించలేను. అతణ్ణి పూర్తిగా నమ్మలేను. అయితే అతణ్ణి పూర్తిగా నిర్బంధించటం కూడా సరికాదు. మనమతడిని యిబ్బంది పెట్టినట్టుగా తెలిస్తే, దాగెస్తాన్‌లో మనకు చాలా నష్టం జరుగుతుంది. అక్కడ ఎక్కువమంది షామిల్‌కు వ్యతిరేకంగా, మనకు

అనుకూలంగా వున్నారు. హాజీమురాద్ పట్ల మన ప్రవర్తనను బట్టే దాగెస్తాన్ ప్రజలంటే మనకెంత గౌరవాభిమానాలున్నాయో తెలిసిపోతుంది. అందువలన ఇతడిపట్ల నేను వ్యవహరించిన పద్ధతి సరైనదనే అనుకుంటున్నాను. అయినప్పటికీ అతడికి మళ్లీ పారిపోయే అవకాశం కల్పిస్తే నేను పెద్దతప్పు చేసినట్టే. ఇలాంటి సంక్లిష్ట సందర్భాల్లో ఏది సబబో, ఏది కాదో నిర్ణయించటం కష్టం. మర్యాదకు భంగం కలగకూడదు. అయినా అతడిని ఓ కంట కనిపెడుతూనే వుండాలి.

మహాశయా! ఈ విషయాలన్నీ మహా ఘనత వహించిన చక్రవర్తిగారి దృష్టికి తీసుకుపోవలసిందిగా విన్నవించుకుంటున్నాను. నా చర్యలకు వారి అనుమతి లభిస్తే నేను కృతజ్ఞుణ్ణి.

మీకు రాసిన సమాచారమంతా నేను జనరల్ జవాడోవ్స్కీ, జనరల్ కొజ్లోవ్స్కీలకు కూడా చేరవేశాను. హాజీమురాద్ గురించి నిర్ణయం తీసుకోవటంలో వాళ్లకీ సమాచారం వుపయోగపడుతుంది. కొజ్లోవ్స్కీ అనుమతి లేకుండా ఎక్కడికీ వెళ్లొద్దని నేనిప్పటికే హాజీమురాద్‌ను హెచ్చరించాను.

రష్యన్ ఆఫీసర్లు పక్కన లేకుండా ఒక్కడే వున్నట్టుగా కనిపిస్తే మరీ మంచిదని కూడా చెప్పాను. ఇరుపక్కలా మన సైనికులు కనిపిస్తే హాజీమురాద్‌ను మనం బందీగా పట్టుకున్నామని షామిల్ ప్రచారం చేసే అవకాశముంది. అంతే కాదు, నా కుమారుడుంటున్న వోద్విజెన్స్కయకు కూడా వెళ్లవద్దని హాజీమురాద్‌కు నచ్చచెప్పాను. అతడు అక్కడే లొంగిపోయాడు. నా కుమారుడిని అతడు 'మిత్రుడు' అనుకుంటాడు. కాని, నా కుమారుడక్కడ కమాండర్ కాడు. అందువల్ల ఇతడక్కడికి వెళితే, సైనికాధికారుల మధ్య మనస్పర్థలు వచ్చే అవకాశముంది. పైగా, వోద్విజెన్స్కయ శత్రుదేశానికి అతి సమీపంలో వుంది. హాజీమురాద్ ఎక్కడికైనా వెళ్లాలనుకుంటే గ్రోజ్నీయే సరైన చోటు.

అతడు అడిగిన ఇరవైమంది కోసక్కుల తోపాటు నా నమ్మినబంటు, అత్యుత్తమ ఆఫీసర్ లారిస్ మెలికోవ్‌ను కూడా వెంట పంపిస్తున్నాను. అతడు టార్టార్ బాగా మాట్లాడగలడు. హాజీమురాద్ గురించి బాగా తెలుసు. మంచి పరిచయం కూడా వుంది. హాజీమురాద్‌కు తన యింట్లో ఆతిథ్యమిచ్చిన ప్రిన్స్ టార్కనోవ్ కూడా నమ్మకస్తుడే. అతడితో నేనీ విషయం చర్చించాను. నేను చేసిన పని సరైనదనే అతని అభిప్రాయం. హాజీమురాద్‌ను అతిథిగా చూడాలి. లేదా జైల్లో పెట్టాలి లేదా దేశం నుండి బహిష్కరించాలి.

ఈ చివరి రెండు పనులవల్ల హాజీమురాద్-షామిల్‌ల వైరంవల్ల మనకొనగూడిన లాభం పోగొట్టుకుంటాం. హాజీమురాద్ మన పక్షం వుంటే, ప్రజలు షామిల్ మీద తిరుగుబాటు చేసే అవకాశముంది. హాజీమురాద్ నిజాయితీని టార్కనోవ్ విశ్వసిస్తున్నాడు. షామిల్ తనను క్షమించి, వదిలివేసే ప్రసక్తిలేదని హాజీమురాద్‌కు తెలుసు. షామిల్‌కు అతను దొరికితే చంపటం ఖాయం. కాకపోతే యిద్దరి మధ్యా మతం ఒక ముఖ్యమైన బంధంగా కనిపిస్తుంది. ఇద్దరికీ మతమే సర్వస్వం. అయితే షామిల్ మతాన్ని అంతగా వాడుకునే అవకాశం లేదనుకుంటాడు టార్కనోవ్. మత బంధాన్ని అంగీకరించినప్పటికీ, షామిల్‌కు చిక్కటమంటూ జరిగితే హాజీమురాద్ మరణించినట్టే.

ప్రస్తుత పరిస్థితుల గురించి యిదీ నేను మీకు సమర్పించే నివేదిక.

★ ★ ★

1851 డిసెంబర్ 24నాడు టిఫ్లిస్ నుండి

ఒక స్పెషల్ మెసెంజర్ ఈ రిపోర్ట్ తీసుకుని బయల్దేరాడు. వారం రోజులు నిర్విరామంగా అంచెలంచెలుగా పయనించి గుర్రాల్ని కొరడాలతో కొట్టి నెత్తుర్లు కారించి, అత్యంత వేగంగా పరిగెత్తించి, 31 వ తేదీన మినిస్టర్ ఆఫ్ వార్ చెర్నిషోవ్‌కు అందచేశాడు. 1 జనవరి 1852 నాడు చెర్నిషోవ్ ఈ నివేదికను యితర అధికార సమాచారంతోపాటు, చక్రవర్తి నికోలస్‌కు సమర్పించాడు. చెర్నిషోవ్‌కు వొరొంట్సొవ్ అంటే గిట్టదు. అత్యంత సంపన్నుడూ, కులీనుడూ కావటంవల్ల ఇతర సైనికాధికారులతో పోలిస్తే వొరొంట్సొవ్‌కు పరపతి ఎక్కువ. చెర్నిషోవ్ సామాన్యుడు. కేవలం ఉద్యోగం వల్లే ఈ మాత్రమైనా గౌరవ ప్రతిష్ఠలొచ్చాయి. చక్రవర్తికి వొరొంట్సొవ్ అంటే ఇష్టం. అందువల్ల అవకాశం దొరికినప్పుడల్లా అతడి దగ్గర వొరొంట్సొవ్ గురించి చెడుగా చెప్పటానికి ప్రయత్నిస్తాడు.

ఇదివరలో కాకేసియన్ పరిణామాలపై నివేదిక అందజేసినప్పుడు కేవలం వొరొంట్సొవ్ అసమర్థత, అశ్రద్ధ వల్ల అనేక మంది సైనికులు ప్రాణాలు పోగొట్టుకున్నారని చెప్పాడు. ఇప్పుడు హాజీమురాద్ విషయంలో కూడా వొరొంట్సొవ్ వైఖరి, ప్రస్తుతానికి నష్టం కలిగేదిగా ఉందని నమ్మించాలి. రష్యన్ ప్రయోజనానికి వ్యతిరేకంగా అతడు స్థానిక ప్రజలను ప్రోత్సహిస్తున్నాడని చక్రవర్తికి నివేదించాలి. అసలు హాజీమురాద్ ప్రభుత్వానికి నిజంగా లొంగిపోయాడా లేక షామిల్ తరఫున గూఢచారిగా వచ్చాడా? అతణ్ణి మధ్యరష్యాకు తరలించి తన నిజాయితీని నిరూపించుకున్న తర్వాత కుటుంబ సభ్యులను షామిల్ చెర నుండి విడిపించిన తర్వాత మాత్రమే అతడికేమైనా బాధ్యతల్ని అప్పగించటం శ్రేయస్కరం.

అయితే చెర్నిషోవ్ వేసుకున్న ప్రణాళిక ఫలించలేదు. ఆరోజు చక్రవర్తి కోపంగా, చికాకుగా ఉన్నాడు. ఎవరి సలహానూ అంగీకరించే మూడ్‌లో లేడు. ముఖ్యంగా అతడు చెర్నిషోవ్‌ను గత్యంతరం లేక, భరిస్తున్నాడే తప్ప అతడంటే ఏమాత్రం ఇష్టంలేదు. కొందరు తిరుగుబాటుదారుల మీద విచారణ జరిగినప్పుడు, వాళ్ళకెలాగైనా శిక్షపడాలని ఇతడు అత్యుత్సాహం ప్రదర్శించాడు. ఆ తర్వాత వాళ్ళ ఆస్తులు లాక్కోవటానికి ప్రయత్నించాడు. అందువలన చక్రవర్తి మనసు బాగోలేని కారణంగా హాజీమురాద్‌కు యథాస్థితి కొనసాగింది.

★ ★ ★

ఉదయం తొమ్మిదిన్నర. మంచు కురుస్తున్నది. థర్మామీటర్ మైనస్ 13 డిగ్రీలు ఫారన్‌హీట్ చూపిస్తున్నది. పొడుగాటి కోటూ, క్యాప్, ఇతర సైనిక లాంఛనాలతో గుర్రపుబండి దిగి వింటర్‌ప్యాలెస్‌లోకి ప్రవేశించాడు చెర్నిషోవ్. సహాయ యుద్ధ మంత్రి ప్రిన్స్ వాసిలి దోల్గోరుస్కీ ఏదో ఆందోళనలో ఉన్నట్టు కనిపించినా, ఎదురు వచ్చి మర్యాదగా లోపలికి ఆహ్వానించాడు.

"చక్రవర్తి గారు? " అంటూ అతిమర్యాదగా వాకబు చేశాడు చెర్నిషోవ్.

నిశ్శబ్దం ఎక్కడ భగ్నమవుతుందోన

> **కొత్తగాలి...**
>
> **జీవితంలో నటన**
> **అతిప్రమాదం**
> **నటనలో జీవించటం**
> **అందరికీ ప్రమోదం**
>
> – హెచ్. విజయలక్ష్మి,
> అనంతపురం

న్నంత భయంగా, అతి మంద్రస్వరంలో నిరీక్షించమన్నాడు దోల్గోరుస్కీ. చక్రవర్తి అధికార నివాసంలో ఉద్యోగం చేస్తున్నందుకు తనూ చక్రవర్తిననే అనుకుంటాడతను. మనిషి కదలకుండా నిటారుగా నడుస్తాడు. తల మీద నీళ్ల జగ్గుపెడితే, ఒక్క చుక్కకూడా కిందపడదు. చలిలో వచ్చినప్పుడు, కాళ్లు చచ్చుపడినట్టుగా వున్నాయేమో, కాస్త అటూఇటూ తిరిగి రక్త ప్రసరణ పెంచుకోవడానికి ప్రయత్నించాడు చెర్నిషోవ్.

ఆనాటి అపాయింట్‌మెంట్ల ఫైలును మరోసారి చెక్ చేసుకుని, చక్రవర్తిగారి గది తలుపు వారగా తెరచుకుందో లేదో.. చెర్నిషోవ్‌ను లోపలికి వెళ్ళమని సైగచేశాడు దోల్గోరుస్కీ.

అగ్నిప్రమాదం తర్వాత వింటర్ ప్యాలెస్‌ను పునర్నిర్మించారు. మొదటి అంతస్తులో చక్రవర్తి నికొలస్ నివాసం. మంత్రులూ ఇతర ఉన్నతోద్యోగులతోనూ సంప్రదించటానికి ఓ విశాలమైన హాల్ ఉంది. చక్రవర్తి అలెగ్జాండర్ చిత్రపటం ప్రముఖంగా ఓ గోడకు వేలాడుతుందక్కడ.

ఓ టేబుల్ వెనక కూర్చున్నాడు నికొలస్. అతనిది మహాకాయం. బాన పొట్టను భరించలేనట్టుగా వెనక్కువాలి కూర్చున్నాడు. గదిలోకి ప్రవేశించిన వాళ్లను నిరాసక్తంగా చూస్తాడు. కళ్ళలో వెలుగు లేదు. మొహం పాలిపోయివుంది.

జుత్తు పలచబడి నుదురు విశాలంగా కనిపిస్తున్నది. మీసాలకింద పెదాలు సరిగా కనిపించడం లేదు. కొవ్వు పెరిగి క్రిందికి జారిన చెక్కిళ్లు మాంసం ముద్దల్లా ఉన్నాయి. అతడు అలసిపోయి నీరసంగా వుండటానికి కారణముంది.

సహజంగానే మూడ్ బాగాలేదు. క్రితం రాత్రి అతనో ఫ్యాన్సీడ్రెస్ పార్టీలో కాసేపు గడిపాడు. అశ్వికగార్డుల యూనిఫారంలో, హెల్మెట్ మీద పక్షిని అలంకరించుకుని భారీగా కదిలిందా శరీరం. శరీరం ఎలా ఉన్నా ఆత్మవిశ్వాసానికి కొదవ వుండదు. మెరుస్తున్న తెల్లటి చర్మంతో, మధుర స్వరంతో పలుకరించిన సుందరాంగి ఒకతె అక్కడ తిరిగి కనిపించింది. అంతకుముందొకసారి ఆమె ఇలాంటి పార్టీలోనే తళుక్కున మెరిసి మాయమైంది.

నిన్న కనిపించగానే ఆమెను వెంటతీసుకొని ఏకాంతం కోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన మందిరానికి వెళ్లాడు. అయితే అక్కడ తలుపు తీయటానికి ద్వారపాలకుడు సిద్ధంగా లేడు. చికాకుపడి, స్వయంగా తలుపు తోసుకొని మర్యాద కోసం ఆమెను ముందు లోపలికి వెళ్లమని తనూ గదిలోకి ప్రవేశించాడు. అప్పటికే గదిలో మరోజంట ఉంది. స్త్రీ ఉలిక్కిపడి మొహంమీది ముసుగు తొలగించిందిగాని, పురుషుడు భయంతో నిశ్చేష్టుడై కళ్లు తేలేశాడు. ఎదురుగా సాక్షాత్తూ చక్రవర్తి!

తనను చూసి అందరూ బిక్కచచ్చి గజగజా వణికిపోతారని తెలిసిన నికొలస్, దయగా ఆ యువకుడితో "నాకన్నా చిన్నవాడివి కాసేపు నన్నిక్కడ విశ్రమించనీ" అన్నాడు.

దిగ్గున లేచి కూర్చుని, ఎర్రబడిన మొహంతో, ఏపని ముందుచెయ్యాలో తెలియని తికమకలో, తన ప్రేయసిని తీసుకుని బిత్తరచూపులు చూస్తూ పిల్లిలా నిష్క్రమించాడా యువకుడు.

నికొలస్ వెంటవచ్చిన అమ్మాయికి ఇరవై ఏళ్ళుంటాయి స్వీడిష్ గవర్నెస్ కూతురామె. తాను చిన్నపిల్లగా వున్నప్పటి నుండీ, చక్రవర్తిగారి చిత్రపటాలు చూసి ఆయనమీద ఎలా మనసు పారేసుకుందో ముద్దుముద్దుగా చెప్పింది. తన ఆరాధ్య దైవం ఆయన. ఆయన కంట్లో పడటానికి

# రేడియేషన్ ఉపయోగాలెన్నెన్నో!

రేడియేషన్ కేవలం విద్యుత్‌శక్తికి, అణు బాంబు తయారీకే కాక ఎన్నో విధాలుగా ఉపయోగపడుతుంది. విమానాశ్రయాల్లో సెక్యూరిటీ చెక్‌కు రేడియేషన్ యంత్రాలను వినియోగిస్తున్నారు. మనిషి దుస్తుల్లో దాచిన ఆయుధాలు, డ్రగ్స్‌ను ఎక్స్‌రే సెక్యూరిటీ యంత్రాలు తేలిగ్గా కనుక్కోగలవు. స్పేస్‌క్రాఫ్ట్‌ల బయట పనిచేసే కెమెరాలాంటి యంత్రాలు సబ్ జీరో ఉష్ణోగ్రతలో నిరుపయోగం కాకుండా, రేడియోయాక్టివ్ కిరణాలు వాటికి వేడిని అందించి, పనిచేసేలా చేస్తాయి. కర్మాగారాల్లో కచ్చితంగా కొలవడానికి, తయారీలోని లోపాలు కనుగొనడానికి కూడా ఇది ఉపయోగపడుతోంది. రోగి శరీరంలోకి రక్తాన్ని ఎక్కించే ముందు అందులోని బ్యాక్టీరియాను నాశనం చేయడానికి కూడా రేడియేషన్ అవసరం. డైనోసార్‌లాంటి జీవుల అవశేషాలతో అవి జీవించిన కాలాన్ని కనుగొనే పద్ధతిలోనూ రేడియేషన్ పరికరం అవసరం. నేర పరిశోధనల్లో మనిషి ఎముకలను బట్టి అతని వయసుని కనుగొనేందుకు రేడియేషన్ సహకరిస్తుంది. గాలిలోని సల్ఫర్ డయాక్సైడ్‌లాంటి వ్యర్థాలను



తొలగించడానికి కూడా ఉపయోగిస్తున్నారు. కాలుష్య నియంత్రణలో రేడియేషన్ పరికరాలను పెద్ద ఎత్తున అభివృద్ధి చెందిన దేశాలు వినియోగిస్తున్నాయి. స్మోక్ డిటెక్టర్స్‌లో అమెరిసియమ్-241 అనే రేడియేషన్ పదార్థాన్ని వాడతారు. ఇది పొగను కనిపెట్టి అలారం మోగిస్తుంది. శరీరంలోకి రేడియేషన్‌ను పంపి లోపలి అవయవాలు ఎలా పనిచేస్తున్నాయో తెలుసుకోవడానికి కూడా వైద్యరంగంలో ఇది అత్యవసరం. అయితే అణుబాంబులు, అణు రియాక్టర్ల వల్ల విడుదలయ్యే రేడియేషన్ మాత్రం మనిషికి కేన్సర్‌ను, ఇతర ప్రాణాంతక వ్యాధులను కలిగిస్తుంది.

తనెన్నిసార్లు ఎన్నిరకాలుగా ప్రయత్నించిందో! ఇన్నాళ్ళకు తన కోరిక నెరవేరింది.

ఆ ఏకాంత మందిరంలో నికొలస్ గంటకుపైగా ఆమెతో గడిపాడు.

ఆ తర్వాత తన పడకగదికి వచ్చి పడుకున్నాడుగాని ఓ పట్టాన నిద్రపట్టలేదు. ఈపిల్ల ముఖంలోని ఆనందాన్నీ, కళ్ళమెరుపునూ చాలాకాలంగా తన ఉంపుడుకత్తెగా వున్న నెలిడోవానూ పోల్చిచూశాడు. వివాహితులకు పరస్త్రీలతో సంబంధముండకూడదన్న ఆలోచన ఆయన్నేమాత్రం బాధించలేదు. అది అనైతికమని ఎవరైనా చెబితే అతను ఆశ్చర్యపడతాడు కూడా. ఇలా చెయ్యటంలో తప్పు లేదనుకున్నప్పటికీ, తీపి తిన్నా నాలిక ఎందుకు చేదెక్కిందో తెలియలేదు. ఇలాంటి ధర్మ సందేహాలన్నీ మరచిపోవటానికి తనదగ్గర మంచి మత్తు మందుంది. తన గొప్పదనం, ఘనత, కీర్తిప్రతిష్ఠల గురించి తలచుకుంటే సరి.

ఆలస్యంగా పడుకున్నా, తెల్లవారి ఎనిమిదింటికే నిద్రలేచాడు చక్రవర్తి. టాయ్‌లెట్‌కు వెళ్లివచ్చి, బలిసిన శరీరాన్ని మంచుముక్కలతో మర్దన చేసుకున్నాడు. బాల్యంలోనే కంఠస్థమైన ప్రార్థనలు చేశాడు. అలవాటుగా, మొక్కుబడిగా చెయ్యటమేగాని అతడి జీవితంలో ప్రార్థనలకు విలువలేదు.

మరికాసేటికి దుస్తులు ధరించి వింటర్‌ప్యాలెస్ వసారాలోనికి నడిచాడు. అక్కడ ఇంచుమించు తనంత భారీకాయు డైన ఓ కుర్రాడు ఏదో పనిలో నిమగ్నమై కనిపించాడు. యూనిఫాంను బట్టి వాడు స్కూల్లో న్యాయశాస్త్రం అభ్యసిస్తున్నట్టుగా తెలిసింది. స్వంతంగా ఆలోచించమని బోధిస్తారక్కడ. క్రమశిక్షణ, ప్రభు విధేయ తకన్న స్వేచ్ఛ ఎక్కువ అభిలషణీయం కాదుగద. అలాంటి స్కూళ్లు తనకు నచ్చవు. కాని శరీరం సైజో, లేక తనను చూసి వాడు శాల్యూట్ చేసిన పద్ధతో అతడి కోపాన్ని కాస్త తగ్గించింది.

కొత్తగాలి...

**'స్వోత్కర్ష' స్వయంప్రతిభను దిగజారుస్తుంది**

*– రాజ్‌తిత్రేఎడ్వర్డ్,*
హైదరాబాద్

"నీ పేరేమిటి? "

"పొలసాటోస్, మహాప్రభూ!"

"గుడ్"

కుర్రాడు శాల్యూట్ చేస్తున్న పొజిషన్ లోనే నిలుచున్నాడు.

నికొలస్ వాణ్ణి చెయ్యికిందికి దించమ న్నాడు.

"సైన్యంలో చేరతావా? "

"లేదు మహాప్రభూ"

"మూర్ఖుడు!" అంటూ విసుక్కుని నికొ లస్ తన నడక కొనసాగించాడు. అయితే అసంకల్పితంగా అతనో పేరు పదేపదే ఉచ్చరించాడు.

'కోపెర్నైన్.... కోపెర్నైన్...' అది నిన్నటి పిల్లపేరు. మళ్లీ నోటి చేదు గుర్తు కొచ్చి 'నేను లేకపోతే రష్యా ఏమైపో తుంది.. రష్యామాత్రమే కాదు. మొత్తం యూరోప్ ఏమైపోతుంది..' అనుకుంటూ ఆత్మవిశ్వాసం పెంచుకున్నాడు. తనతో పోలిస్తే ప్రష్యన్‌రాజు ఎంత మూర్ఖుడు, ఎంత అసమర్థుడు, తనెంత చతురుడు....

గదికి తిరిగి వస్తున్నప్పుడు గుర్రబ్బండి దిగుతూ హెలెనా పావ్లోవ్నా కనిపించింది. అతడి దృష్టిలో ఇలాంటివాళ్లు నిరర్థకజీ వులు. ఆమె తనతో కవిత్వం, సైన్స్ గురించి చర్చించటానికి ప్రయత్నిస్తుంది. పరిపాలనా వ్యవహారాల గురించి సలహా లివ్వాలనుకుంటుంది. ఈ విషయాలు కూడా ఆమెకు తనకన్నా ఎక్కువ తెలుసా ఏమిటి? ఇలాంటి వాళ్లందర్నీ చెవులూ, నోరూ మూయించి ఓ మూల కూర్చోపె ట్టాలి. పట్టించుకోవద్దని ఎంత ప్రయత్నిం చినా వీళ్లు తనను చికాకు పరుస్తూనే వున్నారు. అంతలోనే మృతి చెందిన సోద రుడు మిహైల్ పావ్‌లోవిచ్ మదిలో మెదిలాడు. మళ్లీ 'ఆమె' జ్ఞాపకం. అలా పలు విధాల ఆలోచనలతో తన ఆఫీసు గదిలోకి ప్రవేశించాడు నికొలస్. ఇక ఒక్కొ క్కరూ వస్తారు. మీసాలు దువ్వుకున్నాడు. బట్టతల మీద విగ్గు సరి చేసుకున్నాడు. అద్దంలో మొహం చూసుకున్నాడు.

తలుపు తెరుచుకుంది. చెర్నిషోవ్ ప్రవే శించాడు. చక్రవర్తి ముఖ కవళికలు, కళ్లు చూడగానే తెలిసిపోయింది, అతడి మూడ్ సరిగా లేదని. క్రితం రాత్రి జరిగిన 'రాస లీల' గురించి విన్నాడు గనక, కారణం కూడా తెలిసింది. ముభావంగా పలకరించి కూర్చొమ్మని సైగ చేశాడు. మొదట కమిష నరేట్ ఉద్యోగులు కొందరు డబ్బు గల్లంతు చేశారని నివేదించాడు చెర్నిషోవ్. ఆ తర్వాత ప్రష్యన్ సరిహద్దు గురించిన రిపోర్టు. నూతన సంవత్సరం అవార్డులు

ప్రకటించాల్సిన వ్యక్తుల వివరాలు (గత సంవత్సరం విస్మరించిన వారిని ఈసారి పరిగణనలోకి తీసుకోవాలి), హాజీమురాద్ గురించి వొరొంట్సొవ్ ఇచ్చిన సమాచారం ఉండనే ఉంది. చివరగా ఒక వైద్య విద్యార్థి, ప్రొఫెసర్ మీద చేసిన హత్యాప్రయత్నం!

డబ్బు గల్లంతు కావటం గురించి చెప్పినప్పుడు, పెదాలు నొక్కుకుంటూ మౌనంగా విన్నాడు నికొలస్. కొందరేమిటి? అందరూ దొంగతనానికి పాల్పడే ఉంటారు. వీళ్లను శిక్షించక తప్పదు. సైన్యంలో చేరమంటే సరి. కాని ఒకసారి అవినీతికి పాల్పడినవాళ్లు అక్కడ మాత్రం ఏదో చేయకుండా ఉంటారా?

"దేశంలో అవినీతి పెరిగిపోయింది. నిజాయితీగా తనలాగా విధులు నిర్వహించేవాడొక్కడన్నా వున్నాడా అసలు? " అని ఆశ్చర్యం ప్రకటించాడు.

చక్రవర్తి గారి మనసు తెలిసిన చెర్నిషోవ్ "అవును, యువర్ ఇంపీరియల్ మెజెస్టీ!" అన్నాడు వినయంగా.

"ఆ సంగతి వదిలెయ్. నా నిర్ణయం తర్వాత చెబుతానులే" అన్నాడు నికొలస్, కాగితాలు ఎడం పక్కకు తోసి.

ఆ తర్వాత అవార్డుల విషయం, సైన్యాన్ని ప్రష్యన్ సరిహద్దుకు తరలించే విషయం.

అవార్డుల జాబితా తీసుకుని గబగబా కొన్ని పేర్లు కొట్టేసి, తిరిగి ఇస్తూ, రెండు డివిజన్లను ప్రష్యన్ సరిహద్దుకు తరలించమన్నాడు. 1848 సంఘటనల తర్వాత, రాజరికానికి బదులు రాజ్యాంగబద్ధ పాలనను అంగీకరించాడు ప్రష్యన్ రాజు (నికొలస్ బావమరిది). అందువల్ల వుత్తరాల్లో ఎంత ప్రేమ కురిపించినా, సరిహద్దుల్లో కొంత సైన్యాన్ని మోహరించటమే క్షేమకరం. ప్రష్యన్లు తిరుగుబాటు చేస్తే అతడ్ని రక్షించేందుకు ఈ సైన్యం పనికొస్తుంది (యురోప్‌లోని అన్ని దేశాల్లోనూ తిరుగుబాట్లు జరిగే అవకాశముందని నికొలస్ నమ్మకం!). 1848లో తిరుగుబాటు జరిగినప్పుడు తానే కదా తన బావమరిదిని రక్షించింది!

రష్యా సహాయం చెయ్యకపోతే పరిస్థితి ఎలా ఉండేదో!

"అవును, యువర్ ఇంపీరియల్ మెజెస్టీ!"

"ఇంకేమైనా పనుందా? "

వొరొంట్సొవ్ పంపిన నివేదిక, హాజీమురాద్ లొంగుబాటు గురించి చెప్పాడు చెర్నిషోవ్.

"గుడ్. శుభ పరిణామమే గదా!"

"ఇదంతా మీ ఆలోచనేగదా!"

తన వ్యూహాత్మక ఎత్తుగడల గురించి ఎవరు ప్రశంసించినా, మహా సంతోషపడిపోతాడు నికొలస్. నిజానికి ఏ ఎత్తుగడలూ తెలియవతనికి. తన సహాయకులు, తమ వ్యూహాలను అతనికి ఆపాదిస్తారు. అయితేనేం.. అదంతా తన తెలివితేటల ఫలితమే అంటే వినడానికి గర్వంగా ఉంటుంది.

"ఎలాగంటావు? "

"మీ ఆజ్ఞల్నే మేం తూచా తప్పకుండా పాటించాం మెజెస్టీ! శత్రువుల దారులన్నీ మూసేశాం. ఆహార సరఫరా మార్గాలను మూసేశాం. ఇక తనకు గత్యంతరం లేదని తెలిసే హాజీమురాద్ లొంగిపోయాడు"

"నిజమే"

నిజానికి చెర్నిషోవ్ చెప్పిన వ్యూహం ఎర్మోలొవ్, మెల్యామినొవ్‌లు రూపొందించింది. నికొలస్ తక్షణమే షామిల్ మీద దాడి చేసి అందర్నీ చంపెయ్యమన్నాడు. శత్రువు లొంగిపోయే పరిస్థితులు కల్పించాలన్నారు వాళ్లు (నికొలస్ ఆజ్ఞ ప్రకారం చేసిన దార్గో యుద్ధంలో రష్యన్ సైనికులు

చాలా మంది మృతి చెందారు). ఈ వేచి చూసే వ్యూహం కూడా తనదే అని నికొలస్ తనను తాను నమ్మించుకున్నాడు. శత్రువులకు రక్షణ ఇచ్చిన అరణ్యాలను నరికివేసి, ఆహార సరఫరా అడ్డుకుని, ఆకలికి మాడ్చి, రక్షణ లేకుండా చెయ్యటం కూడా తనదేనంటే నిజానికి దార్గో యుద్ధానికి తన అనుమతి ఇవ్వటం తప్పని అంగీకరించటమే. అయినా నిత్యం, ప్రతిక్షణం పొగడ్తల వర్షంలో తడుస్తున్న అతనికి, తన నిర్ణయాలలోని వైరుధ్యం కనిపించలేదు. హేతుబద్ధమైన ఆలోచనకు అతీతుడు అతడు. 'సింపుల్ కామన్ సెన్స్' కూడా లేని నిర్ణయాలవి. అయినా వందిమాగధులు అతణ్ణి 'జీనియస్' అని కీర్తిస్తారు. వైద్య విద్యార్థి గురించిన అతడి నిర్ణయం అతడి 'జీనియస్'కు తార్కాణం.

ఇదీ అసలు సంగతి! రెండుసార్లు ఫెయిలయిన వైద్య విద్యార్థి మూడోసారి పరీక్ష రాశాడు. ప్రొఫెసర్ ఈసారీ అతణ్ణి పాస్ చెయ్యకపోవటంతో ఉద్దేశపూర్వకంగా తనను సతాయిస్తున్నాడని క్షణికోద్రేకంలో, టేబుల్ మీది పెన్‌నైఫ్ తీసుకొని ప్రొఫెసర్‌ను పైపైన పొడిచాడు.

"విద్యార్థి పేరేమిటన్నావు? "

"జెవోస్కీ"

"పోలిష్ వాడా? "

"పోలిష్ సంతతి. రోమన్ కాథలిక్కు"

నికొలస్ నుదరు చిట్లించాడు. అతడిప్పటికే పోలిష్ ప్రజలను చాలా కష్టాల పాలు చేశాడు. తను కష్టపెట్టాడు గనుక వాళ్లంతా దుర్మార్గులని తనను తాను నమ్మించుకోవాలి. తను వాళ్లకెంత అపకారం చేస్తే వాళ్లంత పాపులైఉండాలి.

"ఒక క్షణం ఆగు" అని కళ్లు మూసుకున్నాడు నికొలస్. ఇలా చెయ్యటం చెర్నిషోవ్ చాలాసార్లు చూశాడు. కళ్లు మూసుకొని రెండు నిమిషాలు ఆలోచిస్తే అతనికి ఎంత జటిల సమస్యకైనా సమాధానం దొరుకుతుంది. అంతరాత్మ ప్రబోధమే అన్నీ నిర్ణయిస్తుంది. పోలిష్ సంతతి ప్రజలపట్ల తనకున్న ద్వేషాన్ని సమర్థించుకోవటానికి వాళ్లమీద ఏ నిందలు మోపాలి? ఈ ఒక్క సంఘటన చాలు, తనకు పోలండ్ దేశం మీద అసహ్యం కలగటానికి. రిపోర్టు మీద మార్జిన్‌లో పెద్ద పెద్ద అక్షరాలతో, తప్పుల తడక భాషలో యిలా రాశాడు-

"మరణ శిక్షకు అర్హుడు. కాని భగవాన్, మన దేశంలో మరణశిక్ష అమలులో లేదే! దాన్నిప్పుడు ప్రవేశపెట్టడం నాకిష్టం లేదు. వెయ్యిమంది సైనికుల దెబ్బలను తట్టుకుని పన్నెండుసార్లు పరిగెత్తాలతడు" ఆ తర్వాత ఆ తన 'తీర్పు' కింద సంతకం చేసి తృప్తిగా చూశాడు.

పన్నెండువేల లాఠీ దెబ్బలను తట్టుకోవటమంటే మృత్యువు సంగతెందుకు గాని, కనీవినీ ఎరుగని చిత్రహింస అది. ఎంత బలవంతుడైనా చావటానికి అయిదువేల దెబ్బలు చాలు. కాని ఇలాంటి దుష్టుల పట్ల జాలి చూపకూడదు. మరణశిక్ష లేదు గనక, ఇంతకన్నా సరైన శిక్ష మరేముంటుంది!

"చదువు"

చదివి, వినయంగా తలూపుతూ చక్రవర్తి గారి అపూర్వ ప్రతిభను, ఇంతఘోరం చేసినా కేవలం దెబ్బలతో వదిలేసిన చక్రవర్తిగారి జాలి గుండెనూ పొగిడాడు చెర్నిషోవ్.

"ఈ శిక్ష అమలు జరిగినప్పుడు, మిగతా విద్యార్థులందరూ మైదానంలోనే ఉండాలి. తిరుగుబాట్లు చేస్తారా! వాళ్ల విప్లవ భావాల్ని కూకటివేళ్లతో పెకలించేస్తా"

"మీ ఆజ్ఞను అమలు పరుస్తా మెజెస్టీ" అని, వొరొంట్సొవ్ రిపోర్టు గురించి ప్రస్తావించాడు చెర్నిషోవ్.

"ప్రిన్స్ వొరొంట్సొవ్‌కు జవాబు ఏం రాయమంటారు? "

"చెచెన్యాకు దారులన్నీ మూసేయాలని నేనిదివరకే ఆదేశించానుగా. వాళ్ల ఆహార సరఫరాను అడ్డుకోవాలి. తరచూ దాడులు చేసి వాళ్లను చికాకు పరచాలి"

"హాజీమురాద్ గురించి మీ ఆదేశమేమిటి? "

"అతడి సేవలు కాకసస్‌లో వాడుకుంటానన్నాడు వొరొంట్సొవ్? "

"కాని అది ప్రమాదాన్ని కొని తెచ్చుకోవటం కాదా? "

నికొలస్‌ను సూటిగా చూడలేక "ప్రిన్స్ వొరొంట్సొవ్ రిపోర్ట్‌లో స్పష్టత లేదు" అన్నాడు చెర్నిషోవ్ వినయంగా.

## కొత్తగాలి...

**ఉల్లి పిరం**
**నూనె గరం**
**పప్పు నిప్పు**
**బతుకుడెలా చెప్పు?!**

**- వెల్మల రాంరెడ్డి,**
పూడూరు, కరీంనగర్ జిల్లా

"నీ అభిప్రాయమేమిటి? "

"హాజీమురాద్‌ను సెంట్రల్ రష్యాకు తరలించటం మంచిదనుకుంటాను"

"నువ్వలా అనుకుంటున్నావా, సరే. నేనతడి ప్రతిపాదనను అంగీకరిస్తున్నానని రాయి"

"తమరి ఆజ్ఞ" అంటూ తలొంచుకుని లేచి నిలబడ్డాడు చెర్నిషోవ్.

అప్పటిదాకా నిశ్శబ్దంగా కూర్చున్న దోల్గొరుస్కీ కూడా లేచాడు.

చెర్నిషోవ్ తర్వాత పశ్చిమ ప్రాంతాల గవర్నర్ బిబికోవ్‌తో సంప్రదింపులు జరిపాడు నికొలస్. అక్కడి రైతులు సంప్రదాయ క్రైస్తవాన్ని తాము అంగీకరించం అని తిరుగుబాటు చేశారు. ఆ తిరుగుబాటుదారులందర్నీ కోర్ట్‌మార్షల్ చెయ్యమని బిబికోవ్‌ను ఆదేశించాడు తను. కోర్ట్‌మార్షల్ అంటే వేలాది లాఠీ దెబ్బలకన్నా తక్కువేమీ కాదు. ప్రభుత్వాజ్ఞను ధిక్కరించిన వేలాది మంది రైతులు దూరంగా వున్న ప్రభుత్వ భూములను సాగుచెయ్యాలని మరో ఆదేశం కూడా జారీ అయ్యింది. ఈ వార్త ప్రచురించిన స్థానిక పత్రిక సంపాదకుడిని నిర్బంధ సైనిక వుద్యోగం చెయ్యమని కూడా ఆదేశించారు అధికారులు.

"అనివార్యమనుకున్న నిర్ణయాలే తీసుకుంటున్నాను. వీటి గురించి చర్చించవలసిందేమీ లేదు" అన్నాడు నికొలస్.

ఈ నిర్ణయాల వెనకున్న హింసను, క్రౌర్యాన్ని అర్థం చేసుకున్నాడు బిబికోవ్. రైతులకు స్థానచలనం కలిగించటమంటే వాళ్లను తిరిగి అర్ధబానిసలుగా మార్చడమే. కాని చక్రవర్తి ఆజ్ఞకు తిరుగులేదు. తను అసమ్మతి ప్రదర్శించలేడు. అలా చెయ్యటమంటే నలభై ఏళ్లు కష్టపడి ఇటీవలే సంపాదించుకొన్న ఈ వుద్యోగాన్ని వదులుకోవటమే. అందువల్ల వినయంగా తలవంచి తన అంగీకారం తెలిపాడు బిబికోవ్. చక్రవర్తి ఆజ్ఞ ఎంత మూర్ఖమైనదైనా, ఎంత అమానుషమైనదైనా అధికారులు దాన్ని శిరసావహించక తప్పదు.

బిబికోవ్ నిష్క్రమించిన తర్వాత ఆనాటి కార్యక్రమం ముగించినందుకు తృప్తిగా నిట్టూర్చి ఒళ్లు విరుచుకున్నాడు నికొలస్. గడియారం వైపు చూశాడు. బయట తిరిగి రావటానికి టైమయింది. యూనిఫాం, లాంఛనాలు ధరించి రిసెప్షన్ హాల్లోకి వచ్చాడు. వందమందికి పైగా స్త్రీలు, పురుషులు తమ తమ స్థానాల్లో నిల్చుని తన

దర్శనం కోసం నిరీక్షిస్తున్నారక్కడ. ఇంత మంది తనకోసం చూస్తున్నారని తెలిసి నిర్జీవంగా వున్న కళ్లలో మెరుపు వచ్చింది. గాలి పీల్చుకోవటంతో ఛాతీ పెరిగింది. పొట్టకిందకి జారిపోకుండా పట్టీలు కట్టుకుని గంభీరంగా అడుగువేశాడు. తన గురించి తనకు గర్వంగా ఉంది. కొంత మంది ముందు ఒక నిమిషం ఆగి రష్యన్‌లోనూ, ఫ్రెంచిలోనూ పలుకరించాడు.

అందరినుండీ నూతన సంవత్సర శుభాకాంక్షలు స్వీకరించి చర్చికి బయల్దేరాడు. అక్కడ దేవుడు, తన సేవకులైన ప్రీస్టుల ద్వారా అందరిలాగే నికొలస్‌ను పొగుడుతాడు. విసుగొస్తుంది గాని, వినటానికి ప్రశంసలు బాగానే ఉంటాయి. అవును మరి, లోకకళ్యాణం తన మీద ఆధారపడి ఉంది. ఈ ప్రపంచం సజావుగా నడవటానికి తన అవసరం ఎంతైనా వుంది.

చర్చిలో ప్రార్థనల అనంతరం, డీకన్, 'దీర్ఘాయుష్మాన్‌భవ' గానం చేసినప్పుడు ఆయన దృష్టి, కిటికీ దగ్గర నిల్చున్న నెలిడోవా మీదికి మళ్లింది. వెంటనే ఆమెను, నిన్నటి పిల్లతో పోల్చుకున్నాడు.

ఆ తర్వాత భార్య (ఎంప్రెస్)తో, పిల్లలతో కొంతసేపు గడిపాడు. తన దర్బారు వ్యవహారాలు చూసే మంత్రి వొల్కొన్స్కీని కలిసి, నిన్నటి సుందరి తల్లికి సాలీనా భరణం మంజూరు చెయ్యమని ఆదేశించాడు.

పాంపెయన్ హాల్లో ఆనాటి డిన్నర్ ఏర్పాట్లు జరిగాయి. కుటుంబ సభ్యులతో పాటు కొందరు రాయబారులు, యితర వున్నతాధికారులు కూడా టేబుల్ అలంకరించారు.

చక్రవర్తి ఆగమనం కోసం నిరీక్షిస్తున్న బేరన్ లీవెన్, ప్రష్యన్ రాయబారి మధ్య పోలెండ్ గురించి ఒక ఆసక్తికరమైన చర్చ జరిగింది. కాని చక్రవర్తి వచ్చి హాజీమురాద్ లొంగుబాటు గురించి చెప్పాడు. అరణ్యాలు నరికి, చెచెన్లకు నిలువ నీడలేకుండా చేస్తున్నాడు. అందువల్ల యిక త్వరలో యుద్ధం ముగుస్తుంది. మిగతా వాళ్లూ లొంగిపోతారు. దీర్ఘకాలిక యుద్ధానికి సిద్ధమై, ఆ ప్రాంతంలో చిన్న చిన్న దుర్గాలు కూడా నిర్మిస్తున్నాడు.

నికొలస్ వ్యూహ రచనను రాయబారి ప్రశంసించాడు. అలా చెయ్యటం వల్ల చక్రవర్తి సంతోషిస్తాడని అతడికి తెలుసు.

డిన్నర్ తర్వాత నృత్య నాటిక చూడటానికెళ్లాడు నికొలస్. వందలాదిమంది సుందరాంగనలు అక్కడ చాలీచాలని దుస్తుల్లో కనువిందు చేశారు. అందులో ఒకావిడ అతణ్ణి బాగా ఆకర్షించింది. ఆమెకు వజ్రపుటుంగరం కానుకగా యివ్వమని బాలె మేనేజర్‌కు సూచించాడు నికొలస్.

మరునాడు చెర్నిషోవ్ మళ్లీ వచ్చాడు. వొరొంట్సొవ్ గురించిన ఆదేశాలలో మార్పులేదు. హాజీమురాద్ లొంగిపోయాడు గనక చెచెన్లమీద అణచివేత చర్యలు మరింత తీవ్రం చెయ్యాలి.

ఆ ఆజ్ఞలు వొరొంట్సొవ్‌కు చేరవేయటానికి మరో కొరియర్ ఆగమేఘాల మీద టిఫ్లిస్‌కు బయల్దేరాడు.

## 5



**చ**క్రవర్తి ఆదేశానుసారం 1852 జనవరిలో, ఆజ్ఞలు జారీ అయిన నెలలోపే

చెచెన్యా మీద దాడి జరిగింది.

నాలుగు పదాతిదళాల బెటాలియన్లు, రెండు కోసక్కుల కంపెనీలు, మరో ఎనిమిది సాయుధ దళాలు ఈ దాడిలో పాల్గొన్నాయి. రోడ్డుమార్గం ద్వారా నడిచి వెళ్లిన దళాలకు రెండువైపులా గొర్రెతోలు కోట్లు, ఎత్తైనబూట్లు, పొడుగాటి క్యాప్‌లు, రైఫిళ్లు ధరించిన సైనికులు అదనపు రక్షణగా వున్నారు.

శత్రు ప్రాంతంలో ప్రవేశించారు గనక వీలైనంత వరకు నిశ్శబ్దంగా వుండటానికి ప్రయత్నించారు. అప్పుడప్పుడూ తుపాకీ దేనికో తాకి కాస్త చప్పుడైంది. ఓ గుర్రం

## కొత్తగాలి...

**మనిషిగా**
**పుట్టడం తేలికే**
**మనిషిగా బ్రతకడమే**
**కష్టం**

– బిక్కనూరి రాజేశ్వర్,
పొన్కల్

సకిలించింది. సైనికులు వరుసలో కదలనప్పుడు కమాండర్ కసురుకున్నాడు. ఒకసారి పొదల్లోంచి రెండు జింకలు ఒకదాన్నొకటి వెంటాడుతూ వచ్చినప్పుడు సైనికులకు నవ్వాగలేదు. కొందరు వాటిని బయోనెట్‌లతో పొడవటానికి ప్రయత్నించారు కాని అవి ఎవరికీ చిక్కలేదు. అశ్వికులూ, వెంటవున్న జాగిలాలూ వెంబడించినా అవి చెంగుచెంగున గెంతి పర్వతాల్లో అదృశ్యమయ్యాయి.

అది చలికాలం. ఉదయమే బయల్దేరిన సైన్యం మధ్యాహ్నామయ్యే సరికి మూడు మైళ్లు నడిచింది. ఎండవేడి పెరిగింది. తుపాకుల స్టీలు కూడా వేడెక్కింది. తుపాకుల మీద సూర్యుడు తన తీవ్రతను చూపాడు.

సెలయేరు దాటింది సైన్యం. దున్నిన పొలాలు కనిపించాయి ఎదురుగా. మరోవైపు లోయలు, పచ్చిక బయళ్లు అల్లంత దూరంలో దట్టమైన, రహస్యాలను దాచుకున్న అరణ్యం. వాటికావల అద్భుత సౌందర్యంతో వెలిగిపోతున్న మంచుకప్పిన పర్వత శిఖరాలు.

అయిదో కంపెనీ ముందువరుసలో నడుస్తున్నాడు బట్లర్. ఇటీవలే గార్డ్ దళం నుండి సైన్యంలో చేరాడు. నల్లటికోటూ, క్యాప్, ఖడ్గం ధరించాడు. శ్వాస పీల్చుకోవటమే, జీవించి వుండటమే ఒక వరం అనే ఆనందం అతణ్ణి నడిపిస్తున్నది. పైనున్న ఏ ఒక్కరి కోరికో తీర్చటానికి యింతమంది కదం తొక్కుతున్నారు. యాక్షన్‌లో పాల్గొనటం యిది తనకు రెండోసారి. ఏ క్షణాన్నైనా ఎదురుకాల్పులు ప్రారంభం కావచ్చు. బుల్లెట్లు తనమీద వర్షించినప్పుడు ఆత్మరక్షణ కోసం తను తలవంచడు సరికదా, మరింత నిటారుగా నిలబడి తొణుకూ బెణుకూ లేకుండా ముందుకు కదులుతూ, యిది అతిసామాన్యమైన విషయమన్నట్టుగా తన కామ్రేడ్లతో జోకు లేస్తూ, కబుర్లు చెబుతాడు.

పక్కారోడ్డు నుండి గతుకుల దారిలోకి మళ్లింది సైన్యం. మొక్కజొన్న చేను ఏపుగా పెరిగింది. అడవికి సమీపంలో వున్నప్పుడు ఈల వేసినట్టుగా చప్పుడు చేస్తూ ఒక బులెట్ వచ్చి పొలంలో పడింది.

"ప్రారంభమైంది" అన్నాడు బట్లర్ పక్కనున్న సైనికుడివైపు చూస్తూ చిరునవ్వుతో.

అవును. ప్రతిఘటన ప్రారంభమైంది. అశ్వారూఢులైన చెచెన్లు జెండాలు గాలిలో ఎగరగా అడవిలోనుండి పరిగెత్తుకుని వచ్చారు. సైన్యం మధ్యభాగంలో ఆకుపచ్చ

జెండా ఒకటి కనిపించింది. చత్వారం వున్న బట్లర్‌తో, షామిల్ స్వయంగా ఈ యుద్ధంలో పాల్గొనే అవకాశముందని చెప్పాడు మరో సైనికుడు. పర్వతాలు దిగి వచ్చిన చెచెన్లు కుడివైపున మోహరించారు. బట్లర్ వున్న కంపెనీ, వాళ్లను ఎదిరించాలని చెప్పాడో జనరల్. మెరుపువేగంతో కదిలాడు బట్లర్. కాని అంతలోనే వెనుక నుండి శతఘ్ని కాల్పులు రెండు వినిపించాయి. అర్థంకాక అటూయిటూ చూశాడు. చుట్టూ తెల్లటి పొగ కమ్ముకుంది. ఫిరంగులు వస్తాయని వూహించని చెచెన్లు తిరిగి అడవుల్లో అదృశ్యమయ్యారు. అయినా బట్లర్‌కంపెనీ వాళ్లమీద కాల్పులు కొనసాగించింది. పొగమంచు దట్టంగా వ్యాపించింది. దూరంగా పారిపోతున్న చెచెన్లు అస్పష్టంగా కనిపించారు. తమను తరుముతున్న కోసక్కులమీద అప్పుడప్పుడూ కాల్పులు జరిపారు. కంపెనీ వాళ్లను వెంబడించింది. పర్వతం రెండో మలుపు తిరిగాక లోయలో కనిపించింది ఒక గ్రామం.

కోసక్కులతో కలిసి గ్రామంలో ప్రవేశించాడు బట్లర్. కాని ఊరు నిర్మానుష్యంగా ఉంది. ఇళ్లను, ధాన్యాన్ని, గడ్డిని తగలబెట్టమని సైనికులకు ఆజ్ఞలు జారీ అయ్యాయి. పాడుబడిన వూళ్ళో ఘాటుగా పొగ నిండింది. గ్రామస్తులు వెంట తీసుకెళ్లలేని కోళ్లను షూట్‌చేశారు సైనికులు.

పొగకు కాస్త ఎడంగా కూర్చుని భోజనం చేశారు ఆఫీసర్లు. కొన్ని తేనెపట్టులను తీసుకొచ్చాడో సార్జంట్ మేజర్. ఎక్కడా చెచెన్ల జాడలేదు. మధ్యాహ్నానికి తిరుగు ప్రయాణమయ్యారు సైనికులు. ఈ సారి వెనుక వరుసలో నిల్చున్నాడు బట్లర్. అనూహ్యంగా చెచెన్లు ప్రత్యక్షమై కంపెనీ మీద కాల్పులు జరిపారు. గ్రామం వదిలి, సైన్యం మైదానంలోకి ప్రవేశించగానే కాల్పులు ఆగిపోయాయి.

## ఆయనే తప్పు!

ఓ పెద్దాయనెవరో రాసిన మహాగ్రంథంలో అనేక తప్పులు, అసంబద్ధ విషయాలు దొర్లాయని ఒకసారి అబ్బూరి రామకృష్ణారావు



వద్ద ఎవరో ప్రస్తావించారు.

దానికాయన 'అసలు ఈ సృష్టిలో ఆ పెద్దాయనే ఒక పెద్ద తప్పు. ఇక ఆయన రచన గురించి మనమింకేం మాట్లాడగలం?' అన్నారు.

బట్లర్ కంపెనీలో ఎవరూ గాయపడలేదు. మళ్ళీ కాలవదాటి మొక్కజొన్న చేలగుండా పాటలుపాడుతూ ప్రయాణించింది పటాలం.

యుద్ధమంటే ప్రతివ్యక్తీ ప్రమాదానికెదురొడ్డి నిలువడమే అనుకున్నాడు బట్లర్. ఆ సాహసకార్యాన్ని వెన్నంటే ఉంటుంది మృత్యువు. గెలిచినా ఓడినా పెద్దలకే కీర్తి, గౌరవం దక్కుతాయి. రష్యన్లు తమను 'హీరో'లంటారు. కాని బట్లర్ యుద్ధానికి మరోవైపు ఉంటుందని, సైనికుల హతాన్మరణం, గాయాల వంటివాటి గురించి ఆ క్షణాన ఆలోచించనైనా లేదు. కీర్తి గురించి కలలు కంటున్నాడు. మృత్యువు, గాయాల గురించి ఎవరూ ఆలోచించరు. అందువలన అతడు ఆరోజు ముగ్గురు మరణించిన

విషయం, మరో పన్నెండు మంది గాయ పడటం పరిగణనలోనికి తీసుకోలేదు. ఒక మృతదేహం తన పక్కన పడుంది. అయినా అటువైపైనా చూడలేదు. చెచెన్లు కూడా గొప్ప అశ్వికులు, వీరసైనికులనే అనుకున్నాడు.

"వచ్చిన పని పూర్తిచేశాం. తిరిగి వెళ్ళిపో తున్నాం. ఇళ్లు చేరగానే అక్కడ వేడివేడి భోజనం మనకోసం రెడీగా ఉంటుంది. కమాన్, పాటందుకోండి" అంటూ అందర్నీ ఉత్సాహపరిచాడు మేజర్.

ప్రశాంతంగా ఉంది. గాలిలో కదలిక లేదు అల్లంత దూరాన మంచు కరిగినా ఏదో తాజాదనం అంతటా వ్యాపించింది. పాటలతో కలిసిపోయింది కవాతు శబ్దం. తుపాకులొకదానికొకటి తగిలి ఖంగుమం టున్నాయి.

తన పైఅధికారి మేజర్ పెట్రోవ్ పక్కనే స్వారీ చేస్తున్నాడు బట్లర్. గార్డ్ నుండి సైన్యంలో చేరటానికి తనకు సహాయం చే సింది ఈయనే. గార్డుల దళంలోవున్న ప్పుడు పేకాటలో ఉన్నదంతా పోగొట్టుకు న్నాడు. ఇక పోగొట్టుకోవటానికి ఏమీ మిగలకపోయినా, ఇంకా పోగొట్టుకునే అవ కాశముందని భయపడి సైన్యంలో చేరాల నుకున్నాడు. ఇప్పుడదంతా గతం. జీవితం నాశనమైందనీ, అప్పులింకా మిగిలేవున్నా యని అతనికి గుర్తులేదు. కొత్త వాతావ రణం, కొత్త మిత్రుల పరిచయం ఉత్సాహ మిచ్చాయి. పీటర్స్‌బర్గ్ గదుల్లోని పొగాకు కంపు ఇక్కడలేదు.

మేజర్, మాషా కలిసి ఉంటున్నారు. ఆమె ఒకవైద్యుని సహాయకుని కూతురు. అసలు పేరు మార్యా డిమిత్రియెవ్నా. అందంగా ఉంటుంది. పిల్లలు లేరు. సుమారు ముప్ఫై ఏళ్లు. గతం ఏమైనా ప్రస్తుతం మేజర్‌కు ఆమె 'మంచిభార్య' గానే ఉంటోంది. అతనికి తాగే అలవా టుంది గనక, మందెక్కువైనప్పుడు ఆమె అతనికి 'నర్సు'లా కూడా సేవ చేస్తుంది.

మేజర్ ఇంటికి చేరుకోగానే అతనికీ, బట్లర్‌కూ, వెంటవచ్చిన మరో ఇద్దరు ఆఫీ సర్లకూ మంచి భోజనం పెట్టింది. తిని తాగి మేజర్ గాఢ నిద్రపోయాడు.

మోతాదుకన్నా ఎక్కువ వైను తాగిన బట్లర్ డ్రెస్సు కూడా మార్చుకోకుండానే గుర్రు పెట్టాడు.

6



సైనికులు ధ్వంసం చేసింది రష్యన్లకు లొంగిపోవటానికి ముందు హాజీమురాద్ బస చేసిన గ్రామాన్నే. రష్యన్లు వస్తున్నా రని తెలిసి సాడో, అతడి కుటుంబ సభ్యు లు గ్రామాన్ని విడిచి వెళ్లి పర్వతాల్లో తల దాచుకున్నారు. తిరిగి వచ్చేసరికి ఇళ్లు నేల మట్టమైనాయి. పాకలు మంటల్లో కాలిపో యాయి. అతడి కొడుకును వాళ్లు బాయ్‌నె ట్‌తో పొడిచి చంపారు. గుర్రంమీద వేసు కుని శవాన్ని మసీదుకు తీసుకువచ్చారు. హాజీమురాద్‌కు భోజనం పెట్టి, అతిథి మర్యాదలు చేసిన స్త్రీ మధ్య వయస్కు రాలు. జుత్తు పీక్కుని, మొహం రక్కుకుని తన బంగారు కొండ మీద పడి కన్నీరుము న్నీరుగా విలపించింది. ఇతర బంధువు లతో కలిసి పార తీసుకుని సమాధి తవ్వ టానికి వెళ్లాడు సాడో. ముసలితాత సగం కూలిన గోడను ఆనుకుని కూర్చున్నాడు.

పక్క ఊరిలో తేనెతుట్టెలపని చేస్తున్న వాడు విషయం తెలిసి అప్పుడే తిరిగి వచ్చాడు. రెండు గడ్డివాములను తగలపెట్టారు. ఏప్రికాట్, చెర్రీ చెట్లను నరికేశారు. మరీ దారుణం- తేనెటీగలనూ, తేనెతుట్టెలనూ కాల్చేశారు. తల్లుల, పిల్లల ఏడ్పులు ఆకలితో అరుస్తున్న పశువుల ఆర్తనాదాలతో కలసిపోయాయి. కాస్త ఎదిగిన పిల్లలు ఏడవటానికి బదులు భయం భయంగా పెద్దవాళ్ల వెనక నడిచారు. తాగేనీళ్లలో ఏదో కలిపారు. ఇప్పుడా నీళ్లు పనికి రావు. మసీదును అపవిత్రం చేశారు. ముల్లా, అతని సహాయకులు యిప్పుడు దాన్ని శుభ్రం చేస్తున్నారు. రష్యన్లను ద్వేషించినట్టుగా ఎవరూ ఒక్క మాట కూడా మాట్లాడలేదు. పిల్లల నుండి పెద్దవాళ్ల దాకా చెచెన్లందరికీ ఉన్నది ద్వేషంకన్నా ఎక్కువ. రష్యన్ కుక్కలను వాళ్లసలు మనుషులుగా గుర్తించదలచుకోలేదు. ఎలుకలనూ, విషప్పురుగులనూ, తోడేళ్లనూ మనం చంపేది ఆత్మరక్షణకే.. అసహ్యంతో, ద్వేషంతో కాదు. వాళ్లకు రష్యన్లూ అంతే.

ఏడాదిపాటు తాము రెక్కలు ముక్కలు చేసుకుని పండించిన పంటలు నిష్కారణంగా తగలబెట్టారే.. ఇదేమి ఆనందం? ఇలా కూడా ఉంటారా మనుషులు! ఇంత జరిగాక జుగుప్సను లోలోపలే దాచుకుని రష్యన్లకు లొంగిపోవాలా? వృద్ధులు, గ్రామ పెద్దలు ప్రార్థనలు ముగించి, సహాయం కోరుతూ షామిల్ వద్దకు దూతలను పంపాలని నిర్ణయించారు. ఆ తర్వాత కాలి బూడిదైపోగా మిగిలిందేమన్నా ఉంటే తీసి భద్రపరిచారు.

★ ★ ★

దాడి జరిగిన మరుసటి ఉదయం యింటి వెనకద్వారం నుండి బయటికి వచ్చి, కాసేపు తిరిగి రావటానికి బయల్దేరాడు బట్లర్. లేత ఎండ హాయిగా ఉంది.

## జంతు టెర్రరిస్టులు!

జంతువులను మచ్చిక చేసుకోవడం అనాదిగా జరుగుతోంది. సర్కస్ కోసం శిక్షణ కూడా ఇస్తున్నాం. కానీ చిత్రమేమంటే మొదటి, రెండో ప్రపంచ యుద్ధాల్లో జంతువులను శత్రువుల మీదకి ప్రయోగించారు.

అమెరికన్ సైన్యం గబ్బిలాలకి బాంబులని అమర్చి వదిలేది. అవి శత్రువుల స్థావరాల్లో,



భవంతుల్లోని చీకటిరంధ్రాల్లో దాక్కునేవి. రాత్రిళ్లు అవి విహారానికి బయటికి రాగానే ఆ బాంబులు పేలి, ఆ భవంతులు అంటుకునేవి. గబ్బిలం తన బరువుకన్నా అధిక బరువును మోసుకుని వెళ్లగలదని తెలిసిన డెంటల్ సర్జన్ లిటిల్ ఎస్ ఏడమ్స్ సూచిస్తే ఆనాటి అమెరికా అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ దీనికి ఆమోదాన్ని ఇచ్చాడు. 1942 నుంచి వేల గబ్బిలాలను అమెరికన్ సైన్యం జర్మన్ల స్థావరాల మీద ఇలా ప్రయోగించింది. అంతేకాదు, ఎలుకలని చంపి లోపల పేలుడు పదార్థం ఉంచి, జర్మన్ స్థావరాల్లో రహస్యంగా పడేయించేవారు. జర్మన్ సైనికులు ఊడ్చిన చెత్తను మండే కొలిమిలో వేసేవారు. తక్షణం ఎలుకలోని పేలుడు పదార్థాలు పేలి, మంటలు వ్యాపించేవి. రష్యన్ సైనికులు 1924 నుంచే కుక్కలకు యుద్ధ ట్యాంకుల కింద ఆహారం లభిస్తుందనే శిక్షణను ఇవ్వసాగారు. దాని ఒంటినిండా పేలుడు పదార్థాలను కట్టి యుద్ధరంగంలోకి వదిలితే, అవి శత్రుసైనికుల యుద్ధట్యాంకుల కిందకు ఆహారం కోసం వెళ్లగానే ఆ మందుగుండు సామాగ్రి పేలి టేంకులకు తీవ్రనష్టం వాటిల్లేది. 'మాస్కో ఒబ్లాస్ట్' పేర నడిచే స్కూల్లో కుక్కలకు శిక్షణను ఇచ్చేవారు. ఈ ఆధునిక యుగంలో యుద్ధంలో జంతువుల అవసరం లేకుండా పోయింది.

# చతుర ప్రవేశిక

## జూన్ చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. హాజీమురాద్ పుట్టిన గ్రామం?
జ
2. హాజీమురాద్ కుటుంబాన్ని ఎవరు బంధించారు?
జ
3. హాజీమురాద్ ఏ ప్రిన్స్‌కి లొంగిపోయాడు?
జ
4. పెట్రోవ్ భార్య పేరు?
జ
5. హాజీమురాద్ కొడుకు పేరు?
జ
6. షామిల్ పెద్ద భార్య?
జ
7. హాజీమురాద్ తన గతాన్ని చెప్పిందెవరికి?
జ.
8. పిల్లిని వెతికిచ్చినవారికి ప్రకటించిన బహుమతి?
జ.
9. మిను మామయ్యకు తెలిసిన విద్య?
జ.
10. తెలుగులో భరద్వాజ ఎన్నో జ్ఞానపీఠ గ్రహీత?
జ.

పంపినవారి పేరు: ------------------

------------------వయసు ( )

చిరునామా: --------------------

--------------------------

--------------------------

పిన్‌కోడ్: ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082

చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

స్వచ్ఛమైన గాలిలో నడక ఆహ్లాదకరంగా ఉంది. బ్రేక్‌ఫాస్ట్‌కు ముందర ఇలా కాసేపు నడిస్తే బాగుంటుంది అనుకున్నాడు. పెట్రోవ్ ఇంకా లేవలేదు. కొండలమీద ఎండ మెరుస్తోంది. కుడివైపు తెల్లటి గోడలమీద కూడా కాంతిపడి చూడాలంటే కళ్లు మూసుకుపోతున్నాయి. ఎడంవైపు ఆకుపచ్చ శాలువా కప్పుకున్న పర్వతాలు రారమ్మని ఆహ్వానిస్తున్నాయి. శిఖరాలమీద పేరుకుపోయిన మంచు, మేఘాలలా కనిపిస్తున్నది. ఈ అద్భుతక్షణాల్ని ఆనందించటం కన్న జీవితానికింకా ఏం కావాలి?

నిన్నటి తన ప్రవర్తన గురించి తనను తాను అభినందించుకున్నాడు. యుద్ధంలో తాను ఎంత చాకచక్యంగా వ్యవహరించాడు! అందరూ భయపడి వణికినప్పుడు తను గుండె నిబ్బరం ప్రదర్శించాడు. ఇంటికి వచ్చిన తమను మాషా (లేక మార్యా డిమిట్రియెవ్నా) ఎంత ఆప్యాయంగా ఆదరించింది!

భుజాల దాకా పెరిగిన దట్టమైన జుత్తు, ఎత్తైన వక్షం, ఆహ్వానించే కళ్లు బట్లర్‌ను బాగా ఆకర్షించాయి. యువకుడు, ఇంకా పెళ్లికాలేదు. కోరికలు రేగిన మాటకూడా నిజమే. ఆమె తనవైపు ఓ అర్థంలో చూసింది. కాని ఇంటికి ఆహ్వానించి, మర్యాద చేసిన మిత్రునికి ద్రోహం చెయ్యటమా! నిగ్రహించుకోవటంలోనే తన మంచితనముంది.

ఇలా తియ్యటి ఆలోచనల్లో విహరిస్తున్నప్పుడు దూరంగా గుర్రాల డెక్కల చప్పుడు వినిపించింది. చాలా మంది అశ్వికులు వస్తున్నారు. వేగం తగ్గింది. నెమ్మదిగా నడిచివచ్చాయి గుర్రాలు. ఇరవైమంది కోసక్కుల పహారాలో ఇద్దరు వ్యక్తులు కనిపించారు. ఒకతను సర్కేషియన్ కోట్, పాగా ధరించాడు. మరొకతను రష్యన్ ఆఫీసర్. గోధుమరంగు గుర్రం మీద ఠీవిగా కనిపించాడు పాగా పెట్టుకున్నతను.

అందమైన కరాబాక్ అశ్వం మీద కూర్చు న్నాడు రష్యన్ ఆఫీసర్.

బట్లర్ అశ్వ ప్రేమికుడు. గోధుమరంగు గుర్రం ఎంత విలువైనదో యిట్టే పసిగ ట్టాడు.

"ఇది కమాండింగ్ ఆఫీసర్ ఇల్లా? " అంటూ ప్రశ్నించాడు రష్యన్ ఆఫీసర్.

"ఔను, మీరెవరు? " అంటూ వాళ్లను సమీపించాడు బట్లర్.

"ఇతను హాజీమురాద్. కమాండర్ ఇంటికి అతిథిగా వచ్చాడు"

"స్వాగతం.. సోదరా" అంటూ టార్టా ర్‌లో ఆహ్వానించాడు బట్లర్.

"సౌబుల్ (శుభం కలుగుగాక)" అంటూ బట్లర్‌తో కరచాలనం చేశాడు హా జీమురాద్.

"కమాండర్ ఎవరు? "

"నేను కాదు, కమాండర్ ఇంట్లో ఉన్నాడు. పిలుస్తాను" అంటూ వెనక్కెళ్లి ఇంటి తలుపు తట్టాడు బట్లర్. కాని అతి థులు ప్రవేశించటానికి ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన ద్వారం తెరుచుకోలేదు. లోపల్నించి తాళం వేసినట్టుంది. చుట్టూ తిరిగి ఇంటి వెనక్కెళ్ళి పనిమనుషులెవరూ కనిపించకపోవటంతో వంటింట్లోకెళ్లాడు. తలకు రుమాలు చుట్టుకుని, చొక్కా చేతు లుపైకి మడుచుకుని పేస్ట్రి పిండి పిసుకు తున్న మార్యా డిమిత్రియెవ్నా తనను చూసి ఆ పరిస్థితిలో సిగ్గుపడిందేమో, మొహం ఎరుపెక్కింది.

"పనిమనుషులు ఎక్కడికెళ్లారు? "

"తాగటానికి వెళ్లారు. ఏం కావాలి? "

"ముందరి తలుపు తియ్యాలి. చెచెన్ల గుంపు వచ్చింది హాజీమురాద్ వెంట"

"బాగానే కోతలు కోస్తావే? "

"జోక్ చెయ్యటం లేదు. అందరూ ఇంటి ముందర నిల్చున్నారు"

"నిజంగా? "

"అబద్ధం చెప్పాల్సిన అవసరం లేదు. స్వయంగా వెళ్ళి చూడొకసారి"

"అయ్యబాబోయ్! నావేషం ఇలా ఉంది? " అంటూ చొక్కాచేతులు కిందికి దించుకుంది. మార్యా డిమిత్రియెవ్నా.

"వెళ్లి, పెట్రోవ్‌ను లేపుతాను మరి"

"నేను లేపుతానులే. నువ్వు తలుపు తియ్యి" అంటూ అప్పుడే వచ్చిన పనిమని షివైపు చూశాడు బట్లర్.

హాజీమురాద్ గ్రోజ్నిలో ఉన్న విషయం పెట్రోవ్‌కు తెలుసు. ఇప్పుడు తనింటికొ చ్చాడు. పెద్దగా ఆశ్చర్యం అనిపించలేదు. లేచికూర్చుని సిగరెట్ వెలిగించి డ్రెస్ చేసు కోసుకోవటం ప్రారంభించాడు. ఒకసారి పెద్దగా గొంతు సవరించుకుని, 'ఈ రాక్ష సుణ్ణి' తన దగ్గరకు పంపినందుకు పైఅధి కార్లను తిట్టుకున్నాడు.

ఆ తర్వాత పనిమనిషిని పిలిచి, 'మందు' తెచ్చివ్వమన్నాడు. మందంటే వోడ్కా. 'డ్రింక్స్ మిక్స్ చెయ్యటం వల్ల చాలా చిక్కులు వస్తాయి' అనుకొంటూ ఓ గుక్కెడు వోడ్కా గుటకవేసి, కాస్త రైబ్రెడ్ తిన్నాడు. క్రితం రాత్రి చికర్(వైన్) తాగాడు. తలనొప్పి వచ్చింది. ఇప్పుడు బాగానే ఉంది. డ్రెస్ మరోసారి సరిచూసు కుని ముందరి గదిలోకెళ్లాడు.

అప్పటికే అక్కడ బట్లర్, హాజీమురాద్ రష్యన్ ఆఫీసర్లతో నిరీక్షిస్తున్నారు. పైఅధి కారుల ఆజ్ఞాపత్రాన్ని పెట్రోవ్‌కు అందచే శాడు రష్యన్ ఆఫీసర్. హాజీమురాద్‌తో మర్యాదపూర్వకంగా వ్యవహరించాలి. అతడు ఇతర చెచెన్‌లతో సంప్రదింపులు జరపటానికి అవకాశమివ్వాలి. కాని ఎట్టి పరిస్థితుల్లోనూ అతణ్ణి కోట దాటి వెళ్లని వ్వకూడదు- కోసక్కుల పహరా లేకుండా.

ఆజ్ఞలు మరొకసారి చదివి, హాజీమురా ద్‌ను పరికించి చూస్తూ "వెల్‌కమ్ సర్ మిమ్మల్ని ఒంటరిగా వదలొద్దని మాకు ఆ

దేశాలు ఉన్నాయి. పైవాళ్ల ఆజ్ఞలను తూ చా తప్పకుండా పాటించటమే మా కర్తవ్యం" అని, బట్లర్‌వైపు చూసి, "ఇతడికి ఎక్కడ బస కల్పిస్తే బాగుంటుందం టావు? " అని అడిగాడు.

బట్లర్ నోరు విప్పకముందే మార్యా డి మిత్రియెవ్నా కల్పించుకుని "ఎక్కడో ఎందుకు? మన గెస్ట్‌రూం, స్టోర్‌రూం అత డికి కేటాయిద్దాం. కనీసం అలా ఎప్పుడూ మన కళ్లముందే ఉంటాడు" అంది.

కాని హాజీమురాద్‌వైపు చూసి, కళ్ళు పక్కకు తిప్పుకుంది.

"మార్యా చెప్పింది బాగానే ఉంది" అన్నాడు బట్లర్.

"ఇక్కడికెందుకొచ్చావు నువ్వసలు? మా వ్యవహారాల్లో ఆడవాళ్లకేం పని!" అని కసు రుకున్నాడు పెట్రోవ్.

ఆ తర్వాత, చర్చలో తనకేమీ స్వంత కోరికలు లేవని, చెచెన్లు తనతో సంపర్కం పెట్టుకునే అవకాశం కల్పిస్తే చాలుననీ చెప్పాడు హాజీమురాద్. మాట్లాడినంత సేపూ అతడి కుడిచెయ్యి బాకుపిడి మీదే ఉంది.

అందరికీ భోజనాలు సిద్ధం చేసి, గదులు కేటాయించేదాకా ఆగంతకులతో కబుర్లు చెప్పమని బట్లర్‌కు పురమాయిం చాడు పెట్రోవ్. ఈలోగా తను ఆఫీసుకెళ్లి, ఇతర లాంఛనాలు పూర్తిచేసి, సిబ్బందికి అవసరమైన ఆదేశాలిచ్చి వస్తానన్నాడు.

హాజీమురాద్‌కు, పెట్రోవ్‌కూ ఉండవల సిన సంబంధాన్ని స్పష్టంగానే నిర్వచిం చారు పైఅధికార్లు. పెట్రోవ్ అతనికి నచ్చ లేదు. మార్యా డిమిత్రియెవ్నా ప్రేమాభి మానాలు, ఆమె వంట, వడ్డించిన పద్ధతి అతణ్ణి బాగా ఆకట్టుకున్నాయి. ఆమెలో ఏదో ఆకర్షణ ఉంది. ఆమె కూడా తనను చూసి ఆకర్షితురాలైనట్టే ఉంది. ఆమెవైపు చూడకూడదు, ఆమెతో మాట్లాడకూడదను కున్నాడు. కాని అతని కళ్లు అసంకల్పితం గానే ఆమె కదలికలను గమనించాయి.

మొదటి పరిచయంలోనే బట్లర్‌తో స్నేహం కుదిరింది. ఇద్దరూ సుదీర్ఘంగా కబుర్లు చెప్పుకున్నారు. అతడి గురించి అడిగి తెలుసుకున్నాడు. తన గురించి చెప్పాడు. గూఢచారులు తెచ్చిన సమా చారం కూడా అతడితో పంచుకున్నాడు. 'ఏం చెయ్యమంటారు? ' అంటూ సల హాలు కూడా అడిగాడు.

అయితే గూఢచారులు తెచ్చిన సమా చారం సంతోషకరమైందేమీ కాదు. అతడ క్కడున్న మొదటి నాలుగు రోజుల్లో, రెండుసార్లు వాళ్లు సమాచారం తీసుకొ చ్చారు. రెండుసార్లూ అవి దుర్వార్తలే.




**హా**జీమురాద్ రష్యన్లకు లొంగిపోయా డని తెలిసి అతడి కుటుంబాన్ని వెడెనో గ్రామానికి తరలించారు. షామిల్ నిర్ణయం మీద ఆధారపడి ఉంటుంది వాళ్ళ భవిష్యత్తు. స్త్రీలు అంటే అతని తల్లి పటిమట్, ఇద్దరు భార్యలు, ఇంకా అయి దుగురు చిన్నపిల్లలు 'ఇబ్రహీం రషీద్' అ నే ఆఫీసర్ ఇంట్లో ఉన్నారు. పద్దెనిమిదేళ్ల కొడుకు యూసుఫ్‌ను జైల్లో పెట్టారు. జైలంటే ఏడడుగుల గొయ్యి. అక్కడ మరో ఏడుగురు నేరస్తులతో కలిసి షామిల్ కోసం నిరీక్షిస్తున్నాడు వాడు.

షామిల్ నిర్ణయం ఆలస్యం కావటానికి కారణం అతడు రష్యన్లతో యుద్ధానికి పోవటమే.

1857 జనవరి 6న వెడెనోకు తిరిగివచ్చాడు షామిల్. యుద్ధంలో పరాజితుడై, వెడెనోలో తల దాచుకున్నాడని అన్నారు రష్యన్లు. అతనూ, అతని మురిద్‌ల ప్రకారం వాళ్లు రష్యన్ల దాడిని సమర్థవంతంగా తిప్పికొట్టారు. సామాన్యంగా యుద్ధంలో అతడు స్వయంగా తుపాకి పేల్చడు. కాని ఈసారి రైఫిల్‌కూ, ఖడ్గానికీ పని చెప్పాడు. మురిద్‌లు అడ్డుపడి ఆపకపోతే ఎంతమందిని సంహరించేవాడో! ఘర్షణలో అతడికి రక్షణగా ఉన్న ఇద్దరు మురిద్‌లు మరణించారు.

తన సైనికులు వెంటరాగా గాలిలో తుపాకులు పేల్చి 'లా యిలాయిల్ అల్లా' అని పాడుతూ షామిల్ బృందం గ్రామంలో ప్రవేశించి, అతడి భవంతివైపు కదిలింది.

గ్రామస్తులంతా వీధిలో రెండువైపులా బారులు తీరి నిలబడి, ఇళ్ళకప్పు పైకెక్కి విజేతగా తిరిగి వచ్చిన తమ నాయకుడికి స్వాగతం పలికారు. తెల్లటి అరబ్బు గుర్రం మీద వచ్చాడు షామిల్. అతడి గుర్రానికి బంగారు, వెండి ఆభరణాలు లేవు. అలంకరించిన తోలుపట్టా ఒకటి, కాలుపెట్టుకోవటానికి రెండు వైపులా స్టీలు రికాబులు, ఎర్రటి గుడ్డ పరచిన జీను మాత్రమే హుందాగా కనిపించాయి. నల్లటి బొచ్చు కాలర్ ఉన్న గోధుమరంగు అంగరఖా వేసుకున్నాడు షామిల్. మెడ, భుజాల మీద ఆచ్ఛాదన లేదు. నడుం చుట్టూ నల్లటి గుడ్డ బిగించి కట్టుకున్నాడు. అక్కడే వేల్లాడుతున్న బాకు పిడి, తలమీద పొడుగాటి టోపీ, చుట్టూ ఒక తెల్లటి టర్బన్, ఆకుపచ్చ చెప్పులు, నల్లటి లెగ్గింగ్స్ అతడి ఆకర్షణను పెంచాయి.

బంగారం, వెండితో సహా మెరిసేదేదీ వంటిమీద లేదు. చుట్టూ ఉన్న మురిద్‌లు మాత్రం తమ దుస్తులమీద చమ్కీ లేసులు కట్టుకున్నారు. వాళ్ల ఆయుధాల మీద కూడా బంగారం, వెండి తాపడం ఉంది. అలా సాదాసీదాగా కన్పించడం వల్లే అందరికీ తనమీద గౌరవం పెరుగుతుందని అతడికి తెలుసు. చిక్కిపోయినట్టుగా ఉన్న పొడుగాటి మొహం, ఎర్రటి పిల్లిగడ్డం, తీక్షణంగా చూసే కళ్లు. ఆ కళ్ళల్లో ఏ భావమూ కనిపించదు. గ్రామంలో వెయ్యి కళ్ళు అతణ్ణి చూశాయి. అతడుమాత్రం ఎవరి వంకా చూడలేదు.

షామిల్ వచ్చాడని విని, అప్పటి దాకా లోపలిగదుల్లో ఉన్న హాజీమురాద్ భార్యలు వసారాలోకి వచ్చి నిలబడ్డారు. అతని తల్లి మాత్రం తన గది విడిచి రాలేదు. నెరసిన జుత్తు, పీక్కుపోయిన

## మీరు కూడా బాధితులే!

తన కుమారుడైన అబ్బూరి వరదరాజేశ్వరరావు వివాహం ఛాయాదేవిగారితో జరుగుతోంది.

తీరా వివాహతంతు ముగిశాక అబ్బూరి



రామకృష్ణారావు వియ్యంకులతో 'ఇన్నాళ్లూ మేము మాత్రమే వరద బాధితులం. ఇప్పుడిక మాతోపాటు మీరూ వచ్చి ఆ జాబితాలోకి చేరారు' అన్నారు హాస్యంగా.

మొహంతో కళ్లు మూసుకుని నేలమీద చతికిలబడినట్టుగా కూర్చుంది. తన కొడుకులాగే ఆమెకు కూడా షామిల్ అంటే ద్వేషం. ఇప్పుడు మరింత ద్వేషి స్తోంది. అతడి మొహం చూడటం కూడా ఆమె ఇష్టపడదు.

హాజీమురాద్ కొడుకు కూడా షామిల్ రాకను చూడలేదు. గోతి చీకటిలో ఉన్న తనకు తుపాకుల చప్పుడు, పాటలు మాత్రమే వినిపించాయి. స్వేచ్ఛలో ఎంత ఆనందం ఉంటుందో బందీలకు బాగా తెలుస్తుంది.

తన భవంతి చేరుకుని, అంతఃపురం వైపు కదిలాడు షామిల్. దారిలో అతడి

> **కొత్తగాలి...**
>
> **కల కలగా మిగిలిపోతే**
> **జీవితం కళ తప్పుతుంది**
>
> – బాడాల నవనీత్‌రెడ్డి,
> ఆదిలాబాద్

దర్శనానికి నిరీక్షిస్తున్నారు జనం. లోపలి గేటువద్ద ఇద్దరు సైనికులు కాపలా ఉన్నారు. అర్జీలు చేతపట్టుకున్న కొందరు తోసుకుని ముందుకు రావటానికి ప్రయ త్నించారు. అక్కడ మూగినవాళ్లలో స్వయంగా వచ్చినవాళ్లూ ఉన్నారు. తను పిలిస్తేనే వచ్చినవాళ్లూ ఉన్నారు. వాళ్లను విచారించాలి. నేరాలు చేశారని రుజువైతే శిక్షలు వేయాలి. అతడు వాళ్లకు ఇమాం కదా! అందరూ గౌరవ సూచకంగా సలాం చేశారు. కొందరు మోకాళ్ల మీద వంగారు. అందరూ దేబిరిస్తున్నట్టుగానే చూస్తారు. అందుకే వాళ్లంటే అతడికి అసహ్యం. ఏం మనుషులు! అందర్నీ దాటుకుని వసారా దాకా వచ్చాడు. శారీరకంగానూ, మానసి కంగానూ అలసిపోయాడు. ప్రతి యుద్ధమూ తన శక్తియుక్తులకు ఒక పరీక్షే. విజయం తనదే అని ప్రకటించు కున్నాడు గాని, అది నిజమైన గెలుపు కాదని తనకు తెలుసు. చాలా చెచెన్ గ్రామాలను వాళ్లు ధ్వంసం చేశారు. తగల పెట్టారు. అసలు స్వభావరీత్యా చెచెన్లు నమ్మదగిన మనుషులు కారు. ముఖ్యంగా రష్యన్ సరిహద్దు ప్రాంతంలో ఉన్న వాళ్లను అసలు నమ్మలేం. అవకాశం దొరి కితే చాలు, అటువైపు పోవటానికి ప్రయ త్నిస్తారు.

ఈ సమస్యల్ని కొంతవరకు పరిష్కరిం చాడు. అసంతృప్తి కనిపించిన చోటల్లా ఉక్కుపాదంతో అణచివేశాడు. ప్రస్తుతం అతనికేమీ ఆలోచించాలని లేదు. తనకి ప్పుడు కావలసింది ఒక్కటే. విశ్రాంతి. సంసార సుఖం. ఇష్టభార్య ఆలింగనం. ఇష్టభార్యంటే నల్లకళ్ల పద్దెనిమిదేళ్ల అమీ నల్. ఆ క్షణాన ఆమె పరదా వెనక తన కోసం నిరీక్షిస్తున్నదని తెలుసు. పరదాకటు వైపు జనానా ఉంటారు. ఇతర భార్యలకు కూడా తనను చూడాలని కోరిక ఉండదని కాదు. కాని తన కోరికలు తీర్చుకునే సమయం కాదిది. ఇష్టంలేదు గాని, మొదట మధ్యాహ్నం ప్రార్థనలు చెయ్యాలి. మతగురువుగా అతడు అందరికీ ఆద ర్శంగా ఉండాలి మరి! పైగా తనకు కూడా భోజనమెంత ముఖ్యమో, అవీ అంతే ముఖ్యం. నమాజు ముగించి తనకోసం నిరీక్షిస్తున్నవాళ్లను ఒక్కొక్కర్నీ పిలిచాడు.

మొదట ప్రవేశించాడు జమాల్ ఎడ్డిన్ - పిల్లనిచ్చిన మామ. తనకు గురుతు ల్యుడు. నెరసిన జుత్తు, గడ్డం, కందగడ్డ లాంటి ఎర్రటి మొహం. త్వరగా ప్రార్థన ముగించి, యుద్ధం గురించి షామిల్‌ను

గుచ్చిగుచ్చి అడిగి, వివరాలన్నీ తెలుసుకున్నాడు. తరువాత అతడు లేనప్పుడు తన గ్రామాల్లో జరిగిన విషయాలన్నీ పూసగుచ్చినట్టు చెప్పాడు.

చాలా విషయాలు జరిగాయి. ముఖ్యంగా కుటుంబ కలహాలకు సంబంధించిన హత్యలు, పశువుల దొంగతనాలు, తారికాత్(మత నిబంధన)ను ఉల్లంఘించి మద్యపానం, పొగత్రాగటం వగైరా నేరాలు. రష్యన్లకు తన కుటుంబాన్ని అప్పగించమని ఒత్తిడి తేవటానికి హాజీమురాద్ చేస్తున్న ప్రయత్నాల గురించి చెప్పాడు జమాల్ ఎడ్డిన్. ఇది పసిగట్టి వాళ్లను వెడెనోకు తరలించారు. ప్రస్తుతం అందరూ కట్టుదిట్టమైన పహారాలోనే ఉన్నారు. ఇకపై షామిల్ ఎలా నిర్ణయిస్తే అలా. పక్కగదిలో మతపెద్దలు తనకోసం నిరీక్షిస్తున్నారు, గత మూడు రోజులుగా. కాసేపు వాళ్లతో మాట్లాడి పంపించివేస్తే తాము తీరిగ్గా ఇతర విషయాలు చర్చించుకోవచ్చు.

**కొత్తగాలి...**

**ఎఫైర్**
**ఫైరయింది!**
**జీవితం**
**తగలడింది!**

– జి. విజయశ్రీ,
అరసవిల్లి

గద్దముక్కు గల కురూపి, కారునలుపు రంగు, పేరు జైదాత్ అతనికి భోజనం వడ్డించింది. ఆమె అంటే అతడికేమాత్రం ఇష్టం లేదు. జైదాత్ అతని పెద్దభార్య.

భోజనం ముగించి మతపెద్దలు కూర్చున్న గదిలోకి ప్రవేశించాడు షామిల్. నెరిసిన జుత్తు, ఎర్రటి గడ్డాలతో ఆరుగురు వృద్ధులు కూర్చున్నారక్కడ. అందరి తలల మీదా టోపీలో, టర్బన్‌లో ఉన్నాయి. కొందరు బనియన్లూ, సర్కేషియన్ కోట్లు ధరించారు. నడుములకు బాకులు వేళ్లాడుతున్నాయి. షామిల్‌ను చూసి లేచి అభివాదం చేశారు. అందరికన్నా పొడుగ్గా ఉన్నాడు షామిల్. చర్చల తర్వాత ఆ సలహా మండలి సూచనల ప్రకారం ఒక్కొక్క కేసూ పరిశీలించి షరియత్ ప్రకారం శిక్షలు విధించారు. దొంగతనానికిగాను ఇద్దరికి ఒక్కొక్క చెయ్యి నరికెయ్యాలి. హత్య చేసినందుకు ఒకడికి శిరచ్ఛేదం చెయ్యాలి. ముగ్గురికి క్షమాభిక్ష ప్రసాదించాలి. ఆ తర్వాత ముఖ్యాంశం గురించి చర్చ మళ్లీ కొనసాగింది.

రష్యన్లవైపు పోకుండా చెచెన్లను నిలువరించటమెలా? ఇందుకోసం జమాల్ ఎడ్డిన్ ఒక ప్రకటన సిద్ధం చేశాడు.

"చెచెన్ సోదరులారా! మాయమాటలు చెప్పి రష్యన్లు మిమ్మల్ని తమకు లొంగిపొమ్మంటున్నారు. వాళ్ల బూటకపు ప్రచారాన్ని నమ్మవద్దు. లొంగిపోవద్దు. ఈ పుణ్యకార్యానికి ఈ జన్మలో కాకపోయినా, వచ్చే జన్మలో మీకు తగిన ప్రతిఫలం లభిస్తుంది. ఇదివరలో వాళ్లు ఒకసారి మీ ఆయుధాలు స్వాధీనం చేసుకోవటం గుర్తుందా? అప్పుడే గనక భగవంతుడు మీ కళ్లు తెరిపించి ఉండకపోతే ఇప్పుడు మీరంతా సైనికులుగా ఉండేవారు. మీ భార్యల మానం బుగ్గిపాలయ్యేది.

గతం నుండి నేర్చుకున్న పాఠాలతో భవిష్యత్తును తీర్చిదిద్దుకోండి. ఇస్లాంకు వ్యతిరేకులైన అవిశ్వాసులైన రష్యన్లతో కలిసి బతకటం కన్నా, శత్రువులుగా వాళ్లతో యుద్ధం చేసి మరణించటం మేలు. కాస్త ఓపిక పట్టండి. నేను ఖురానుతో, ఖడ్గంతో వచ్చి మిమ్మల్ని శత్రు

వులకు వ్యతిరేకంగా నడిపిస్తాను. కాని ప్రస్తుతానికి మీరు వాళ్లకు లొంగిపోయే ఆలోచన కూడా రానివ్వవద్దని శాసిస్తు న్నాను"

ఇది తన ఆజ్ఞగా విడుదల చెయ్యటానికి అంగీకరించిన షామిల్ దానిమీద సంతకం చేసి ఎడ్డిన్‌కు తిరిగిచ్చాడు.

ఆ తర్వాత హాజీమురాద్ విషయం చర్చకు వచ్చింది. ఇదే షామిల్‌కు అత్యంత ముఖ్యమైన, కీలకమైన కేసు. బహిరం గంగా అంగీకరించనప్పటికీ హాజీమురాద్ ధైర్యసాహసాలు, యుద్ధసామర్థ్యం అతడికి బాగానే తెలుసు. హాజీమురాద్ తనతో ఉన్నట్టయితే చెచెన్యా పరిస్థితి ఇలా ఉండే దికాదు. అతనితో సంధి చేసుకోవటం శ్రేయస్కరం. అది జరిగితే అతడి సేవల ను తిరిగి తను వినియోగించుకోవచ్చు. కాని అది అసాధ్యమని కూడా షామిల్‌కు తెలుసు. అయినప్పటికీ అతడు రష్యన్లకు సహాయం చెయ్యకుండా నిరోధించగల గాలి. ఏదో మిషమీద అతణ్ణి తన వద్దకు రప్పించుకుని సంహరించాలి. తన మను షులు టిఫ్లిస్‌కెళ్లి అక్కడే చంపొచ్చు. లేదా అతణ్ణే ఇక్కడికి రప్పించే వ్యూహం ఆలో చించాలి. అందుకోసం అతడి కుటుం బాన్నీ, కొడుకునూ ఎరగా వాడుకోవాలి. ముఖ్యంగా అతడి కొడుకు. వాడంటే అత డికి ప్రాణం. అవును, కొడుకును ఎరవె య్యాలి.

చర్చ ముగిశాక కళ్లుమూసుకుని ఆలో చించాడు షామిల్. 'అతడు కళ్లుమూసుకు న్నాడంటే లోలోన ప్రవక్తవాణిని వింటు న్నాడన్నమాట' అని సభికుల నమ్మకం. ప్రవక్త ఆదేశానుసారమే అతడు ఏ పనైనా చేస్తాడు. అయిదు నిమిషాల తర్వాత కళ్లు తెరిచి, భృకుటి ముడిచి "హాజీమురాద్ కొడుకును ప్రవేశపెట్టండి" అని ఆజ్ఞాపిం చాడు షామిల్.

"ఇక్కడే ఉన్నాడు" అన్నాడు జమాల్ ఎడ్డిన్ వినయంగా. నిజానికి హాజీమురాద్ కొడుకు యూసుఫ్, అక్కడే గేట్‌వద్ద నిలు చున్నాడు. అందమైన మొహం. సన్నగా, పీలగా ఉన్నాడు. నాయనమ్మలాగే నల్లటి కళ్లు. చింకిపాతల్లో స్నానం లేక దుర్వాసన వేస్తున్నాడు.

షామిల్ పట్ల తండ్రికున్న శత్రుత్వం యూసుఫ్‌కు లేదు. గత చరిత్ర అతడికి తెలియదు. తెలిసినా అదంతా స్వయంగా అనుభవించలేదు గనక తండ్రి షామిల్ పట్ల అనవసరంగా ద్వేషం పెంచు కున్నాడనే అనుకుంటున్నాడు. అతడిక్కావ లసింది విలాస జీవితం. ఎందుకు షామి

> **కొత్తగాలి...**
>
> **వీణను మీటితే**
> **పలికేది రాగం**
> **హృదయవీణను మీటితే**
> **చిలికేది అనురాగం**
>
> – ఎస్.ఎమ్. గౌరీశంకర్,
> విజయనగరం

ల్‌తో వైరం పెంచుకోవటం? తండ్రులను ధిక్కరించాలనే కోరిక సహజంగా చాలా మంది కొడుకులకు ఉన్నట్టుగానే అతడికీ ఉంది. ఆ కారణంతో అతడికి షామిల్ పట్ల ఆరాధనాభావం పెరిగింది. చెచెన్ గ్రామాల్లో అందరూ అతణ్ణి దేవుడిలా చూస్తారు. అతడు వాళ్లకు ఇమాం. లోప లికి ప్రవేశించిన యూసుఫ్‌ను సగం మూసిన కళ్లతో చూశాడు షామిల్. షామి ల్‌ను సమీపించి అతడి చేతిని ముద్దా డాడు యూసుఫ్.

"నువ్వు హాజీమురాద్ కొడుకువా?"

"అవును, ఇమాం"

"నీ తండ్రేం చేశాడో నీకు తెలుసా? "

"తెలుసు. అందుకు విచారిస్తున్నాను కూడా"

"నువ్వు రాయగలవా? "

"ముల్లా కావాలని చదువుకుంటున్నాను"

"అయితే రాయి. బైరాం పండుగకు ముందు అతడు నావద్దకు తిరిగి వస్తే అతణ్ణి క్షమిస్తాం. అందరం ఇది వరకున్న ట్టుగా కలిసిమెలిసి ఉందాం. లేకపోతే, రష్యన్లతోనే ఉంటానంటే నీ నాయన మ్మనూ, తల్లినీ, అందర్నీ తలా ఓ ఊరికి పంపిస్తాను. నీ తల నరికేస్తాను"

యూసుఫ్ ముఖ కవళికలు ఏమాత్రం మారలేదు. కాని షామిల్ మాటలు అర్థం చేసుకున్నట్టుగా తలాడించాడు.

మాట్లాడటం ఆపి, యూసుఫ్‌ను చాలా సేపు పరికించి చూశాడు షామిల్.

"ఇది కూడా రాయి. నీమీద జాలితో నిన్ను చంపదలచుకోవటం లేదు. కాని దేశద్రోహులందరికీ విధించే శిక్షమాత్రం తప్పదు. నీ కళ్లు పీకిస్తాను"

షామిల్ ముందు ప్రశాంతంగా ఉన్న యూసుఫ్, పక్కగదిలోకి వెళ్లగానే తన కాపలాదారు నుండి బాకు లాక్కుని పొడు చుకోవటానికి ప్రయత్నించాడు. అందరూ కలిసి అతడి రెక్కలు వెనక్కు విరిచి కట్టే శారు.

ఆ సాయంత్రం ప్రార్థనల తర్వాత తెల్లటి కోటు ధరించి, షామిల్ తన భార్య లున్న గదుల వైపు - అమీనల్ ఉన్న గది వైపు వెళ్లాడు. అయితే అక్కడ ఆమె కని పించలేదు. సవతులతో కలిసి కబుర్లాడు తున్నదామె. తను కనిపించకుండా ఒక తలుపు వెనక నక్కి ఆమెకోసం నిరీక్షిం చాడు షామిల్.

అమీనల్ భర్త మీద కోపంగా వుంది. అతడు జైదాత్‌కు సిల్కు గుడ్డలేవో బహు మతిగా ఇచ్చాడు. భర్త రావటం, పోవటం చూసిందిగానీ కావాలనే అతనికి దూరంగా వుంది. జైదాత్ గదిలో నిల్చుని అతడు తన కోసం కాలుగాలిన పిల్లిలా తిరగటం చూసి నవ్వుకుంది.

అమీనల్ కోసం చాలాసేపు నిరీక్షించిన షామిల్ అర్ధరాత్రి ప్రార్థనల కోసం తన గదికి తిరిగివచ్చాడు.



## 8

హాజీమురాద్ కొత్తచోటుకి వచ్చి వారం దాటింది. మార్యా డిమిట్రియెవ్నా అప్పుడప్పుడు చివాట్లేసి ఖనేఫీని వంటి ట్లోంచి గెంటేసినా హాజీమురాద్‌ను చాలా అభిమానంగా, ప్రేమగా చూసింది. హాజి మురాద్ తనవెంట ఖనేఫీనీ, ఎల్దార్‌లను మాత్రమే తెచ్చుకున్నాడు. అతడికి భోజనం వడ్డించే పని ఎల్దార్‌కు అప్పగించి మిగతా సేవలు తాను స్వయంగా చేసింది. అతడు తన కుటుంబం గురించి మాట్లాడి నప్పుడల్లా చాలా ఆసక్తి కనపర్చింది. అతడి భార్యలు, పిల్లల గురించీ అడిగి, ఎవరెవరి వయసెంతో తెలుసుకుంది. గూఢచరులు వచ్చినప్పుడల్లా తాజా పరిస్థి తుల గురించి వాకబు చేసింది.

బట్లర్‌కు కూడా హాజీమురాద్‌తో స్నేహం పెరిగింది. ఒకరి గదికి ఒకరు వెళ్ళి కబుర్లు చెప్పుకున్నారు. కొన్నిసార్లు దుబాసీ సాయంతో, కొన్నిసార్లు భాష అర్థం కాకపోయినా సైగలతో మాట్లాడుకు

న్నారు. ముఖ్యంగా చిరునవ్వులు భావాల్ని బాగా వ్యక్తం చేస్తాయి.

హాజీమురాద్‌కు బట్లర్‌తో సాన్నిహిత్యం పెరిగిందని తెలుసుకున్నాడు ఎల్డార్. అతడు గదిలోకి రాగానే, హాజీమురాద్ చిరునవ్వుతో కూర్చోవటానికి దిండు అందించి మర్యాద చేశాడు.

ఖనేఫీతో కూడా బాగానే పరిచయం పెంచుకున్నాడు బట్లర్. 'వాడు నా తమ్ముడు' అని హాజీమురాద్ స్వయంగా ప్రకటించాడు గతంలో. ఖనేఫీ తమ వాళ్ళ పల్లెపాటలు బాగా పాడగలడు. బట్లర్, హాజీమురాద్ కూడా తరచుగా అతడి చేత పాటలు పాడించుకుని విన్నారు. అతడి గొంతులో భావం బాగా పలుకుతుంది. ఉచ్ఛారణ స్పష్టంగా వుంటుంది. విషాద గీతాలు మరీ బాగా పాడతాడు. ఒక పాట హాజీమురాద్‌కు చాలా ఇష్టం.

'నా సమాధిమీద
మట్టి తడారిపోయింది.
అమ్మా, ఇక నువ్వు నన్ను మరచిపో..
గడ్డి మొలిచింది.
నాన్నా, ఇక నువ్వు నన్ను మరచిపో..
నీ అందమైన కళ్ళలో,
కన్నీళ్ళు ఇంకిపోతాయి
చెల్లెమ్మా, ఇంకెన్నాళ్ళు బాధపడతావు?
కానీ అన్నా! నువ్వు మాత్రం
ఎప్పుడూ మరువ వద్దు.
నేను తీర్చుకోలేని
ప్రతీకారం నువ్వు తీర్చుకోవాలి
తమ్ముడా! మరువ వద్దు.
నా పక్కకు వచ్చి చేరేముందు

పగ సాధించు
నల్లటి తుపాకిగుండు నా బానిస..
నేను మృత్యువును జయించాను
నా శరీరం మట్టిలో
సమాధి చేయబడింది
కానీ నా ఆత్మ స్వర్గంలో విహరిస్తుంది'

హాజీమురాద్‌కు ఈ పాటంటే చాలా ఇష్టం. ప్రతిసారీ కళ్ళు మూసుకుని తన్మయంగా వినేవాడు.

'మంచి పాట, అర్థమున్న పాట' అనేవాడు రష్యన్‌లో.

హాజీమురాద్, అతని మురిద్‌ల పరిచయంతో గిరిజన జీవితం గురించి అవగాహన పెరిగి బట్లర్‌లో తెలియని మార్పొచ్చింది. ఆ జీవన సరళిలోనే కవిత్వముంది. తను ఓ బనియన్, సర్కేషియన్ కోట్, లెగ్గింగ్స్ వేసుకుని గిరిజనుడిగా మారిపోయాననుకుని ఆనందించాడు.

హాజీమురాద్ వెళ్ళిపోయేరోజు వచ్చింది. ఇతర ఆఫీసర్లందర్నీ వీడ్కోలు కార్యక్రమానికి ఆహ్వానించాడు పెట్రోవ్. మార్యా డిమిట్రియెవ్నా అడిగినవాళ్లకు టీ, వోడ్కా, వైన్ సర్వ్ చేసింది. టేబుల్ మీద తినుబండారాలున్నాయి. డ్రెస్ చేసుకుని కుంటుతూ వచ్చాడు హాజీమురాద్.

అందరూ లేచి అతడితో కరచాలనం చేశారు. పెట్రోవ్ సోఫా చూపించాడుగాని హాజీమురాద్ కిటికీ పక్కన కుర్చీలో కూర్చున్నాడు. టేబుల్ మీద తినుబండారాలున్నాయి. సమోవర్‌లో టీ మరుగుతున్నది. కాని హాజీమురాద్‌కు ఎందులోనూ ఆసక్తి ఉన్నట్టుగా కన్పించలేదు.

"టిఫ్లిస్ నచ్చిందా? " అని అడిగాడు పెట్రోవ్ దుబాసీ ద్వారా.

"అల్యా" అంటూ జవాబిచ్చాడు హాజీమురాద్.

"బాగా నచ్చిందట" అన్నాడు దుబాసీ.

"అతడికేం నచ్చింది? "

"నాటకాలు"

"కమాండర్-ఇన్-చీఫ్ ఇంటిలో జరిగిన బాల్ డాన్స్ నచ్చలేదా? "

"ప్రతి దేశానికీ కొన్ని పద్ధతులుంటాయి. మా ఆడవాళ్ళు అలా డ్రెస్ చేసుకోరు" అన్నాడు హాజీమురాద్ కళ్లు చిట్లించి, మార్యా డిమిట్రియెవ్నావైపు ఓసారి చూసి.

"మొత్తంమీద నచ్చలేదన్నమాట"

"మా దగ్గరో సామెత వుంది. కుక్క, గాడిదను మాంసం తినమన్నదట. గాడిద, కుక్కను గడ్డి తినమన్నదట. అలా చేసి రెండూ ఆకలితో చచ్చాయి. ఎవరికివాళ్లకు తమ ఆచారాలు బాగానే వుంటాయి" అన్నాడు హాజీమురాద్ దుబాసీ ద్వారా.

సంభాషణ కొనసాగలేదు. కొందరు టీ తాగారు. కొందరు కొద్దిగా తిన్నారు. హాజీమురాద్ టీ గ్లాసు చేతిలో పట్టుకున్నాడు.

"పాలూ, బన్ను కావాలా? " అని అడిగింది మార్యా డిమిట్రియెవ్నా.

హాజీమురాద్ చిరునవ్వుతో అడ్డంగా తలూపాడు.

"ఓకే, ఇక గుడ్‌బై. మళ్లీ ఎప్పుడు కలుద్దాం? " అన్నాడు బట్లర్.

"వీడ్కోలు, మిత్రమా. మన స్నేహబంధం బలపడనీ" అంటూ బయల్దేరాడు హాజీమురాద్.

ఒక తెల్లని బురఖా భుజాన వేసుకుని, చేతిలో ఖడ్గం పట్టుకుని ఎదురొచ్చాడు ఎల్డార్. బురఖా అందుకుని మార్యా డిమిట్రియెవ్నా వైపు చూస్తూ ఏదో చెప్పాడు హాజీమురాద్.

"మీకీ బురఖా నచ్చిందన్నారట. ఇది మీకు బహుమతిగా ఇస్తున్నాడు" అన్నాడు దుబాసీ.

"వద్దు" అంది మార్యా కాస్త సిగ్గుపడుతూ.

"కానుక మాత్రమే" అన్నాడు హాజీమురాద్.

"థాంక్యూ, మీ కొడుకు క్షేమంగా వుండాలి. త్వరగా మిమ్మల్ని చేరుకోవాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను" అంది మార్యా.

హాజీమురాద్ కృతజ్ఞతగా తలాడించి, ఎల్డార్ నుండి ఖడ్గం తీసుకుని పెట్రోవ్‌కు బహూకరించాడు.

"అతణ్ణి నా గోధుమరంగు గుర్రం తీసుకొమ్మను" అని దుబాసీతో చెప్పాడు పెట్రోవ్.

తనకు కానుకలొద్దన్నాడు హాజీమురాద్.

చాలాదూరం వెళ్ళాలి. దూరంగా కనిపించే పర్వతం వైపు చూస్తూ వడివడిగా నడిచాడు.

ఇంటిల్లిపాదీ బయటి గేటుదాకా వచ్చి అతడిని సాగనంపారు. అతడిచ్చిన ఖడ్గం పరిశీలించి ఇది నిజంగా 'గుర్దా ఖడ్గమే' అని సంతోషించారు.

గుర్రపుశాల దాకా హాజీమురాద్ వెంట నడిచాడు బట్లర్. అక్కడే అనుకోని సంఘటన ఒకటి జరిగింది.

రష్యన్లకు అనుకూలంగా వున్న గ్రామం టాష్కిచూ. అక్కడి ప్రజలకు హాజీమురాద్ అంటే అపారమైన గౌరవం. అతణ్ణి చూడటానికి తరచుగా వస్తుండేవాళ్ళు. తమ వూళ్ళో వున్న మసీదుకు రావాలని హాజీమురాద్‌కు మూడురోజుల క్రితమే దూతల ద్వారా వర్తమానం పంపించారు. కాని అక్కడి రాకుమారులకు హాజీమురాద్ అంటే ద్వేషం. ఇరువురి మధ్యా ఏదో పాత పగ రగులుతున్నది. హాజీమురాద్‌కు ప్రజలు ఆహ్వానం పంపిన విషయం తెలిసి, అతణ్ణి మసీదులోకి అనుమతించం అన్నారు. రాజకుమారుల మనుషులకూ, గ్రామస్థులకూ మధ్య పెద్ద పోట్లాట జరిగింది. గ్రామస్థులను శాంతింపజేసి హాజీమురాద్ మసీదును సందర్శించడని ప్రకటించారు రష్యన్ అధికారులు.

ఒప్పందం ప్రకారం హాజీమురాద్ అక్కడికి వెళ్ళలేదు. గొడవ సమసిపోయిందనే అనుకున్నారందరూ.

కాని సరిగ్గా హాజీమురాద్ వీడ్కోలు తీసుకుంటున్నప్పుడే బట్లర్ స్నేహితుడైన ఒక రాకుమారుడు అర్స్‌లాన్‌ఖాన్ అక్కడికి వచ్చాడు. హాజీమురాద్‌ను చూసి, కోపంతో ఊగిపోతూ, బెల్ట్‌లోంచి పిస్టల్‌ను తీసి కాల్చాడు. కాని అంతలోనే వంగి, దూరంగా పరిగెత్తి తప్పించుకున్నాడు హాజీమురాద్. ఆ తర్వాత అర్స్‌లాన్‌ఖాన్ గుర్రం కళ్ళెం పట్టుకుని, బాకు తీసి టార్టార్‌లో ఏదో అరిచాడు.

బట్లర్, ఎల్డార్ పరిగెత్తి, ఇద్దర్నీ వేరుచేసి చేతులు వెనక్కి కట్టేశారు. పిస్టల్ చప్పుడు విన్న పెట్రోవ్ కూడా అక్కడికి చేరుకుని "ఇదేం పని అర్స్‌లాన్. ఈ నీచమైన పని నా ఇంట్లోనే చెయ్యాలా? యుద్ధరంగంలో కరుణ చూపించవద్దు. కాని ఇక్కడ ఇంట్లో చంపుకోవటం మర్యాద కాదు" అన్నాడు.

హాజీమురాద్ వైపు కోపంగా చూస్తూ, పెట్రోవ్ వెంట ఇంట్లోకి వెళ్లాడు అర్స్‌లాన్‌ఖాన్. భారంగా వూపిరి పీల్చుకుంటూ, నవ్వుకుంటూ గుర్రాల వైపు కదిలాడు హాజీమురాద్.

## కొత్తగాలి...

**'ఆడ'పిల్ల అంటే**
**అత్తారింటికి వెళ్లేదని**
**కడుపులో వుండగానే**
**కనుమరుగయ్యేదని కాదు**

– తటవర్తి రామకృష్ణ,
హైదరాబాద్

"అతడెందుకు చంపాలనుకున్నాడు? " అ డిగాడు బట్లర్.

"అది వాళ్ళ సంప్రదాయమట. అతడి రక్తబంధువును హాజీమురాద్ చంపాడు. అందువల్ల అతడు ప్రతీకారం తీసుకోక తప్పదు" అని హాజీమురాద్ జవాబును అనువదించి చెప్పాడు దుబాసీ.

"అతడు దారి కాచి, నీ మీద దాడి చేసి వుంటే? " అనడిగాడు బట్లర్.

"ఒకవేళ అతడు నన్ను చంపటమే జరి గితే అది అల్లా నిర్ణయం. గుడ్‌బై" అంటూ గుర్రాన్ని అదిలించాడు హాజీమురాద్.

అప్పుడే అక్కడికి మార్యా డిమిత్రియెవ్నా కూడా వచ్చింది.

"గుడ్‌బై. అందరికీ గుడ్‌బై"

"దేవుడు నిన్నూ, నీ కుటుంబాన్నీ రక్షిం చాలి" అంది మార్యా డిమిత్రియెవ్నా. ఆ రష్యన్ మాటలు అర్థంకాకపోయినా ఆమె సానుభూతిగా ఏదో అన్నదని మాత్రం గ్రహించాడు హాజీమురాద్.

"నీ సోదరులను మరచిపోవద్దు" అన్నాడు బట్లర్.

"అతడు నా ఆప్తమిత్రుడు. నాలో ప్రాణ మున్నంతవరకూ మరచిపోను" అన్నాడు హాజీమురాద్ దుబాసీతో. గుర్రం కది లింది. కళ్లేన్ని కొద్దిగా లాగాడు. నడుమ్మీది బాకు, ఖడ్గం ఒకసారి తాకి చూసుకు న్నాడు. ఆ తర్వాత గుర్రం తన శరీరంలో ఓ భాగమన్నట్టు స్వారీ చేశాడు. ఖనేఫీ, ఎల్దార్‌లు కూడా సెలవు తీసుకుని తమ నాయకుని వెంటే బయల్దేరారు.

వెళ్ళిపోవలసినవాళ్ళు వెళ్లిపోయిన తర్వాత అక్కడున్నవాళ్లు వాళ్ల గురించి చర్చించుకున్నారు.

"ఏం నేర్పు అది. అర్స్‌లాన్‌ఖాన్ మీదికి సివంగిలా లంఘించాడు"

"కాని వీణ్ణి నమ్మలేం. పెద్ద కిలాడీలా వున్నాడు" అన్నాడు పెట్రోవ్.

"నిజమే. రష్యన్ కిలాడీలు కూడా అలా వుంటే ఎంత బాగుండేది! వారం రోజులు మన అతిథిగా వున్నాడు. ఏమైనా కిలాడీ పనులు చేశాడా? ఎంత మర్యాద, ఎంత ఆప్యాయత చూపించాడు" అంది మార్యా డిమిత్రియెవ్నా కాస్త కోపంగా.

"అతనిలో అన్ని మంచి గుణాలున్నా యని నీకెలా తెలిసింది? "

"ఎలాగోలా తెలిసిందిలే"

"అతడేదో మాయ చేశాడు"

"చేస్తే చేశాడు. నేనా మాయలో పడ్డాను. అయితే నీకేమిటి? మంచివాళ్లను ఆడిపోసుకోవటం ఎందుకు? టార్టార్ అ యినంత మాత్రాన అలా మాట్లాడాలా? "

"మార్యా డిమిత్రియెవ్నా, నువ్వు చెప్పింది ముమ్మాటికీ నిజం" అన్నాడు బట్లర్.




చెచెన్యా సరిహద్దు వెంట వున్న దుర్గాల్లో జీవితం సజావుగా సాగిపో యింది. ఇప్పటివరకు మనం చెప్పుకున్న విషయాల తర్వాత మిలిటరీ రెండుసార్లు మాత్రమే 'యాక్షన్'లోకి దిగాల్సివచ్చింది. రెండుసార్లూ సైన్యాన్ని చూసి, అల్లర్లు సృష్టించటానికి వచ్చిన చెచెన్లు పర్వతాల్లోకి పారిపోయారు. ఓసారి మాత్రం వోడ్విజె న్స్కయ గ్రామంలో ఓ కోసక్కును చంపి ఎనిమిది గుర్రాలను అపహరించారు.

గ్రామాల మీద దాడులు జరగలేదు. విధ్వంసకాండ కూడా చెలరేగలేదు. కాని కొత్త కమాండర్ ప్రిన్స్ బార్యాటిన్స్కీ నియామకంతో యుద్ధం ప్రారంభమయ్యే అవకాశం వుందని గ్రహించారు. అతడు జనరల్‌కు పాత మిత్రుడు. ఇప్పటిదాకా కబార్డా రెజిమెంట్‌కు కమాండర్‌గా పనిచేశాడు. చక్రవర్తి ఆదేశాలు చెర్నిషోవ్ ద్వారా జనరల్‌కు చేరాయి. బార్యాటిన్స్కీ వాటిని అమలు చేయాలి.

సైన్యం కురిన్ ప్రాంతానికి చేరుకుని చెట్లు నరకటం ప్రారంభించింది. సైమన్ మిహలోవిచ్ వొరొంట్సొవ్ (వైస్‌రాయ్ కొడుకు) పక్క గ్రామం వోడ్విజెన్‌స్కయ గ్రామంలో పెద్దగుడారం వేసుకుని క్యాంప్ చేస్తున్నాడు. రాత్రుళ్లు భార్య మార్యా వాసిలెవ్నా తనతో గడపటానికి వస్తుంటుంది. బార్యాటిన్స్కీకి ఆమెతో వున్న సంబంధాల గురించి అందరికీ తెలుసు. చిన్న వుద్యోగులూ సైనికులూ ఆమెను తిట్టుకోని రోజు లేదు. ఆమె మూలంగా వాళ్లు రాత్రుళ్లు యుద్ధసన్నద్ధమైనట్లుగా నేలమీద బోర్లాపడుకుని డ్యూటీ చేయాల్సివస్తోంది. సాధారణంగా చెచెన్లు పర్వతాలలో దాగి అప్పుడప్పుడూ కాల్పులు జరుపుతుంటారు. కాని అవేవీ తనకింత వరకూ నష్టం చెయ్యలేదు. ఆ కాల్పుల శబ్దానికి మార్యా భయపడుతున్నది గనక వాళ్లు కాల్పులు జరపకుండా వీళ్లే ముందుగానే వాళ్లని చెదరగొట్టాలి. ఇది అనవసరమైన డ్యూటీ. అందుకే తిట్లు.

సెలవు మీద బట్లర్ తన పాత మిత్రులతో గడపటానికి కురిన్‌కు వచ్చాడు. సహోద్యోగులు అతనికి పోల్టోరాట్‌స్కీ గుడారంలో బస ఏర్పాటు చేశారు. రోజంతా కబుర్లు, వేళాకోళాలు, విందులు, వినోదాలు. వొరొంట్సొవ్‌తో పెద్దగా స్నేహం లేదు. ఒకప్పుడు ఇద్దరూ ఒకే రెజిమెంట్‌లో పనిచేశారు. ఆ పరిచయంతో వొరొంట్సొవ్, బట్లర్‌ను ఆహ్వానించి బార్యాటిన్స్కీకి పరిచయం చేశాడు. ఆ రోజు బదిలీ అయిన జనరల్ కొజ్లోవ్‌స్కీకి వీడ్కోలు పార్టీ ఏర్పాటు చేశాడు.

భోజనం బాగుంది. వరుసగా గుడారాలు వేసి, పొడుగాటి టేబుళ్ళ మీద డిన్నర్, బాటిళ్ళు అరేంజి చేశాడు. అంతా పీటర్స్‌బర్గ్ గార్డ్స్ క్యాంపులో జరిగినట్టే వుంది. రెండింటికి అందర్నీ లోపలికి ఆహ్వానించారు. ఒక వరుస మధ్యలో కూర్చున్నాడు కొజ్లోవ్‌స్కీ. ఇరువైపులా బార్యాటిన్స్కీ, వొరొంట్సొవ్‌లు, భర్త పక్క మార్యా ఆసీనులయ్యారు. కబార్డా, కురిన్ రెజిమెంట్ల ఆఫీసర్లందరూ ఆ పార్టీకి ఆహూతులే. పోల్టోరాట్‌స్కీ పక్కన కూర్చున్నాడు బట్లర్. మందు ధారాళంగా ప్రవహించింది. ఆర్డర్లీలు ఎవరి గ్లాసూ ఖాళీగా వుండాకుండా చూశారు.

"కొజ్లోవ్‌స్కీ యివ్వాళ నవ్వులపాలు కాక తప్పదు" అన్నాడు బట్లర్‌తో పోల్టోరాట్‌స్కీ.

"ఎందుకు? "

"తనకు జరిగిన సన్మానానికి సమాధానంగా అతడు వుపన్యసించాలి. ఉపన్యసించడమంటే యుద్ధం చెయ్యటమంత సులభం కాదు"

"నిజమే, పాపం! పూర్ కొజ్లోవ్‌స్కీ" అనుకున్నారు చాలామంది ఆఫీసర్లు.

చివరికి ఆ సమయం రానే వచ్చింది.

బార్యాటిన్స్కీ, కొజ్లోవ్‌స్కీకి టోస్ట్ చేశాడు. ఒక్క గుక్కలో తన డ్రింకు ముగించి కాస్త తత్తరపాటుతో ప్రారంభించాడు కొజ్లోవ్‌స్కీ.

"చక్రవర్తి ఆదేశానుసారం నేను మీకు వీడ్కోలు చెబుతున్నాను. మీ అందర్నుండీ సెలవు తీసుకునే సమయం ఆసన్నమైంది. కాని నేనెప్పుడూ మీ వాణ్ణే. మీ మధ్యనే

వుంటాను. ఒక సామెతుంది- యుద్ధరంగంలో ఒక్క మనిషి ఏ సాహసాలూ చెయ్యలేడు-అని. అందువలన జెంటిల్మెన్, మహాఘనత వహించిన చక్రవర్తిగారి నుండి నేను తీసుకున్న మెడల్స్, గౌరవాలు, పదోన్నతులు ఇప్పుడు నన్నిక్కడ నిలబెట్టిన ప్రేమకు నిస్సందేహంగా... (ఇక్కడ అతడి గొంతు రుద్ధమైంది) నేను మీకు సదా రుణపడి వుంటాను. మిత్రులారా! (మొహం ఎర్రబడింది, కన్నీరు ధారగా కారింది) మీకివే నా హార్దిక కృతజ్ఞతలు"

ఇక మాట్లాడలేక కొజ్లోవ్స్కీ ఒక్కొక్కర్నీ ఆలింగనం చేసుకున్నాడు. మార్యా తన చేతిరుమాలుతో కళ్లద్దుకుంది. అందరి కళ్లలోనూ నీళ్లు నిండాయి. కొజ్లోవ్స్కీని మొదటిసారిగా చూసిన బట్లర్ కూడా కన్నీటి పర్యంతమైనాడు. అతడికీ వుపన్యాసం బాగా నచ్చింది.

ఆ తర్వాత అనేకమంది టోస్ట్ చేశారు. బార్యాటిన్స్కీ, వొరొంట్సొవ్ మొదలైనవాళ్ల పొగడ్తల వర్షం కురిసింది. క్రమంగా నిషా తలకెక్కింది. వాతావరణం ఆహ్లాదకరంగా వుంది. మధ్యాహ్నపుటెండ నులివెచ్చగా వుంది. కౌగిలింతలు ముగిశాయి. చలిమంటల చుట్టూ పాటలు పాడుతూ నాట్యం చేశారు. బట్లర్ చాలా ఆనందంగా వున్నాడు. ఆఫీసర్లు కొందరు గ్రూపులుగా పేకాట టేబుళ్ల వద్ద చేరారు. ఒక అడ్జుటెంట్(చిరుద్యోగి) వంద రూబుళ్ళతో బ్యాంకు ప్రారంభించాడు. ఈ వాతావరణంలో కాసేపు తచ్చాడి, నిగ్రహించుకోలేక, ఇక జీవితంలో ఎప్పుడూ పేకాట ఆడనని తన అన్నకిచ్చిన మాటను జవదాటి, టేబుల్ వద్ద కూర్చున్నాడు బట్లర్. గంట గడిచిందో లేదో ఒళ్ళంతా చెమట పట్టింది. ఒంట్లో వణుకు ప్రారంభమైంది. బ్యాంకర్ దగ్గర లెక్కలు చూసి ఎంత పోగొట్టుకున్నాడో తెలుసుకోవాలనుకున్నాడు. కాని ఆ ధైర్యం కూడా చెయ్యలేకపోయాడు. చాలా పోయుంటుంది. నెల జీతం అడ్వాన్స్‌గా తీసుకోవడంతోపాటు గుర్రాన్ని అమ్మినా కూడా ఈ బాకీ తీర్చలేడు. వీడు చిరుద్యోగి. బ్యాంకర్ అట. తన పేరు పక్కన ఇంత డబ్బు రాశాడు! కోపంతో మైమరిచిపోయేవాడే. కాని అడ్జుటెంట్ 'ఎంత పోయిందో తెలుసా? ' అని అడిగి కాగితం చూపించాడు. అంత మొత్తం ఉన్నపళంగా ఎక్కడి నుంచి తేగలడు? "ఇప్పుడు కాదు ఇంటికెళ్ళి పంపిస్తాను" అంటూ గొణిగాడు. అందరికీ జాలేసింది. అతడి వైపు చూడలేక తలలు తిప్పుకున్నారు. ఆ క్యాంపులో అది అతడి చివరి సాయంత్రం. ఎందుకాడాడు? వొరొంట్సొవ్ ఇంటికి ఆహ్వానించాడే. వాళ్లింటికెందుకు వెళ్ళలేదు? ఇంత డబ్బు మిగిలేది కదా? ఇంత అవమానం మూట కట్టుకునే వాడు కాదుగదా!

అందరి దగ్గరా సెలవు తీసుకుని, ఇంటికెళ్ళి పద్దెనిమిది గంటలపాటు కదలకుండా పడుకున్నాడు. పెద్ద మొత్తంలో డబ్బు పోగొట్టుకున్నప్పుడు మనుషులు అలాగే నిద్రపోతారు. తన వెంట వచ్చిన కోసక్కుకు యాభై కోపెక్కులివ్వమని అడిగినప్పటి నుండీ దిగాలుగా వున్న అతడి మొహం చూసి, ఏదడిగినా నోరు మెదపకపోవటం వల్లా, ఇలాంటిదేదో జరిగిందని గ్రహించింది మార్యా డిమిత్రియెవ్నా. అతడికి సెలవు ఇచ్చినందుకు పెత్రోవ్ మీద మండిపడింది.

తెల్లవారి మధ్యాహ్నం మెలకువ వచ్చిన తర్వాత మళ్లీ మామూలుగా పనులు చేసుకోవాలనుకున్నాడు గానీ సాధ్యపడలేదు. నాలుగు వందల డెబ్భై రూబుళ్లు బాకీ పడ్డాడు. తన నేరం అంగీకరిస్తూ వూళ్ళో వున్న మిల్లులో తన వాటా కూడా తీసేసు

కుని, చివరిసారి అయిదు వందల రూబుళ్లు పంపమని అన్నకు వుత్తరం రాశాడు. పిల్లికి బిచ్చం వెయ్యని మరో బంధువుకు ఇష్టం వచ్చిన వడ్డీ కట్టుకుని, అయిదు వందలివ్వమని అర్జీ పెట్టుకున్నాడు. మార్యా డిమిట్రియెవ్నా దగ్గర ఎంతో కొంత వుండకపోదు. ఆమె దగ్గర అప్పు తీసుకుని తనకివ్వమని పెట్రోవ్ దగ్గర మొరపెట్టుకున్నాడు.

"నీకివ్వాలనే ఉంది. కాని మార్యా డబ్బుల విషయంలో మహా గట్టిది. చచ్చి గీపెట్టినా ఒక్క రూబుల్ కూడా ఇవ్వదు. ఆడవాళ్లను అర్థం చేసుకోవటం ఎవరి తరం! ఒకసారి ఆలోచించావా, ఆ క్యాంటీన్ మేనేజర్‌గాడు బాగానే సంపాదించాడు. వాణ్ణడిగి చూడు" అని సలహా ఇచ్చాడు పెట్రోవ్.

క్యాంటీన్ మేనేజర్‌ను అడిగినా లాభం లేదు. ఇక తన అన్నయ్యయినా ఇవ్వాలి. లేదా పిసినారి బంధువయినా కరుణించాలి.

★ ★ ★

చెచెన్యాలో అనుకున్నది సాధించకపోవడంతో, టిఫ్లిస్‌కు తిరిగివచ్చి ప్రతి రోజూ వొరొంట్సొవ్ చుట్టూ ప్రదక్షిణలు చేశాడు హాజీమురాద్.

ఎలాగైనా తన వాళ్లను వదిలిపెడితే ఖైదీలను విడుదల చేస్తామని షామిల్‌తో ఒప్పందం కుదుర్చుకోవాలి. కుటుంబమంతా అతడి చెరలో వుండడంతో తన చేతులు కట్టేసినట్లుంది. ఈ పరిస్థితిలో తను రష్యన్లకేమీ సాయం చేయలేడు. షామిల్‌ను అంతమొందించటం తనకు సాధ్యమే కాని అంతకుముందు తనవాళ్ళు విడుదలకావాలి.

"అలాగే, జనరల్ ఆర్గుటిన్‌స్కీ టిఫ్లిస్ వచ్చాక అతడితో సంప్రదించి ఏదో ఒకటి చేస్తాను" అన్నాడు వొరొంట్సొవ్ కాస్త చిరాకుగా.

ట్రాన్స్‌కాకేషియాలోని చెచెన్యా సరిహద్దులో ఉన్న నూఖా గ్రామానికి తనను వెళ్లనివ్వమని అర్థించాడు హాజీమురాద్. అక్కడుంటే తను స్వయంగా షామిల్‌తో మంతనాలు జరపొచ్చు. తన కుటుంబాన్ని విడుదల చేయించటానికి ప్రయత్నించవచ్చు. నూఖా ముస్లిం గ్రామం గనక అక్కడి మసీదులో తను ముస్లిం సంప్రదాయం ప్రకారం ప్రార్థనలు చేసుకోవచ్చు. ఈ విషయంలో అనుమతి కోరుతూ చక్రవర్తికి అర్జీ పంపాడుగాని జవాబు రాకుండానే హాజీమురాద్‌ను నూఖా వెళ్లిపొమ్మని

## కొత్తగాలి...

**నోరు**
**పోరు**
**ఉద్యమ**
**తీరు**

– దాశరెడ్డి చిరంజీవిరావు,
శ్రీకాకుళం

చెప్పాడు వొరొంట్సొవ్.

హాజీమురాద్ గురించి తెలిసిన అధికారులకూ, పీటర్స్‌బర్గ్‌లోని అధికారులకూ, వొరొంట్సొవ్‌కూ, చెచెన్యాతో యుద్ధంలో ఇది తమకు కలిసివచ్చే అంశంలా కనిపించింది. కాని హాజీమురాద్‌కు ఇదొక విపత్పరిణామం. అక్కడి నుండి పారిపోయి రష్యన్ల వైపు రావటానికి ముఖ్య కారణాలు ఆత్మరక్షణా, షామిల్ పట్ల ద్వేషమూ. కష్టనష్టాలకోర్చి చివరికి తన లక్ష్యం నెరవేర్చుకున్నాడు. షామిల్ మీద దాడి చెయ్యటానికి వ్యూహం కూడా సిద్ధం చేసుకున్నాడు. కుటుంబాన్ని కూడా సురక్షిత ప్రాంతానికి తరలించటం సులభమే అను

కుంటున్న దశలో, షామిల్ వాళ్లను చెరప ట్టాడు. ఇప్పుడు వాళ్ళను విడిపించుకో వటమే తన ప్రధాన లక్ష్యమై కూర్చుంది.

ఆడవాళ్ళను వూరికొకర్ని పంపిస్తానం టాడు షామిల్. కొడుకు కళ్లు పీకేస్తాడు. లేదా చంపేస్తాడు. నూఖా వెళ్ళి, దాగెస్తాన్‌లో వున్న తన సమర్థకులతో కలిసి బలప్రయోగం ద్వారానో, మరేదైనా పద్ధతిలోనో తన వాళ్లను విడిపించుకో వాలి. అతణ్ణి దేవుడిగా భావించే అవర్ ప్రజలు, తన కుటుంబాన్ని బలవంతంగా నైనా విడిపించి రష్యన్ సరిహద్దు దాటిం చడానికి వుద్యుక్తులయ్యారని చెప్పాడు హాజీమురాద్‌ను కలిసిన ఒక గూఢచారి. కాని హాజీమురాద్ వైపున్న అవర్ల సంఖ్య స్వల్పం. వెడెనో గ్రామంలో వాళ్లింటిమీద దాడి చెయ్యటం ప్రమాదకరం. అందువల్ల వాళ్లను మరోచోటికి తరలించేటప్పుడు, దారికాసి, వాళ్లను విడిపిస్తారట.

ఈ పని చేసినవాళ్లకు మూడు వేల రూబుళ్లు బహుమానమిస్తానన్నాడు హాజీ మురాద్.

నూఖాలో మసీదు పక్కనే ఉన్న ఓ అయిదు గదుల ఇంటిని హాజీమురాద్‌కు కేటాయించారు. అతడి కదలికల మీద నిఘా పెట్టాల్సిన అధికారులు, దుబాసీ, కొందరు అనుయాయులు ఆ యింట్లో వుంటారు. తన కోసం వచ్చే వాళ్లను కలు సుకోవటం, కొద్దిదూరం స్వారీ చెయ్యటం హాజీమురాద్ దినచర్య.

24 ఏప్రిల్‌నాడు హాజీమురాద్ స్వారీ నుండి తిరిగి వచ్చేసరికి, అధికారి ఒకడు తన కోసం టిఫ్లిస్ నుండి వచ్చాడని తెలి సింది. ఆ సమాచారం తెలుసుకోవాలని ఎంత కోరికగా వున్నా, మొదట తన నమాజు ముగించి అతణ్ణి కలిశాడు.

టిఫ్లిస్ నుండి వచ్చిన అధికారి పేరు, కౌన్సిలర్ కిరిలోవ్. పన్నెండవ తారీఖున హాజీమురాద్ టిఫ్లిస్ వచ్చి జనరల్ అర్గు టిన్స్కి ముందు హాజరు కావాలి అని వొరొంట్సోవ్ ఆదేశం.

"అలాగా?" అని కోపంగా నుదురు చిట్లించాడు హాజీమురాద్.

"డబ్బులు తెచ్చావా?"

"తెచ్చాను" అన్నాడు కిరిలోవ్.

"రెండు వారాల డబ్బులు రావాలి" అంటూ చేతులు చాచాడు హాజీమురాద్.

"ఇస్తున్నాను" అని తన తోలుసంచీ విప్పాడు కిరిలోవ్. "ఇతడికి డబ్బులెం దుకు? ఏం చేసుకుంటాడు?" అని రష్య న్‌లో, ఇతర అధికార్లతో పరాచికాలాడాడు. హాజీమురాద్‌కు రష్యన్ తెలియదనుకున్నా డతను. కాని, కిరిలోవ్ మాటలు అర్థమై, హాజీమురాద్ కోపం మరింత పెరిగింది. సంచీలోంచి డబ్బులు తీస్తూ, అతడితో మాటలు కలపాలని "ఇక్కడ నీకు బోరుకొ ట్టడంలేదా?" అని అడిగాడు కిరిలోవ్. హాజీమురాద్ పెదాలు బిగించి దుబాసీ వైపు చూశాడు. దుబాసీ అదే ప్రశ్న మళ్ళీ అడిగాడు.

"అతడితో నేను మాట్లాడదలచుకోలేదు. డబ్బివ్వమను" అని దుబాసీ వైపు చూసి గర్జించాడు హాజీమురాద్.

డబ్బులు టేబుల్ మీద పోశాడు కిరి లోవ్.

హాజీమురాద్‌కు రోజుకు అయిదు బంగారు నాణాలు అలవెన్సుగా ఇస్తారు. రెండు వారాలకుగాను పదేసి బంగారు నాణాలు ఏడు వరుసల్లో పేర్చాడు కిరి లోవ్.

ఒక్కసారిగా నాణాలన్నీ దగ్గరకు లాక్కుని తన కోటు జేబులో వేసుకుని, కి రిలోవ్ తలమీద మొట్టికాయ వేసి చివా లున లేచాడు హాజీమురాద్.

కల్నల్ హోదాలో ఉన్న తనతో ఇలా ప్రవర్తించటం తగదని హాజీమురాద్‌కు

చెప్పమని దుబాసీతో కోపంగా వూగిపోతూ అరిచాడు కిరిలోవ్. కాని తనేం చేశాడో తనకు తెలుసన్నట్లుగా దుబాసీ మాటలను పట్టించుకోకుండా తన గదిలోకి వెళ్లిపోయాడు హాజీమురాద్.

"ఇలాంటి వాళ్ళనేమీ చెయ్యలేం. కోపం వస్తే బాకు నీ పొట్టలో గుచ్చుతాడు. అనాగరికులు!" అన్నాడు హాజీమురాద్‌కు ఇన్‌ఛార్జిగా వున్న ఒక ఆఫీసర్.

సాయంత్రం చీకటి పడుతున్నప్పుడు, ముసుగులు కప్పుకున్న ఇద్దరు గూఢచారులు వచ్చారు. ఇంటికి కాపలాగా వున్న ఆఫీసర్ వాళ్లను హాజీమురాద్ గదికి తీసుకెళ్ళాడు. వాళ్లు తీసుకొచ్చిన సమాచారం సంతోషకరమైనదేమీ కాదు. కుటుంబాన్ని విడుదల చేయిస్తామని చెప్పిన అతని అనుయాయులు ఇప్పుడాపని చేయటానికి నిరాకరించారు. షామిల్‌ను చూసి భయపడుతున్నారు. హాజీమురాద్‌కు సహాయం అందించిన వాళ్లను చిత్రహింసలు పెట్టి చంపుతానని హెచ్చరించాడతడు. గూఢచార్లు చెప్పిందంతా విని తలపట్టుకున్నాడు హాజీమురాద్.

ఏదో ఒకటి చెయ్యాలి. తీవ్రంగా ఆలోచించాడు. ఇంక మీనమేషాలు లెక్కపెట్టి లాభంలేదు. నిర్ణయం తీసుకుని తక్షణమే అమలు చెయ్యాలి. గూఢచారులకు చెరో బంగారు నాణెం ఇచ్చి వెళ్లిపొమ్మన్నాడు.

ఏం చెయ్యాలి?

దైవనిర్ణయం ఎలా వుంటే అలా జరుగుతుంది.

వార్తాహరులు నిష్క్రమించారు. తివాచీ మీద కూర్చుని మోకాళ్ళు పట్టుకుని, వెనక్కు వాలి దీర్ఘాలోచనలో మునిగాడు హాజీమురాద్.

ఏం చెయ్యాలి? షామిల్ మాటలు నమ్మి తిరిగి వెళ్లాలా? కాని వాడు జిత్తుల మారి. తనను తప్పక మోసం చేస్తాడు. మోసం చెయ్యకపోయినా ఆ నీచుణ్ణి తను భరించలేడు. వాడి ముందు తలొంచలేడు. ఒకసారి తను రష్యన్లవైపు వచ్చాడు గనక వాడు తనను నమ్మే ప్రసక్తి లేదు. ఒక నీతికథ గుర్తుకు వచ్చింది. వేటగాళ్ళకు చిక్కిన ఒక డేగ, కొన్నాళ్ళు వాళ్ళతో గడిపి, తిరిగి కొండల్లో వుంటున్న తన వాళ్ళ దగ్గరకు వచ్చింది. అయితే, ఇప్పుడు దాని కాళ్లకు వేటగాళ్ళు కట్టిన గంటలున్నాయి. అందుకే మిగతా డేగలు దాన్ని దగ్గరకు చేరనీయలేదు. 'నీకు గంటలు కట్టిన వాళ్ల వద్దకే వెళ్లిపో. ఇక్కడుండొద్దు' అన్నాయి నిష్ఠూరంగా. డేగ, తన గూటిలోనే వాటి మధ్యనే వుంటానంది. కాని అవన్నీ కలిసి దాన్ని పొడిచి చంపాయి.

తనవాళ్లు కూడా తననిప్పుడు ఇనుప ముక్కుల్తో పొడిచి చంపుతారు. చెచెన్యాలో తిరుగుబాటును అణచివేసి జార్ చక్రవర్తి మన్నన పొందితే తనకు తిరుగులేదు.

షామిల్‌ను నాశనం చెయ్యటం అసాధ్యమేమీ కాదు. లేకపోతే, వాడే నన్ను నాశనం చేస్తాడు.

నిద్ర రాలేదు. ఎటూ తేల్చుకోలేకపోతున్నాడు. చాలాసేపు ఈ విషయాలే ఆలో

---

### కొత్తగాలి...

**గాయాల్లోంచి గేయాలు**
**శోకాల్లోంచి శ్లోకాలు**
**బాధల్లోంచి భావగీతాలు**
**కష్టాల్లోంచి కన్నీటిరాతలు**

– జె.ఎస్. ఉమాదేవి,
చోడవరం

చిస్తూ గడిపాడు హాజీమురాద్.

అర్ధరాత్రికి నిర్ణయం జరిగిపోయింది. తను వెడెనో గ్రామం వెళ్లి, తన అనుచరుల సహాయంతో బందీలుగా వున్న తన వాళ్లను విడిపించుకోవాలి. ప్రమాదంతో కూడుకున్న పనే. చావు కూడా తప్పకపో వచ్చు. వాళ్లను విడిపించుకుని తిరిగి రష్యన్లవైపు రావాలా లేక కుంజాక్ గ్రామానికి వెళ్లి, బలాలను సమీకరించుకొని షామిల్ మీద యుద్ధం ప్రకటించాలా అన్నది యింకా తేలలేదు. తను తక్షణం రష్యన్ల నుండి తప్పించుకుని వెడెనా వెళ్లటం ముఖ్యం. ప్రణాళిక సిద్ధమైంది.

దిండుకింది నుంచి బనియను తీసుకుని తన మురిద్‌లు పడుకున్న గదిలోకెళ్లాడు. వాళ్లు హాల్లో మరోపక్క వుంటున్నారు. హాల్లో ప్రవేశించగానే చల్లని గాలి మొహాన కొట్టింది. వెన్నెలలో మంచు కురుస్తున్నది. ఈదురుగాలి చెవుల్లో ప్రవేశించింది. తోటల్లో నైటింగేల్ పక్షులు పాడుతున్నాయి.

మురిద్‌ల గది తలుపు తెరిచాడు. లోపల దీపం లేదు గాని మొదటిజాములో వున్న చంద్రుడి వెలుగు కిటికీ లోంచి ప్రవేశించింది. ఒక మూలన టేబుల్, రెండు కుర్చీలున్నాయి. నలుగురు మనుషులు తివాచీ మీద నిద్రపోతున్నారు. ఖనేఫీ, బయట గుర్రాల దగ్గర పడుకున్నాడు. తలుపు తెరిచిన చప్పుడు విని గంజాలో లేచి చూసి మళ్లీ పడుకున్నాడు. ఎల్దార్ బనియన్ తొడుక్కుని, తన నాయకుని ఆజ్ఞకోసం నిరీక్షించాడు. ఖాన్ మహోమా, బాటా గాఢ నిద్రలో వున్నారు. హాజీమురాద్ వెంట తెచ్చిన బనియన్ టేబుల్ మీద పడేశాడు. దానికి బంగారు తీగల అల్లిక వుండటం వల్ల కిందపడినప్పుడు కొద్దిగా చప్పుడైంది.

"ఇవి కూడా బనియన్‌లో కుట్టెయ్యి" అన్నాడు హాజీమురాద్ బంగారు నాణాలు టేబుల్ మీద పోస్తూ. ఎల్దార్ వెన్నెల్లోకెళ్లి బాకుతో బనియన్ కుట్టు విప్పి, రంధ్రం పెద్దది చేశాడు. ఈ చప్పుడుకు గంజాలో లేచి కూర్చున్నాడు.

"గంజాలో, రైఫిళ్లను, పిస్టళ్లను, తూటాలను సిద్ధం చేసి వుంచమని మన వాళ్లకు చెప్పు. రేపే మన ప్రయాణం" అంటూ ఆదేశించాడు హాజీమురాద్.

"ఎప్పుడో రెడీ చేసి వుంచాను" అంటూ మరేదో గొణిగాడు గంజాలో. ఆయుధాలను ఎందుకు లోడ్ చేయమన్నాడో అర్థమైంది. మొదటినుండీ తన కోరిక ఒకటే. వీలైనంతమంది రష్యన్లను పొడిచి చంపి పర్వతప్రాంతాలకు పారిపోవాలి. రోజురోజుకూ ఆ కోరిక పెరుగుతూనే వుంది. ఇన్నాళ్లకు హాజీమురాద్ తన కోరిక తీర్చుకునే అవకాశం కల్పించాడు.

హాజీమురాద్ నిష్క్రమించగానే పడుకున్నవాళ్లందర్నీ లేపి ఆయుధాలపని ప్రారంభించాడు గంజాలో. పాతవాటిని శుభ్రం చెయ్యాలి. పాలిష్ చెయ్యాలి. అవసరమైన మరమ్మతులు చెయ్యాలి. ఖడ్గాలకు, బాకులకు కొవ్వు పట్టించాలి. గ్రీజు పూస్తే పదును పెరుగుతుంది.

తెల్లవారుజామున మళ్లీ అక్కడికి నీళ్ల కోసం వచ్చాడు హాజీమురాద్. నైటింగేల్‌ల గానం మరింత స్పష్టంగా వినిపిస్తున్నది. బాకులకు సానపెడుతున్నారు. సానరాతిమీద కీచుకీచుమన్న శబ్దం లయబద్ధంగా, వీనులవిందుగా వుంది. తొట్టిలోంచి నీళ్లు ముంచుకునిపోతున్న హాజీమురాద్‌కు ఖనేఫీ గొంతు వినిపించింది. అది తనకు తెలిసినపాటే. అయినా మరోసారి వినాలనిపించింది. హంజద్ అనే వీరుడు రష్యన్ల తెల్ల గుర్రాలను బంధించి తీసికెళ్లాడు. వందలాదిమంది రష్యన్ సైనికులు అతణ్ణి వెంబడించి తెరెక్ గ్రామం

దగ్గర చుట్టుముట్టారు. హంజద్ ఆ గుర్రాలను వధించి, తుపాకులలో తూటాలున్నంతవరకు, బెల్టులో బాకులు ఉన్నంతవరకు, ఒంట్లో చివరి నెత్తుటిబొట్టు ఉన్నంతవరకు హోరాహోరీ యుద్ధంచేసి నేలకొరిగిన వైనం వివరిస్తుందాపాట.

ఎగురుతూ వచ్చిన పిట్టల్లారా, పక్షుల్లారా/ ఇళ్లకెళ్లి మా అమ్మలతో, అక్కలతో, చెల్లెళ్లతో/ మాకోసం నిరీక్షిస్తున్న అందాల పడతులతో చెప్పండి.

పవిత్రయుద్ధంలో ప్రాణాలర్పించాం మేం/ సమాధుల్లో ప్రశాంతంగా నిద్రించవు మా శరీరాలు/ తోడేళ్లు మమ్మల్ని పీక్కుతింటాయి/ గద్దలు మమ్మల్ని పొడుచుకు తింటాయి.

చివరి పంక్తుల విషాదానికి 'లా-ఇలా కా-యిల్' అంటూ గొంతు కలిపాడు బాటా. అదో పొలికేకలా విన్పించింది. ఆ తర్వాత క్షణం సేపు భీకర నిశ్శబ్దం ఆవరించింది, నైటింగేల్స్ గొంతులు తప్ప.

పరధ్యానంలో వున్న హాజీమురాద్ చెయ్యి తగిలి జగ్గులోని నీళ్లు వొలికిపోయాయి. చికాకుగా మళ్లీ నీళ్లకోసం వచ్చాడు. కార్యక్రమాల తర్వాత ఆయుధాలు పరీక్షించి, బెడ్ మీద కూర్చున్నాడు. తను వెడెనో వెళ్లాలంటే రష్యన్ ఆఫీసర్ల అనుమతి తప్పనిసరి. కాని యింకా తెల్లవారలేదు. వాళ్లంతా నిద్రలో వుంటారు.

ఖనేఫీ పాట, తన తల్లి పాడిన పాటను గుర్తు చేసింది. ఆ పాటను తనొకసారి లారిస్ మెలికొవ్‌కు వినిపించాడు.

ఎదుట తల్లి కనిపించింది. నెరసిన జుత్తు, ముడతలు పడిన చర్మంతో, పళ్ల మధ్య సందులతో ఉంది. చివరిసారి చూసినప్పుడు ఆమె ఇలాగే వుంది. యవ్వనంలో అందంగా వున్న అమ్మ బొద్దుగా ఉన్న అయిదేళ్ల తనను బుట్టలో ఎత్తుకుని, పర్వతాల్లో మైళ్లకు మైళ్లు నడిచి, పుట్టింటికి తీసుకుపోయింది.

తన బాల్యంతోపాటు తన కొడుకు యూసుఫ్ రూపం కూడా కళ్లముందు మెదిలింది. వాడంటే తనకు ప్రాణం. వాడికి తొలిసారి శిరోముండనం తానే చేశాడు. ఇప్పుడు వాడు యువవీరుడు. మహాశౌర్యశాలి. సెమ్‌లెస్ గ్రామంలో చివరిసారి వాణ్ని చూసినప్పుడెలా వున్నాడో అలాగే వూహించుకున్నాడు. ప్రయాణానికి గుర్రం వాడే సిద్ధం చేశాడు. వెంట వస్తానన్నాడు. రావటానికి అనుమతివ్వమని అర్థించాడు. డ్రెస్ చేసుకుని, ఆయుధం ధరించి సిద్ధంగా నిల్చున్నాడు. సన్నగా, చిరుతలాగా వున్నవాడు తండ్రికన్నా పొడుగుంటాడు. అందమైన మొహం. జీవితంలోని ఆనందమంతా తనదే అన్నట్టు ధీమాగా వుంటాడు. ఆజానుబాహువు. చెంగుచెంగున గెంతినట్టుగా వుంటాయి కదలికలు. వాడిని చూడటానికి రెండు కళ్లూ చాలవు.

"నువ్విక్కడే వుండటం మంచిది. అమ్మనూ, నానమ్మనూ జాగ్రత్తగా చూసుకో" అని హితవు చెప్పాడు తాను.

యూసుఫ్ గర్వంగా తనవైపు చూసి "నా గొంతులో ప్రాణమున్నంతవరకూ వాళ్లకి ఏ ఆపదా రాదు" అన్నాడు.

వాడికళ్లు పీకేస్తానంటున్నాడు షామిల్. ఆ తర్వాత వాడు తన భార్యనేం చేస్తాడో వూహించుకుంటేనే భయం వేస్తుంది.

ఆ ఆలోచనలతో సతమతమై కూర్చోలేక అటూ యిటూ పచార్లు చేశాడు. కుంటుతూనే పరిగెత్తి, ఎల్దార్‌ను పిలిచాడు. ఇంకా తెల్లారలేదు కాని వెలుగొచ్చింది. నైటింగేల్స్ నిర్విరామంగా పాడుతూనే వున్నాయి.

"వెళ్లి, ఆఫీసర్‌కు చెప్పు. నేను గుర్రం మీద పోతాను. త్వరగా జీనువేసి రెడీ చెయ్యి" అని మరో మురిద్‌ను ఆదేశిం

చాడు హాజీమురాద్.




అప్పు తీర్చలేక అవమానభారంతో కుంగిపోయిన బట్లర్ వీరగాథలూ, యుద్ధ కవిత్వం చదివి కాలక్షేపం చేశాడు. హాజీ మురాద్‌లాగ సర్కేషియన్ కోటు తొడుక్కుని మురిసిపోయాడు. శత్రువుల వేటకు రెండుసార్లు బొగ్దానొవిచ్‌తో కలిసి వెళ్లాడు గాని, ఎవరూ కనిపించలేదు. బొగ్దానొవిచ్ ధైర్యశాలి. గొప్ప వీరుడు. అలాంటివాడితో కలసి తిరగటంవల్ల తనకూ ధైర్యం పెరిగినట్టనిపించింది. ఒక యూదుమనిషి దగ్గర అత్యధిక వడ్డీకి డబ్బులు తీసుకుని అప్పుతీర్చాడు. అంటే అతడు తన సమస్యను తీర్చుకోలేదు. కేవలం వాయిదా వేసుకున్నాడు. కవిత్వం సరిపోక మద్యంలో కూడా మనశ్శాంతి వెదుక్కున్నాడు. తాగుడెక్కువైనకొద్దీ బలహీనత కూడా పెరిగింది- నైతికంగా. మార్యా డిమిత్రియెవ్నా పట్ల ఇప్పుడతని చూపుల అర్థం మారింది. ఆమెతో వ్యవహారం పెట్టుకోవాలనుకున్నాడు. కాని ఆమె పరుషంగా మాట్లాడి తిరస్కరించింది. ఇది మరో అవమానం.

ఏప్రిల్ చివరలో బార్యాటిన్స్కీ పంపిన సైన్యం దుర్గం చేరుకుంది. చెచెన్యామీద దాడికి సన్నాహాలు ప్రారంభమయ్యాయి. అప్పటి దాకా సాధ్యం కాదనుకున్నది యిప్పుడు ఆచరణలో పెట్టబోతున్నారు. సైన్యంలో రెండు కంపెనీల కబార్దా రెజిమెంట్లున్నాయి. కాకేసియన్ సంప్రదాయం ప్రకారం కురిన్ కంపెనీలు వాళ్లకు అతిథి మర్యాదలు చేశాయి. బారక్స్‌లో బసచేసిన సైనికులకు బక్‌వీట్ పాయసం, బీఫ్ మాత్రమే గాక వొడ్కా కూడా సప్లై చేశారు. కురిన్ ఆఫీసర్లతో కలిసి వున్నారు గనక భోజనంతో పాటు పాటలు, నాట్యాలు, తాగుడు పోటీలతో మజా చేశారు. మందెక్కువైన పెత్రోవ్ ఖడ్గం దూసి ఊహాశత్రువులను సంహరించాడు. ఒకసారి బూతులంకించుకుంటాడు. ఒకసారి పడిపడి నవ్వుతాడు. ఒకసారి ఎవరినో కౌగిలించుకోబోతాడు. మరోసారి డాన్సు స్టెప్పులు వేయటానికి ప్రయత్నిస్తాడు.

బట్లర్ కూడా అక్కడే వున్నాడు. ఈ ప్రహసనంలో అతడికి యుద్ధకవిత్వం కనిపించింది. కాని పెత్రోవ్ స్థితి చూసి జాలేసింది. ఇప్పుడు అతణ్ణి ఆపటం అసాధ్యం. అసలు విషయమేమిటంటే తనకు కూడా తల తిరుగుతున్నట్టుగా వుంది. నెమ్మదిగా యింటివైపు కదిలాడు.

తెల్లటి యిళ్లగోడల మీదా, రాళ్లమీదా మెరిసింది వెన్నెల. ఆ వెలుగులో ప్రతి గులకరాయీ, ప్రతి గడ్డిపోచా, దుమ్మూధూళీ కూడా స్పష్టంగా కనిపించాయి. ఇంటికి సమీపంలో మార్యా డిమిత్రియెవ్నా ఎదురొచ్చింది. భుజాల మీద శాలువా కప్పుకుంది. 'ప్రేమ' పరాభవం తర్వాత ఆమె కనిపిస్తే తప్పుకునిపోవటం అలవాటు చేసుకున్నాడు బట్లర్. అలా చేసినందుకు తనకే సిగ్గుగా వుంది. కాని ఈ వెన్నెల వెలుగులో మందిచ్చిన ధైర్యంతో ఆమెతో రాజీ కుదుర్చుకోవచ్చని అనుకున్నాడు.

"ఎక్కడికి బయల్దేరావు? "

"ఇంకెక్కడికి.. మా ఆయన కోసం"

అందామె సరదాగా.
అతడి పట్ల ఆమెకేమాత్రం ప్రేమభావనా లేదు. ఆనాడు నిజంగానే కోపం వచ్చి తిట్టింది. కాని అతడు తనను చూసి దూరంగా పోవటం ఆమెకు నచ్చలేదు.
"ఎందుకు వెదుకుతావు? వస్తాడులే"
"వస్తాడంటావా? "
"అతడు రాలేని పరిస్థితిలో వాళ్లు తీసుకొస్తారు"
"తప్పుగదా. అతడు ఇలా పాడైపోతుంటే చూస్తూ వూరుకోనా? "
"ఏం ఫరవాలేదు. ఇంటికి పద"
వెనుదిరిగి అతనితో కలిసి నడిచింది మార్యా డిమిత్రియెవ్నా. వెన్నెల ఎంత ప్రకాశమంతంగా వుందంటే నేల మీది వాళ్ల తలల నీడల చుట్టూ ఏదో కాంతి పుంజం వున్నట్టనిపించింది. ఆమె పట్ల తనకు గౌరవముందని, అన్యథా భావించవద్దని చెప్పి రాజీ కుదుర్చుకోవాలనుకున్నాడు బట్లర్. కాని ఎలా ప్రారంభించాలో అర్థం కాలేదు. అతడేం చెబుతాడో విందామని ఆమె నిరీక్షించింది. ఇద్దరూ నిశ్శబ్దంగా యింటి దాకా నడిచారు. అప్పుడు వీధి సందులో కొందరు అశ్వికులు కనిపించారు. ఒక ఆఫీసరుకు ఎస్కార్ట్‌గా వస్తున్నారు వాళ్లు.
"ఎవరు వాళ్లు? " అంది మార్యా డిమిత్రియెవ్నా పక్కకు తొలుగుతూ. వెన్నెల వాళ్ల వెనక వైపుండటంతో బాగా దగ్గిరకొచ్చిందాకా మొహాలు కనిపించలేదు. ఆ ఆఫీసర్ పేరు కామెనెవ్. ఇదివరలో పెత్రోవ్ వద్ద పనిచేశాడు. మార్యా డిమిత్రియెవ్నాకు తెలుసతడు.
చేరువగా రాగానే "నువ్వా కామెనెవ్!" అంది.
"ఆం నేనే" అని బట్లర్ వైపు చూస్తూ "ఎలా వున్నావు? ఇద్దరూ కలిసి వాకింగ్ చేస్తున్నారా? పెత్రోవ్ ఎక్కడున్నాడు? అర్జెంట్..." అన్నాడు కామెనెవ్.
"అక్కడ" అంటూ పాటలు విన వస్తున్న వైపు చూపించాడు బట్లర్. మార్యా డిమిత్రియెవ్నా "అక్కడ పార్టీ నడుస్తున్నది" అని చెప్పింది.
"భలే! మీరిద్దరూ యిక్కడ పార్టీ చేసుకుంటున్నారా? "
"లేదు. కబార్డా రెజిమెంట్ వాళ్లు వచ్చారు. వాళ్ల కోసమే పార్టీ"
"గుడ్! నేను కూడా జాయిన్ అవుతాను. ఒక నిమిషం పెత్రోవ్‌తో మాట్లాడాలి"
"అధికారిక వ్యవహారమా? "
"ఆం ఇంచుమించు అలాంటిదే"
"మంచా, చెడా? "
"కొందరికి మంచి, కొందరికి చెడు" అని నవ్వాడు కామెనెవ్.
అందరూ యింటికి చేరుకున్నారు.
"చికిరెవ్, ఇలా రా" అంటూ ఓ కోసక్కును పిలిచాడు కామెనెవ్.
ఒక అశ్వికుడు ముందుకొచ్చాడు. డాన్ కోసక్కు యూనిఫాంలో వున్నాడు. జీనుకో గోతాము వెళ్లాడుతోంది.
"దాన్ని దించుకో" అని తాను గుర్రం దిగి, గోతాము వైపు వేలు చూపించాడు కామెనెవ్.
కోసక్కు దిగి, గోతాము చేతిలో పట్టుకున్నాడు. కామెనెవ్ ముడివిప్పి గోతాములో చెయ్యి పెట్టాడు.
"మిమ్మల్ని సర్ప్రైజ్ చెయ్యాలనుకుంటున్నాను. ఓ అరుదైన కానుక తీసుకొచ్చాను. భయపడవు గదా? "
"నేనెందుకు భయపడతాను? " అంది మార్యా డిమిత్రియెవ్నా.
"ఇదిగో, చూడు" అంటూ గోతాంలోంచి ఓ మనిషి తల పైకి తీశాడు కామెనెవ్. వెన్నెల్లో అది కూడా మెరిసింది.
"గుర్తు పట్టగలవా? "

శిరోముండనం చేసిన తల అది. చిన్న గడ్డం, మీసాలు. ఒక కన్ను తెరచి వుంది. మరొకటి మూసుకుపోయి వుంది. తల మీద గాటు ఉంది. ముక్కు దగ్గర నెత్తురు గడ్డ కట్టింది. నెతుటిలో తడిసిన గుడ్డలో చుట్టి వుంది మెడ. మొహం మీద గాయాలున్నా, పెదాల మీద చంటి పిల్లల చిరునవ్వుంది.

మార్యా చివాలున తల తిప్పుకుని, మాట్లాడకుండా గబగబా యింట్లోకి నడిచిపోయింది.

ఆ తల నుండి దృష్టి కదల్చలేకపోయాడు బట్లర్. అది హాజీమురాద్ తల. అనేక రోజుల పాటు కబుర్లు చెప్పి, ఎన్నో అనుభవాలు పంచుకున్న మిత్రుడి తల.

"ఎలా జరిగింది ఇది? ఎవరు చంపారు? " అడిగాడు.

"మనకళ్లు గప్పి పారిపోవాలనుకున్నాడు. కాని, మేం పట్టుకున్నాం" అంటూ, తలను కోసక్కుకు తిరిగిచ్చాడు కామెనెవ్.

ఇద్దరూ యింట్లోకి నడిచారు.

"హీరోలా మరణించాడు"

"ఎలా జరిగింది ఇంతకూ? "

"ఒక్కక్షణం ఓపికపట్టు. పెట్రోవ్ రానీ. అంతా సవివరంగా చెబుతాను. అసలు నేనిక్కడికి వచ్చిందే అందుకు. అన్ని దుర్గాలకూ, అన్ని గ్రామాలకూ దీన్ని తీసుకెళ్లి ప్రదర్శించాలి"

కొందరు సైనికులు వెళ్లి పెట్రోవ్‌ని వెంటబెట్టుకు వచ్చారు. ఇంకా మత్తు దిగలేదు. చూడగానే కామెనెవ్‌ను కావలించుకున్నాడు.

"నేను హాజీమురాద్ తల తీసుకొచ్చాను" అన్నాడు కామెనెవ్.

"చంపారా? "

"పారిపోవటానికి ప్రయత్నించాడు"

"అలాంటిదేదో చేస్తాడని నాకు తెలుసు. ఇంతకూ తల ఏది? ఒకసారి చూడనీ"

కోసక్కు మళ్లీ గోతంలోంచి తీశాడు తల. కళ్లు మూతలు పడుతున్నా, చాలా సేపు చూశాడు పెట్రోవ్.

"ఏదో జరిగిపోయింది గాని మనిషి మంచివాడు. గుడ్ ఫెల్లో. ఒకసారి ముద్దాడనీ"

"ఇది వీరుని తల" అన్నారు ఆఫీసర్లు.

తలను కోసక్కుకు తిరిగిచ్చారు. నేలకు తగిలితే గాయమవుతుందేమోనన్నట్టుగా, జాగ్రత్తగా గోతంలో పెట్టాడతడు.

"కామెనెవ్, నీకు తెలిసిందంతా చెప్పు" అని అడిగాడో ఆఫీసర్.

## కొత్తగాలి...

**అందరూ**
**ఆహ్వానితులే!**
**కొందరికే**
**కుర్చీలు!!**

– మంద రిత్విక్,
హైదరాబాద్

"అతడు నాకు ఖడ్గం బహుమతిగా యిచ్చాడు" అన్నాడు పెట్రోవ్.

వసారాలోకి వెళ్లాడు బట్లర్.

రెండోమెట్టు మీద కూర్చుంది మార్యా డిమిత్రియెవ్నా. అడుగుల చప్పుడు విని, కోపంగా తలతిప్పి చూసింది.

"ఎందుకలా వున్నావు మార్యా డిమిత్రియెవ్నా? "

"మీరంతా మిత్రద్రోహులు. విశ్వాస ఘాతకులు. కట్ థ్రోట్స్. నమ్మించి గొంతు కోస్తారు. దుర్మార్గులు"

"ఇది యుద్ధం. ఎవరికైనా యిలా జరగొచ్చు" అన్నాడు బట్లర్.

"యుద్ధం! యుద్ధంలో నీతి వుండదా?

ధర్మం వుండదా? మృతదేహాన్ని భూమిలో సమాధి చెయ్యాలి. వాళ్లేమో దాన్ని ఊరూరా ప్రదర్శనకు పెడతారట" అంటూ గబగబా నడిచి లోపలికెళ్లి తలుపేసుకొంది.

గదిలోకి తిరిగి వచ్చి అసలేం జరిగిందో చెప్పమని కామెనెవ్‌ను అడిగాడు బట్లర్.

అంతా పూసగుచ్చినట్టు చెప్పాడు కామెనెవ్.

ఏం జరిగిందంటే...

★ ★ ★

ఊళ్లో మాత్రమే స్వారీ చెయ్యటానికి హాజీమురాద్‌కు అనుమతి ఉంది. అది కూడా కోసక్కు సైనికులు తనను అనుసరించినప్పుడు మాత్రమే. ఆ సమయంలో నూఖాలో ఉండవలసినదాంట్లో సగం సైన్యం మాత్రమే ఉంది. అందులో పది మందిని ఆఫీసర్ల కోసం కేటాయించారు. అందువల్ల హాజీమురాద్‌ను అనుసరించటానికి అయిదుగురు మాత్రమే సిద్ధంగా ఉన్నారు. వెంట తన అనుచరులందర్నీ తీసుకొని స్వారీకి రావద్దని హాజీమురాద్‌కు సూచించారు. కాని ఏప్రిల్ 25నాడు మొత్తం ఐదుగుర్నీ తీసుకొని బయల్దేరాడు హాజీమురాద్. ఇది గమనించి అంతమందిని వెంటతెచ్చుకోవటానికి అనుమతి లేదని సూచించాడు కమాండర్. కాని అతడు ఆ మాటలు వినిపించనట్టుగా తన గుర్రాన్ని అదిలించాడు. కమాండర్ కూడా పెద్దగా పట్టించుకోలేదు.

కోసక్కు సైనికుల వెంట ఒక నాన్ కమిషన్డ్ ఆఫీసర్ నజారోవ్ కూడా ఉన్నాడు. ధైర్యసాహసాలకుగాను అతడికి ఇటీవలే మెడల్ వచ్చింది. ఆరోగ్యంగా, అప్పుడే విరిసిన గులాబీలా ఉన్నాడు కుర్రాడు. పేద కుటుంబం. తండ్రి లేడు, అన్నదమ్ములందర్లోకీ పెద్దవాడతడు. తల్లీ, ముగ్గురు చెల్లెళ్లూ, ఇద్దరు తమ్ముళ్లూ ఉన్నారు.

"జాగ్రత్త! నజారోవ్! అతణ్ణి ఫాలో అవ్వాలి" అని ఆదేశించాడు కమాండర్.

"అలాగే, సర్" అంటూ గుర్రాన్ని పరిగెత్తించాడు నజారోవ్. మరో నలుగురు కోసక్కు సైనికులు అతని వెంట కదిలారు. అందులో ఒకడు ఫెరాపొంటొవ్. సన్నగా పొడుగ్గా ఉంటాడు. దొంగ. గంజాలోకు గన్‌పౌడర్ అమ్మింది అతడే. మరొకడు ఇగ్నాటొవ్. బలంగా ఉంటాడు, సీనియర్. కొన్నాళ్లలో సర్వీస్‌నుండి రిటైర్ అవుతాడు. ఇంకొకడు మిష్కిన్. బలహీనంగా కనిపిస్తాడు. అందరూ వాణ్ణి చూసి నవ్వుతారు. చివరివాడు పెట్రాకోవ్. తల్లికి ఒక్కడే కొడుకు. సరదాగా ఉంటాడు.

ఉదయం మంచు కురిసింది. కాని ఇప్పుడు బాగా ఎండ కాస్తున్నది. పచ్చగా మెరిసే చెట్టూచేమా, గడ్డి, మొక్కజొన్న, గలగలా ప్రవహించే నది- అది ఆహ్లాదకరమైన వాతావరణం.

హాజీమురాద్ గుర్రం నెమ్మదిగా కదిలింది. కోసక్కు సైనికులు, అతడి మనుషులు కూడా హాజీమురాద్‌ను వెంబడించారు. కోట దాటి మరింత ముందుకు నడిచాయి గుర్రాలు. బుట్టలు నెత్తికెత్తుకున్న మహిళలూ, బళ్లు తోలుతున్న సైనికులూ కనిపించారు. ఒకటిన్నర మైలు తర్వాత హాజీమురాద్ తన కబార్డా అశ్వాన్ని నెమ్మదిగా అదిలించటంతో అది దౌడు తీసింది. కోసక్కులు, అతడి మనుషులు కూడా తమ గుర్రాలను పరుగెత్తించారు.

"గుర్రమంటే అలా ఉండాలి. ఎంత అందంగా దౌడు తీస్తున్నదో. అతడు నా శత్రువైతే అతడ్ని చంపి ఆ గుర్రాన్ని స్వాధీనం చేసుకొనేవాణ్ణి" అన్నాడు ఫెరాపొంటొవ్.

"టిఫ్లిస్‌లో దానికి వంద రూబుళ్లు ఇస్తామన్నారు"

"అతణ్ణి నేను అందుకోగలను" అన్నాడు నజారొవ్.

వేగం పెంచాడు హాజీమురాద్.

"ఆగు భాయ్, వేగం తగ్గించు, నెమ్మదిగా పోనీ" అంటూ అరిచాడు నజారొవ్.

వెనక్కు తిరిగి చూసి, ఆగకుండా ముందుకు కదిలాడు హాజీమురాద్.

"దుర్మార్గులు. మనకళ్లు గప్పి పోవాలనుకుంటున్నారు. చూడు, గుర్రాలను ఎలా పరిగెత్తిస్తున్నారో" అన్నాడు ఇగ్నాటొవ్.

పర్వతాల దిశగా కదిలాయి గుర్రాలు.

"ఆగు, అది పద్ధతి కాదు" అంటూ మళ్లీ అరిచాడు నజారొవ్.

జవాబివ్వకుండా వేగం మరింత పెంచాడు హాజీమురాద్.

"దొంగా, నువ్వెక్కడికి పోతావురా!" అంటూ గుర్రాన్ని దౌడు తీయించాడు నజారొవ్. కొరడాతో ఒక్క దెబ్బ వేయటంతో అది గాలిలో ఎగిరినట్టుగా కదిలింది.

ఆకాశం నిర్మలంగా ఉంది. చల్లటి స్వచ్ఛమైన గాలి వీస్తున్నది. నజారొవ్‌కు కూడా ఆనందంగా ఉంది. గుర్రం, తాను కలిసిపోయినట్టుగా హాజీమురాద్‌ను వెంబడించాడు. ఆరోజు ఏదైనా ప్రమాదం ముంచుకొస్తుందేమోనన్న ఊహ కూడా అతడికి రాలేదు. అతడి గుర్రం హాజీమురాద్‌కు మరింత చేరువయింది.

వెనక నుండి గిట్టల చప్పుడు వినిపించి, తనను వాళ్లు సమీపించారని తెలుసుకున్నాడు హాజీమురాద్. కుడి చేతిలో పిస్టల్ పట్టుకుని ఎడమచేత్తో కళ్లెం లాగాడు.

"వేగం తగ్గించు" అంటూ అరిచాడు నజారొవ్. ఇంచుమించూ ఇద్దరూ పక్కపక్కనే పరిగెత్తుతున్నారు. హాజీమురాద్ గుర్రం కళ్లెం ఒకచేత్తో అందుకోవటానికి

ప్రయత్నించాడు నజారొవ్. అతడు చెయ్యి చాచాడో లేదో పిస్టల్ పేలింది.

"ఏం చేస్తున్నావ్!" అంటూ అరిచాడు నజారోవ్. గుండె పట్టుకుని మరుక్షణమే పట్టు తప్పి కింద పడిపోయాడు.

అదే సంకేతంగా సైనికుల మీద కాల్పులు జరిపారు హాజీమురాద్ మనుషులు. దగ్గరగా వచ్చినవాళ్ల మీద కత్తులు ఝళిపించారు.

పరిగెత్తుతున్న గుర్రంమెడను పట్టుకుని వేళ్లాడాడు నజారొవ్. గుర్రం కిందపడి ఇగ్నాటొవ్ కాలు విరిగింది. హాజీమురాద్ మనుషులు సైనికుల్ని విచక్షణారహితంగా గాయపరిచారు. పెట్రొకొవ్ తన కామ్రేడ్లను రక్షించటానికి ప్రయత్నించాడుగాని, అప్పుడే వీపు, పక్కటెముకల్లోనూ రెండు తూటాలు దూసుకుపోయాయి. ఏం జరిగిందో తెలుసుకునేలోపే కూలిపోయాడు.

వెనుదిరిగి దుర్గం వైపు పరుగు తీశాడు మిష్కిన్. ఖనేఫీ, బాటా అతణ్ణి వెంబడించారు. కాని అప్పటికే అతడు వాళ్ల అందుకోలేనంత దూరం వెళ్లిపోయాడు.

నేలమీద వెల్లకిలా పడున్నాడు పెట్రొకొవ్. పొట్ట చీలింది. ఆకాశంవైపు చూస్తూ చివరి క్షణాల్లో, శ్వాసకోసం చేపలా కొట్టుకున్నాడు.

ఇగ్నాటొవ్‌ను సంహరించి, మరొక్క వేటుతో నజారొవ్‌ను కూడా నేలకూల్చాడు హాజీమురాద్. మరణించిన వాళ్ల నుండి తూటాలు సేకరించాడు బాటా. నజారొవ్ గుర్రం తీసుకోవాలనుకున్నాడు ఖనేఫీ, కాని హాజీమురాద్ అతణ్ణి వారించాడు. అందరూ పర్వతాలవైపు దౌడు తీశారు. వెంట వచ్చిన నజారొవ్ గుర్రాన్ని అతి కష్టం మీద వెనక్కి పంపించారు. కాస్త దూరంలో వరిచేలు వారికి స్వాగతం పలికాయి. నూఖా నుండి ఆరుమైళ్లు వచ్చారు.

హాజీమురాద్ తప్పించుకుని పారిపోయినట్టుగా నూఖాలో అలారం మోగింది.

★ ★ ★

"ఎందుకిలా జరిగింది? వాడెందుకిలా చేశాడు?" అంటూ తలపట్టుకున్నాడు కమాండర్.

మిష్కిన్ చెప్పిందంతా విని "వాణ్ణి పారిపోనిచ్చాం. దుర్మార్గులు, నమ్మకద్రోహులు" అంటూ తనను తాను తిట్టుకున్నాడు.

అలారం మోగటంతో కోసక్కులు మాత్రమేకాక, రష్యన్లకు అనుకూలంగా ఉన్న గ్రామాలనుండి సాయుధులందరూ హాజీమురాద్‌కోసం వేటలో పాల్గొన్నారు. అతణ్ణి 'అలైవ్ ఆర్ డెడ్' పట్టుకున్నవాళ్లకు వెయ్యి రూబుళ్ల బహుమతి ప్రకటించారు. అతడు పారిపోయాడని తెలిసిన రెండు గంటల్లో రెండు వందల మంది అశ్వికులు, ఒక ఆఫీసర్ నాయకత్వంలో ఎక్కడున్నా సరే, పట్టుకోవాలని వెదకటానికి బయల్దేరారు.

కొన్ని మైళ్ల తర్వాత గుర్రం రొప్పుతుండటం గమనించి ఆగాడు హాజీమురాద్. అలసటతో చెమట పట్టింది.

తూర్పున ఉన్నది బెనెల్డ్‌జిక్ గ్రామం. అక్కడి ఇళ్లూ, మినారులూ స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఎడమవైపున పొలాలు. వాటికి ఆవల నది. పర్వతాలను చేరుకోవాలంటే తూర్పుగా ప్రయాణించాలి. కాని తనను వెంబడిస్తున్నవాళ్లు ఎట్లాగూ అటే పోతారు గనక పడమటి వైపు మళ్లాడు హాజీమురాద్. అతడీ దిశగా పయనిస్తాడని ఎవరూ ఊహించే అవకాశమే లేదు. ఇలా వెళ్లినా నది దాటి, అరణ్యాలను దాటి పర్వతాలను చేరుకోవచ్చు.

కాని కొద్దిదూరం వెళ్లాడో లేదో, నది దాకా పోవటమే అసాధ్యమనిపించింది. బురద పట్టిన పొలాల్లో, గుర్రాలు అడుగు తీసి అడుగు వెయ్యలేకపోయాయి. గట్టి నేల ఎక్కడా కనిపించలేదు. ఎటు

చూసినా నీరూ, బురద మాత్రమే వ్యాపించిన పొలాలు. గుర్రాల కాళ్లు దిగబడి ఎంత ప్రయత్నించినా పైకి రాలేదు. అసలే అలిసిన గుర్రాలు ఇక కదలవేమోననిపించింది. చీకటి పడింది. ఈ పొలాలు దాటేదెప్పుడు? నదిని చేరేదెప్పుడు? మరింత ఎడమవైపు దుబ్బులు పెరిగిన నేల చూసి అటుగా కదలటానికి ప్రయత్నించారు. అతి ప్రయత్నం మీద ఒక్కొక్క అంగుళమే కదలాలి. ఆకలేసింది. కొందరు రొట్టెలూ, వెన్న తిన్నారు.

వెన్నెల వచ్చింది గాని చంద్రుడు కొండ వెనక్కు వెళ్లిపోవటంతో మళ్లీ చీకటి అలముకొంది. అడవిలో నైటింగేల్ ల గుంపులు సంగీత కచేరీ ప్రారంభించాయి. పక్కనున్న పొదల్లో దాగిన మరో రెండు నైటింగేల్స్ విడిగా పాటందుకున్నాయి. హాజీమురాద్ మనుషులు కదిలినంత సేపూ అవి నిశ్శబ్దంగా ఉంటాయి. వాళ్లు విశ్రమిస్తే అవి గానం ప్రారంభిస్తాయి.

ప్రతి చిన్న శబ్దాన్ని వినగల హాజీమురాద్ పక్షుల గానాన్ని శ్రద్ధగా ఆలకించాడు. హంజద్ గాథ గుర్తుకువచ్చింది. 'తన జీవితమూ అలాగే ముగుస్తుందేమో' అనుకున్నాడు. త్వరగా ప్రార్థనలు ముగించాడు. సమీపిస్తున్న గుర్రాల డెక్కల చప్పుడు వినిపించింది. ఒకటి కాదు, రెండు కాదు. అది అశ్విక సైన్యం.

కాస్త దూరంగా వెళ్లి మునివేళ్ల మీద నిలబడి చూశాడు బాటా. చీకట్లో కదులుతున్న నీడలు కనిపించాయి. కొందరు నడుస్తున్నారు. కొందరు గుర్రాల మీద వస్తున్నారు. మరోవైపు నుండి కూడా సైనికులు కదిలివస్తున్నట్టుగా గుర్తించాడు ఖనేఫీ. వాళ్లకు నాయకుడు కర్గానోవ్. ఆ ప్రాంత మిలిటరీ కమాండర్.

'హంజద్‌లాగే యుద్ధం చేస్తాం' అనుకున్నాడు హాజీమురాద్.

అలారం తర్వాత, తన సైన్యంతో, కోసక్కులతో కలసి హాజీమురాద్ వేటకు బయల్దేరాడు కర్గానోవ్. కాని అతడి జాడ దొరకలేదు. ఇక ఆశ వదులుకుని, తిరిగి ఇంటి ముఖం పట్టినప్పుడు ఒక వృద్ధుడు కనిపించి, తను ఆరుగురు అశ్వికులను వరి పొలాల్లో చూశానని చెప్పాడు. అలా కర్గానోవ్ మళ్లీ వేట ప్రారంభించాడు. సహాయంగా ఉంటాడని వృద్ధుణ్ణి కూడా వెంట రమ్మన్నాడు. గుర్రాలు కనిపించటంతో, హాజీమురాద్ బృందం కూడా అక్కడే ఎక్కడో ఉండక తప్పదని రూఢీ చేసుకు

## మే - 2013
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.

1. **టి. ఆర్. బాలకృష్ణారావు**
   - ప్రకాశంనగర్, రాజమండ్రి
2. **రశీద్ శిక్షక్**
   - సిరిసిల్ల, కరీంనగర్ జిల్లా
3. **అరుణరేఖ**
   - ఎల్. జి. హళ్లి, బెంగళూరు
4. **బుద్ధకవి రాధ**
   - కమలానగర్, కర్నూలు
5. **కె. విజయనాగరాజ్**
   - ఎగ్మూర్, చెన్నై

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. వాసు | 6. ఐ.పి.ఎస్. |
| 2. బోసు | 7. 2011 |
| 3. ఆంజనేయులు | 8. అకృత్ జస్వాల్ |
| 4. అరుణ | 9. థింగ్స్ ఫాల్ అపార్ట్ |
| 5. అమెరికా | 10. అమెరికా |

న్నారు. చీకటిలో వాళ్లను చుట్టుముట్టి, తెల్లవారిందాకా నిరీక్షించారు- 'అలైవ్ ఆర్ డెడ్'గా పట్టుకోవటానికి.

తాము సైన్యం వలయంలో ఉన్నామని తెలుసుకున్నాడు హాజీమురాద్. ఇక చిన్న చిన్న చెట్లూ, దుబ్బులే తమకు రక్షణ. వీలైనంతసేపు వాళ్ల కంటపడకుండా నక్కి, బుల్లెట్లు ఉన్నంతసేపూ పోరాడాలి. ఇదే విషయం తన కామ్రేడ్స్‌కి స్పష్టం చేశాడు. సైన్యం కాస్త ఎత్తులో ఒకదిబ్బపై ఉన్నది. తాము గోతిలో ఉన్నారు. బాకులతో మట్టి తవ్వి ఒక అగడ్త నిర్మించుకున్నారు.

తూర్పున నెమ్మదిగా వెలుగొచ్చింది.

### కొత్తగాలి...

గాలి కలుషితం
నీరు కలుషితం
కూడు కలుషితం
చివరకు మనిషి కల్మషం

– భానుమూర్తి,
హైదరాబాద్

కమాండర్ అరిచాడు

"హాజీమురాద్, లొంగిపో. మాది సైన్యం, మీరు కొద్దిమంది"

జవాబుగా ఒక తుపాకీ పేలింది. గోతి లోంచి తెల్లటి పొగమబ్బు లేచింది. బులెట్ ఒక సైనికుడి గుర్రానికి తగిలింది. మరి కాసేపట్లో చతికిలబడింది గుర్రం. సైనికులు గోతిలోకి పేల్చారు తుపాకులు, కొమ్మలు, ఆకులు అల్లల్లాడాయిగాని, మనుషులు క్షేమంగానే ఉన్నారు. దారి తప్పిన గంజాలో గుర్రానికి తలలో తగిలింది బుల్లెట్. అది వెంటనే కింద పడలేదు. నెత్తురు కారగా అటూఇటూ పరుగెత్తి ఇతర గుర్రాలను హడలెత్తించింది. పచ్చ గడ్డి మీద ఎర్రటి నెత్తురు ప్రవహించింది. సైనికులు దగ్గరగా వచ్చినప్పుడు మాత్రమే కాల్చారు హాజీమురాద్ మనుషులు. ఎప్పుడూ గురి తప్పలేదు. ముగ్గురు సైనికులు గాయపడ్డారు. శత్రువును చుట్టుముట్టడానికి బదులు వెనక్కి తగ్గి కాల్పులు జరిపారు వాళ్లు.

గంటసేపలా గడిచింది. చెట్ల మీద సగం దాకా ఎండ పడింది. తన గుర్రం మీదికి ఎగిరి కూర్చుని నదివైపు దౌడు తీయగలనా? అని ఆలోచించాడు హాజీమురాద్. గుర్రాల, మనుషుల గోల పెరిగింది. అంటే అదనపు బలగాలు వచ్చాయన్నమాట. ఆ వచ్చిన వాళ్లలో మెక్‌తులికి చెందిన హాజిఆగా, అతని సైనికులు కూడా ఉన్నారు. వీరి సంఖ్య రెండువందలు. ఒకప్పుడు హాజీఆగా, హాజీమురాద్‌కు అత్యంత సన్నిహితుడు. ఒకర్నొకరు అన్నా అని పిలుచుకున్నారు. పర్వతాల్లో అన్యోన్యంగా కలిసి బతికారు. కాని తరువాత రోజుల్లో హాజీఆగా రష్యన్లవైపు వెళ్లాడు. అతడు అహ్మద్‌ఖాన్ (హాజీమురాద్ పాత శత్రువు) కుమారుడు.

కర్గానోవ్‌తోపాటు, హాజీఆగా కూడా హాజీమురాద్‌ను లొంగిపొమ్మన్నాడు. ఈసారి కూడా హాజీమురాద్ తుపాకీతోనే సమాధానం చెప్పాడు.

"ఖడ్గాలు తీయండి" అంటూ తన వాళ్లను ఆదేశించాడు హాజీఆగా. వంద మంది భీకరంగా అరుస్తూ దుబ్బుల్ని ఎడాపెడా నరికారు.

తుపాకులు పేలాయి. ముగ్గురు సైనికులు నేలకొరిగారు. మిగతా వాళ్లు గుళ్ళ వర్షం కురిపిస్తూ గోతిని సమీపించారు. ఎవరికి గురిపెట్టాలో వాళ్లకు తెలియదు. కాని హాజీమురాద్ గురి తప్పలేదు. గంజాలో కూడా బులెట్లను వృథా చేయలేదు. ప్రతిసారీ ఎవరో ఒకర్ని గాయప

కొత్త శీర్షిక ప్రారంభం

# అక్షరధార

వేల ఏళ్ల క్రితం మన ప్రాచీన రుషులు మనిషి ప్రవర్తనా నియమావళి సూచిస్తూ వాటిని శ్లోకబద్ధం చేసారు. అవి అన్ని కాలాలకి, అన్ని ప్రదేశాలకి చెందిన, అందరికీ సమానంగా వర్తించే నిత్య సత్యాలు.

## విపత్తులో రక్షణ

వనేరణే శత్రు జలాగ్ని మధ్యే
మహార్ణవే పర్వత మస్త కేవా!
సుప్తం ప్రమత్తం విషమే
స్థితంవా రక్షంతి పుణ్యాని పురాకృతాని!!

**భావం:** కీకారణ్యం, యుద్ధం, శత్రుకూటమి, జలం, అగ్ని, వీటి మధ్య ఇరుక్కున్నప్పుడు, సముద్రంలోను, పర్వతాల మీద ఉన్నప్పుడు, నిద్రావస్థలో మత్తుగా ఉన్నప్పుడు, భయానక స్థితిలోనూ మనిషిని కాపాడేవి తను అంతకు పూర్వం చేసుకున్న పుణ్యాలే.

## దారిద్ర్య పరిణామం

దారిద్ర్యాత్‌హ్రియమేతి
హ్రీ పరగతః ప్రభశ్యతే తేజసో
నిస్తేజాః పరిభూయతే పరిభవా
న్నిర్వేద మాపద్యతే!
నిర్విణ్ణః శుచమేతి శోక పిహితో బుద్ధ్యా పరిత్యజ్యతే
నిర్బుద్ధిః క్షయమేత్యహో నిధనతా సర్వాపదా మాస్పదమ్!!

**భావం:** ధనం లేకపోవడం అన్ని ఆపదలకి మూలం. దరిద్రం వల్ల సిగ్గు కలిగి, సిగ్గు వలన పరువు లేకపోవడం, పరువు లేకపోవడం వల్ల తేజస్సు లేక అవమానింపబడతారు. అవమానం వల్ల దైన్యం, నిరుత్సాహం కలుగుతాయి. ఉత్సాహం లేని దీనుడు దుఃఖాన్ని పొందుతాడు. దుఃఖం కమ్మినవాడు వివేకాన్ని కోల్పోతాడు. వివేకం లేని వాడు నాశనాన్ని పొందుతాడు.

## బలహీనులని ఎలా చూడాలి?

హీనాంగాన్ అతిరిక్తాంగాన్
విద్యాహీనాన్ వయోధికాన్!
రూప ద్రవ్య విహీనాన్ చ
జాతిహీనాన్ చ నాక్షిపేత్!!

**భావం:** అంగవికలురని, అవయవాలు సరిగ్గా లేనివానిని, చదువురాని వారిని, వృద్ధులని, కురూపులని, బీదలని, తక్కువ జాతి వారిని అపహాస్యం చేయరాదు.

## రాజనీతి

రాజన్ దుధుక్షసి యదిక్షితిధేను మేతామ్
తేనాద్యవత్స మివలోక మముంపుషాణ!
తస్మింశ్చ సమగ్ర నిశం పరిపుష్యమాణే
నానా ఫలం ఫలతి కల్పలతేవ భూమిః!!

**భావం:** రాజా! భూమి అనే ఆవు నించి ధనమనే పాలని పితుకదలిస్తే, దూడని ఆవు పోషించే విధంగా ప్రజల్ని పోషించు. ఆ ప్రజలని నువ్వు చక్కగా పోషిస్తే భూమి కల్పవల్లిలా కోరినవి అన్నీ ఫలింపచేస్తుంది.

సేకరణ: **లిపి**

# ఆరు శబ్దకాలుష్యాలు!



మన దేశవాసులకు శబ్దం లేకుండా జీవించడం అసాధ్యం. నిశ్శబ్దాన్ని అర్ధరాత్రి దాటాక కూడా అనుభవించలేం. కారు హార్న్, కుక్కల మొరుగుళ్లు అప్పుడూ వినిపిస్తాయి. కొన్ని శబ్దాలు వినడానికి ఆహ్లాదంగా ఉంటాయి. గుళ్లో గంటలు విన సొంపుగా ఉంటాయి. సముద్రపు హోరు కూడా బావుంటుంది. కాని కొన్ని శబ్దాలు వింటే చిరాకు పుడుతుంది. అలాంటి శబ్దాల గురించి పరిశోధించిన స్టాన్ ఫోర్డ్ యూనివర్సిటీ విద్యార్థులు అత్యంత ఇబ్బంది కలిగించే శబ్దాల జాబితా ఇచ్చారు. వాటిలో మొదటిది మొబైల్‌ఫోన్ మోగే శబ్దం. డాక్టర్ వెయిటింగ్ హాల్ లేదా లైబ్రరీలో అకస్మాత్తుగా వినిపించే మొబైల్ రింగ్‌టోన్ చిరాకు కలిగిస్తుందని అధిక శాతం చెప్పారు.

తర్వాతి స్థానం కుక్కల మొరుగుడి. దీనిపై ఏకంగా బార్కింగ్‌డాగ్ అట్లాస్ డాట్‌కామ్ అనే వెబ్‌సైట్‌ను కూడా ప్రారంభించారు. ప్రపంచంలోని ఏ ప్రాంతంలో నుంచైనా తమ నివాసస్థలంలో కుక్కలమొరుగుళ్ల బాధ ఉంటే ఈ సైట్లో నమోదు చేయవచ్చు. ఆశ్చర్యంగా మనదేశం నుంచి ఎవరూ ఈ అట్లాస్‌లో పోస్ట్ చేయలేదు.

మూడోస్థానం కార్ హార్న్‌లది. విదేశాల్లో రోడ్లమీద కార్లు వెళ్లే చప్పుడు తప్ప హార్న్ శబ్దాలు వినపడవు. కాని మన దేశంలో హార్న్ శబ్దాలు తీవ్రంగా వినడం వల్లనే బయటికి వెళ్లొచ్చినవారిని వెంటనే పలకరిస్తే విసుక్కుంటారు. నాలుగోది ఎక్కువమంది పిల్లలు ఒకేసారి ఏడ్చే శబ్దాలు అధిక ఇబ్బందికి గురి చేస్తాయని ఈ సర్వేలో పేర్కొన్నారు. ఐదో శబ్దం మనదేశంలో లేదు. కాని విదేశాల్లో ఎండుటాకులను ఎత్తేముందు ఎయిర్‌బ్లోయర్ ద్వారా ఓ చోటుకు చేరుస్తారు. ఈ డీజిల్ బ్లోయర్స్ శబ్దాల స్థాయి ఇబ్బంది పెడుతుంది. ఆరోది గురకగా ఆ సర్వేలో పాల్గొన్నవారు చెప్పారు. మనదేశానికి వచ్చే విదేశీయులు ఇక్కడి శబ్దకాలుష్యానికి నివ్వెరపోతుంటారు. రోడ్లమీద పిల్లల అరుపులు, అమ్మేవాళ్ల కేకలు, లౌడ్‌స్పీకర్లలోని పాటలు, వాహనాల హారన్లులాంటివి కొన్ని దేశాల్లో ఉండవు. అక్కడ నిశ్శబ్దానికి ఎంతగా గౌరవం ఇస్తారంటే, పెద్దగా కూడా మాట్లాడరు.

ర్చాడు. గోతి అడుగున కూర్చున్న ఖాన్ మహోమా 'ల్యాకా యిల్ అల్లాక్' అని పాడుతూ తీరిగ్గా కాల్చాడు. కాని అతడి గుళ్లు ఎవరికీ తగల్లేదు. బాకు చేతిలో పట్టుకుని క్షణక్షణం అసహనంగా నిరీక్షించాడు ఎల్డార్. ఖనేఫీ మాత్రం ఇక్కడా పనిమనిషిలాగే ప్రవర్తించాడు. తుపాకులు లోడ్ చేసి హాజీమురాద్‌కు, ఖాన్ మహోమాకు అందించటం అతడి డ్యూటీ. అదను చూసుకుని పరిగెత్తి తమ గుర్రాల్ని సురక్షిత ప్రాంతానికి పంపించాలని ప్రయత్నించాడు బాటా. పెద్దగా అరుస్తూ, సపోర్టు లేకుండానే తుపాకీ పేల్చాడు.

అందరికన్నా మొదట గాయపడింది అతడే. మెడలో తగిలింది బులెట్. నెత్తురు కక్కుతూ అందరికీ శాపనార్థాలు పెట్టాడు. బనియన్ చించి, గాయాన్ని నొక్కుకుంటూ కాల్పులు కొనసాగించాడు.

"ఖడ్గాలతో వాళ్లమీద దాడిచేద్దాం" అంటూ మూడోసారి అడిగాడు ఎల్డార్. సరిగ్గా అదే క్షణాన అతడికో బులెట్ తగిలింది. వెనక్కు వాలిపోతూ హాజీమురాద్ కాలిమీద పడిపోయాడు. అతడి అందమైన మేకపోతు కళ్లు హాజీ మురాద్‌ను చూశాయి. పసిపిల్లాడి పెదాల్లాంటి అతడి పెదాలు ఇక కదల్లేదు. కాలు లాక్కుని కాల్పులు కొనసాగించాడు హాజీమురాద్.

ఖనేఫీ వంగి ఎల్డార్ తుపాకీ, బులెట్స్

తీసుకున్నాడు.

పాట ఆపలేదు ఖాన్ మహోమా. మరొక్క అడుగేస్తే సైన్యంతో ముఖాముఖి యుద్ధమే.

హాజీమురాద్‌కు ఎడమ వైపున మరో బులెట్ తగిలింది. కిందికి ఒరిగి, బనియన్‌తో గాయాన్ని నొక్కుకున్నాడు. ఇది సీరియస్ గాయం. అతడి ప్రాణం పోతుందిక. తెర మీది చిత్రాల్లా గుర్తుకొచ్చింది గతం. చెక్కిలి చీరుకుపోయినా, చివరిదాకా యుద్ధం చేసిన అబు నట్సల్ ఖాన్, జిత్తులమారి వొరొంట్సొవ్. పాలిపోయినట్టుగా కనిపించే అతడి మొహం. యూసుఫ్ భార్య సోఫియట్. ఎర్రగడ్డంతో, సగం మూసుకున్న కళ్లతో షామిల్. బాధా లేదు. కోపమూ లేదు. ఏ కోరికా లేదు. ఇక ప్రారంభం కాబోయే కొత్త ప్రయాణంతో పోల్చితే ఏదీ ముఖ్యంకాదు. లోపల, ఇప్పటికే ప్రారంభమైంది ప్రస్థానం.

అయినా దృఢమైన అతని శరీరం తన పనిని కొనసాగించింది. ఉడిగిపోతున్న శక్తిని కూడదీసుకుని తనవైపు వస్తున్న వ్యక్తిని గురి తప్పకుండా కాల్చాడు. అతడు నేలకూలాడు. హాజీమురాద్ గోతిలోంచి లేచి బాకుతో శత్రువుపైన లంఘించాడు.

తుపాకులు పేలాయి. కింద పడిపోయాడు హాజీమురాద్. పడిపోయిన ఆ శరీరం చుట్టూ విజయనాదాలతో సైనికులు మూగారు. చలనం లేదనుకున్న శరీరం ఒక్కసారి కదిలింది. మొదట నెత్తురు కారుతున్న, అచ్ఛాదన లేని తల పైకి లేచింది. తరువాత చేతులు పక్కనున్న కొమ్మను పట్టుకున్నాయి. అదో భయానకమైన దృశ్యం. అతడి వైపు పరుగెత్తుకొచ్చినవాళ్లు కూడా ఆ దృశ్యం చూసి దూరంగా నిలుచుండిపోయారు. శరీరం చివరిసారిగా కంపించింది. పట్టుకున్న కొమ్మ జారింది. బోర్లా కింద పడింది శరీరం. ఎవరో విరిచి పారేసిన ముల్లులా కనిపించింది. అదింక కదలలేదు.

అతడిలో చలనం లేదు. కాని స్పందన ఉంది.

మొదట ఆ శరీరాన్ని సమీపించిన హాజీఆగా ఖడ్గంతో బలంగా ఒక దెబ్బ వేశాడు. ఎవరో సుత్తితో కొట్టినట్టనిపించింది హాజీమురాద్‌కు. ఎవరు కొడుతున్నారో, ఎందుకు కొడుతున్నారో అతనికర్థం కాలేదు. అదే అతని చివరి చైతన్య దశ. ఆ క్షణాన శరీరంతో సంబంధం కూడా తెగిపోయింది. స్పందనలేని ఆ శరీరాన్ని శత్రువులు తన్నారు. కత్తులతో పొడిచారు. కాని ఇప్పుడు అతనికా శరీరంతో ఎలాంటి సంబంధమూ లేదు.

శవం వీపు మీద కాలుపెట్టి రెండు దెబ్బల్లో తలను మొండెం నుంచి వేరుచేశాడు హాజీఆగా. బూట్ల మీద నెత్తురు చిల్లకుండా జాగ్రత్తపడ్డాడు. తలను కాలితో దూరంగా తన్నాడు. మెడ ధమనుల్లోంచి నెత్తురు ఉబికి వచ్చింది. తల నుండి కారిన నల్లటి నెత్తురు గడ్డిని తడిపింది.

చచ్చిన జంతువును మధ్యలో పెట్టుకుని ఆడే క్రీడాకారుల్లాగా కర్గానోవ్, హాజీ ఆగా, అహ్మద్‌ఖాన్‌లు హాజీమురాద్, అతని మురిద్‌ల (ఖనేఫీ, ఖాన్ మహోమా, గంజాలోలను కలిపి కట్టేశారు) చుట్టూ చేరి పొదల మీద ఎగిసిన తెల్లటి పొగలో గెలిచామని నాట్యం చేశారు.

యుద్ధం జరుగుతున్నంతసేపూ మౌనంగా ఉన్న నైటింగేల్‌లు తిరిగి పాట కచేరీ ప్రారంభించాయి. ఒకటి దగ్గరలో, మిగిలినవి కాస్త దూరంలో.

★ ★ ★

దున్నిన పొలంలో కనిపించిన ముల్లును చూస్తే నాకీ మృత్యుదృశ్యమే గుర్తుకొచ్చింది. ©

ఒడిశా కథ

- డా. అర్చనా నాయక్

# చూడు చూడు నీడను!

## అనువాదం : మహీధర రామశాస్త్రి

దసరా సెలవుల్లో ఢిల్లీ నుంచి ఇంటికొచ్చేసరికి తెలిసిన వార్త- పెద్ద మావయ్య పోయి పదిహేను రోజులయిందని! విన్న వెంటనే నాకేమీ అనిపించలేదు. సుమారు ముప్ఫై సంవత్సరాలుగా నేను మావయ్యను చూసిందిలేదు. కనీసం మా మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు కూడా జరగలేదు.

పెళ్లయింది లగాయితు మావారి ఉద్యోగ రీత్యా మేం ఒడిశా బయట ఉండాల్సివచ్చింది. ఎప్పుడైనా కొద్దిరోజుల కోసం ఒడిశా వచ్చినా మా సమయమంతా అత్తారింటికీ, పుట్టింటికే సరిపోయేది. ఒకే ఊళ్లో ఉన్న స్నేహితులను, బంధువులను కూడా కలుసుకోవడం సాధ్యమయ్యేది కాదు. అటువంటిది మారుమూల ఓ పల్లెలో ఉండే మావయ్య ఇంటికి వెళ్లేందుకు కుదిరిందే కాదు. అందుకు నేను బాధపడనూ లేదు.

ఇవాళ ఇలా మావయ్య పోయిన వార్తను విన్నాక తన రూపం నా కళ్ల ముందు కదలాడసాగింది. అంతేకాదు, చిన్ననాటి కొన్ని సంఘటనలు గుర్తుకురాసాగేయి.

స్కూల్లో చదువుకునే రోజుల్లో సెలవులు వచ్చినపుడు మేం మా ఊళ్లోనో లేదా మావయ్యగారి ఊళ్లోనో గడుపుతూండేవాళ్లం. మా ఊరిలాగే మావయ్య గారి ఊరికి వెళ్లడం చాలా కష్టం. నదినీ, కాలువనూ దాటుకుంటూ కొంతదూరం ఒంటెద్దు బండిమీదా, మరికొంత దూరం నడుచుకుంటూ ఆ ఊరు చేరుకోవాల్సి వచ్చేది. ఐతే చిన్నపుడు అదంతా పెద్ద కష్టంగా అనిపించేది కాదు. పైగా ఎంతో సరదాగా కూడా ఉండేది.

మావయ్యగారింట్లో అమ్మమ్మ, ఇద్దరు మావయ్యలు, అత్తయ్యలు, వాళ్ల పిల్లలు ఉండేవారు. మా అమ్మతో కలిసి నేను, తమ్ముడు ఆ ఊరు వెళ్లినప్పుడల్లా, అందరికీ సెలవులే కాబట్టి మా పిన్ని కూడా పిల్లల్ని తీసుకుని వచ్చేది. తాతగారిని మేం ఎవరమూ చూడలేదు. అమ్మకీ, పిన్నికీ పెళ్లి చెయ్యకుండానే తాతగారు కాలం చేశారు.

మా పెద్దమావయ్య శాంత గంభీర స్వరూపుడు. ఒకట్రెండు మాటలను అవసరం అయినంతమట్టుకే మాట్లాడేవాడు, లేకుంటే ఎప్పుడూ మౌనంగా ఉండేవాడు. కానీ అందరి మాటలను శ్రద్ధగా వినేవాడు. పిల్లలమైన మా ఆటలు ఆయన దగ్గర సాగేవి కావు. అలా చెప్పాలంటే, మా చిన్న మావయ్య దగ్గర మా ఆటలు సాగేవి. చిన్నమావయ్య మంచి హుషారుగా ఉండేవాడు. మంచి మంచి సరదా సరదా కథలన్నీ చెప్పేవాడు. మా పిల్లలందరినీ వెంటబెట్టుకుని నది ఒడ్డుకీ, మామిడి తోటకీ, చెరకు తోటకీ తీసుకుపోయేవాడు. చిన్నమావయ్య ఎక్కడకు వెళితే పిల్లలందరూ అక్కడ ఉండేవారు.

కానీ నేను మాత్రం మా పెద్ద మావయ్యను వదిలేదాన్ని కాదు. ఆ ఊళ్లో ఉన్నంతకాలం నేను ఆయనతోనే గడిపేదాన్ని. ఉదయాన్నే స్నానం చేసేసి, చాలాసేపు ఆయన దేవుడి గదిలోనే గడిపేవాడు. పూజలు చేస్తూ పూజకన్నా ఎక్కువసేపు ఆయన ధ్యానంలో కూర్చునేవాడు. ఆ సమయంలో దేవుడి గది తలుపు దగ్గరగా వేసి ఉండేది. లోపల ఆయన ఏం చేస్తూంటాడో తలుపు సందుల్లోంచి చూస్తుండేదానిని. ఒకేముద్రలో అలా అంతసేపు ఎలా కూర్చునుండగలిగేవాడో నాకయితే బోధపడేది కాదు.

పెద్ద మావయ్యలాగా మరెవరూ అలా కూర్చునేవారు కాదు. అంతా ఓమారు దేవుడి గదిలోకి దూరేవారు. ఏదో అవీ ఇవీ కాస్సేపు గొణిగి, శిరసా నమస్కరించి త్వరగా బయటపడేవారు! మావయ్య ధ్యానముద్ర నన్ను బాగా ప్రభావిత పరిచింది.

మావయ్య ధ్యానంలోంచి బయటపడే సమయంలో నేను తలుపు తోసుకుని లోపలకు దూరేదాన్ని. ఆయన నన్ను చూసి చిన్నగా నవ్వేవాడు. నా తల నిమిరి, తులసీదళాన్ని నా చేతిలో పెట్టి తన పనిలోకి ప్రవేశించేవాడు. రెండురోజులు నేనలా అక్కడే కూర్చునుండడం చూసి మావయ్య ఓరోజు అన్నాడు. "నువ్వు బయట తిరిగి ఆడుకోకుండా ఇంతసేపు ఇక్కడే కూర్చుంటున్నావా? నీకిష్టమైతే లోపలకు వచ్చి కూర్చో!"

అమ్మమ్మ అక్కడే ఉంది. ఆవిడకు తెలుసు, ధ్యాన సమయంలో బయట ప్రళయం వచ్చినా మావయ్య చెక్కు చెదరడనీ, ఏవీ వినిపించుకోడనీను! మావయ్య దేవుడి గదిలోకి వెడుతున్నాడంటే, అందరూ దూరంగా తప్పుకుంటారు కిక్కురుమనకుండా. అందుకని అమ్మమ్మ అంది "దాన్నలా బయటనే కూర్చోనీ. లోపలకు వస్తే నీకు ఇబ్బంది!"

"దానికిష్టం అయితే రేపట్నుంచి వచ్చి కూర్చోవచ్చును. నాకు ఇబ్బందేమీ ఉండదు!" మావయ్య ఆ మాటన్నాక ఇక నన్నాపగలిగేవారెవరు? ఆ తర్వాత నేను కూడా అక్కడ ఉన్నంతకాలం మావయ్యతో ధ్యాన సమయంలో దేవుడి గదిలో గడిపేదాన్ని. నేను స్నానం చేయకుండా అలా దేవుడి గదిలోకి పోయి కూర్చోవడం అమ్మమ్మకయితే బొత్తిగా ఇష్టం ఉండేది కాదు. కానైతే మావయ్యకు అభ్యంతరం లేనప్పుడు ఆవిడేం చెయ్యగలదు?

నేను కళ్లు మూసుకుని అంతంతసేపు అలా కూర్చోవడాన్ని చూసేక, అమ్మ ఆలోచనలో పడింది. 'మిగతా పిల్లలందరిలా అటూ ఇటూ పోయి ఆడుకోకుండా, అంతసేపు దేవుడి ముందు కూర్చుని ఏం చేస్తున్నావ్?' అంటూ నా మీద చిరాకుపడేది. నేను యోగినీ మాతను కానీ అయిపోయి, సంసారానికి దూరం అయిపోతానని ఆవిడ భయం.

నాకంత భాగ్యం కూడానా? ఇంత వయసొచ్చి మీద పడిందికానీ- ధ్యానం కుదరడం మాట దేవుడెరుగు... సాధారణ ఏకాగ్రత కూడా అలవడలేదింతవరకూ. సంసారం మీద దృష్టి ఏ మాత్రం తగ్గలేదు సరికదా, భవబంధాలు సహస్ర బాహువులతో నన్ను పట్టి బంధిస్తున్నాయి. చిన్నపుడు అంతసేపలా కూర్చోగలిగానంటే అదంతా పెద్దమావయ్య ధ్యాన ప్రభావం తప్ప మరొకటి కాదు!

మావయ్యగారి ఊళ్లో చేపలు దొరకవు. దానివల్ల ఎవరూ ఇబ్బంది పడేవారు కాదు కానీ, నేను మాత్రం చేపలేని భోజనం చెయ్యలేకపోయేదాన్ని. మేనకోడలికి చేపంటే ఇష్టమని పాపం మావయ్య నది నుంచో, చెరువు నుంచో నాలుగు చేపల్ని

తెప్పించేవాడు.

మావయ్యలిద్దరూ మాంసాహారులు కారు. వాళ్లతో పాటు అత్తయ్యలు కూడా మాంసాహారాన్ని వదిలేశారు. దాంతో వంటింట్లోకి మాంసాన్ని తీసుకువెళ్లేవారు కాదు. ఎప్పుడైనా పిల్లల కోసం బయట పాకలోని పొయ్యి మీద వండి పెడుతూండేవారు. మేం ఉన్నన్నాళ్లూ ప్రతిరోజూ మాంసం వండుతూండేవారు. దానివల్ల మేం వెడితే చాలు, వాళ్ల పిల్లలకు పండుగేను. వాళ్లు నాతో అనేవారు 'నువ్విక్కడే ఉండిపోరాదూ, కలిసి చదువుకుందాం?'

వాళ్ల ప్రేమ రహస్యాన్ని నేనర్థం చేసుకునేదాన్ని.

ఓరోజు ఇంట్లో చాలా ఇబ్బందికర పరిస్థితి ఎదురైంది. పిల్లలమైన మాతోపాటు పెద్ద మావయ్యకి కూడా భోజనాలు వడ్డించారు. మేం పిల్లలం చాలా మంది ఉన్న కారణంగా మాకు అరిటాకుల్లో అన్నాలు వడ్డించారు. మావయ్యని కాస్తంత ఎడంగా కూర్చోబెట్టారు. ఆయన కంచు కంచం బంగారంలా మెరుస్తోంది. కంచంలో వేడి అన్నం మీద అమ్మమ్మ ఆవునెయ్యి వడ్డిస్తూంటే, ఆ కమ్మటి వాసన నా ముక్కుపుటాలకు సోకింది. కానీ మేం తింటున్నది మాంసం కాబట్టి నెయ్యి వెయ్యలేదు. నా దృష్టి అంతా మావయ్య కంచం మీదనే ఉంది! నా చూపును కనిపెట్టిన మావయ్య నన్ను తనతో కలిసి తినడానికి పిలిచాడు.

నేను కోరుకుంటున్నదీ అదే కదా! వెంటనే నా ఆకుని వదిలేసి, లేచి వెడుతూంటే 'ఎక్కడికే లేచావు?' అంటూ అమ్మమ్మ కస్సుమంది.

"దాన్ని నేనే పిలిచాను, నాతో కలిసి తింటుందిలే!" అన్నాడు మావయ్య.

"అరె, ఆ మహారాణి మాంసం లేందే అన్నం ముట్టదు. నువ్వేలా పిలుస్తున్నావు?"

అమ్మమ్మ గొడవ చెయ్యడంతో నేను లేచినదాన్నల్లా తిరిగి నా ఆకు దగ్గర కూర్చున్నాను. మావయ్యతో తినాలంటే మాంసం దొరకదు. చేప తినాలనుకుంటే కంచు కంచం, బాసుమతి అన్నం, ఆవు నెయ్యి దొరకవు! మిగతా పిల్లలందరూ భోంచెయ్యడం మొదలుపెట్టేశారు. నన్నెవరూ పట్టించుకోవడం లేదు.

'మినూ! నాతో కూర్చుని తింటుంది. దాని చేపల కూర ఇక్కడ వడ్డించండి!"

పెద్దత్త అదిరిపడుతూ అంది "ఇదెక్కడి గొడవ? తను మీ కంచంలో మాంసాన్నెలా తింటుంది?"

> **కొత్తగాలి...**
>
> **పుడుతూ కేర్**
> **పెరుగుతూ బీకేర్**
> **మీసాలొచ్చాక డోంట్‌కేర్**
> **పెళ్లయ్యాక జీహుజూర్!**
>
> – కృష్ణ మాదవరపు,
> కాకినాడ

మావయ్య నిర్వికార చిత్తంతో అన్నారు "దాంట్లో ఏముంది? దానికి కావలసింది అది తింటుంది! దా అమ్మా! రా.. నా దగ్గరకు రా!"

అమ్మ, అమ్మమ్మల అదలింపుల్ని సైతం లెక్క చేయకుండా, నేను పెద్ద మావయ్య కంచంలో బాసుమతి అన్నంలో ఆవు నెయ్యితో చేపల కూర కలుపుకుని తిన్నాను. నాకప్పుడు మాంసాహారం, శాకాహారం, మడీదడీ గొడవల సంగతి బొత్తిగా తెలియదు.

తర్వాత అమ్మ ఎన్నో మంచిచెడ్డల గురించి చెబుతూ 'ఇది ముట్టుకోకు, దాన్ని తగలకు' అంటూ చెప్పినప్పుడూ, గురు

వారం నాడు ఉల్లిపాయ ముట్టకూడదని చెప్పి విసుక్కుంటున్నప్పుడూ, మావయ్య గుర్తుకొచ్చేవాడు. పెద్ద మావయ్య చిత్త సంస్కారం ఎంత గొప్పదంటే, ఇటువంటి చిన్నచిన్న అనవసరపు విషయాలను పట్టించుకుంటూ తను బాధపడడు, ఒకరిని బాధించడు. ఆనాటి చిన్న ఘటన నా మనసు నుంచి అనేక అర్థహీన సంస్కారాలను దూరం చేసింది.

మావయ్యకు సంబంధించిన మరొక ఘటన మరచిపోలేనిది జరిగింది. అమ్మమ్మ అనారోగ్యం వార్తనందుకుని అమ్మా, నేను మావయ్యగారింటికి వెళ్లేం. నాన్నగారు, తమ్ముడు ఏవో ఇబ్బందుల వల్ల మాతో రాలేకపోయేరు. అమ్మమ్మ క్రమంగా కోలుకున్నా మంచం దిగడంలేదు. ఆమెకు ఏమయిందో, ఓ రోజు నన్ను దగ్గరకు పిలిచి "నా బంగారు తల్లివి కదూ, కాస్తంత భాగవతం చదివి పెట్టు, వినాలనుంది!" అంది.

నేను ముందు వెనుకలకు ఊగుతూ భాగవతంలోంచి శ్రీకృష్ణ జననం శ్రద్ధగా చదివి వినిపిస్తున్నాను. అమ్మమ్మ రెండు చేతులను నుదుటి మీద పెట్టుకుని నమస్కరించుకుంటూ కళ్లనుండి నీరు కారుస్తూంది.

పెద్ద మావయ్య ఆ గదిలోకి ఎప్పుడొచ్చి నిలబడ్డాడో నాకు తెలియదు. మావయ్యను చూడగానే నేను భాగవత పఠనం ఆపేశాను. 'ఎందుకాపేశావు?' అంటూ మావయ్య అడిగాడు కానీ అమ్మమ్మ 'ఇంక చాల్లే' అన్నట్టుగా సంజ్ఞ చేసింది.

నేను గ్రంథాన్ని మూసేసి, గోడకు జేరగిలపడి కూర్చున్నాను. మావయ్య అమ్మమ్మ కాళ్లు పడుతూ కూర్చున్నాడు. ఉన్నట్టుండి అమ్మమ్మ అంది "నాయనా! ఇంక నాకు బతకాలన్న కోరికేం లేదు"

"అమ్మా! నిజంగానా? అలా అయితే నీ మనసును ఆ భగవంతుని మీద లగ్నం చేసి ఉంచు. సంసారం సంగతి పట్టించుకోకు! ముక్తిని పొందుతావు!"

"నాయనా! నీకో విషయం చెప్పాలనుంది"

"చెప్పమ్మా! మనసులోని మాటను చెప్పు. నీకు దేనిమీదైనా ఆశ ఉంటే సందేహించకుండా నాకు చెప్పు?"

"లేదు నాయనా, నాకు దేని మీదా ఆశ లేదు. నువ్వొక యతీశ్వరుడివి నా కడుపున కొడుకుగా జన్మించావని నాకు తెలుసు. అదే నా భాగ్యం. నిన్నొక మాట అడుగుతాను చెప్పు"

మావయ్య మౌనంగా అమ్మమ్మ మాట కోసం ఎదురు చూస్తున్నాడు. నేనక్కడే గోడకు జేరబడి కూర్చున్నానన్న సంగతిని తల్లీకొడుకులు ఇద్దరూ మరచిపోయేరు.

అమ్మమ్మ నెమ్మదిగా చెప్పసాగింది "నాయనా! నీ దగ్గరున్న విద్య గురించి నాకు తెలుసు. ఆరు మాసాల ముందుగా మరణాన్ని గురించి చెప్పగలవు నువ్వు! ఎన్నాళ్లు ఇంకా నేనిక్కడుంటానో నాకు చెప్పవా?"

మావయ్య ఆమె మాటను దాటవెయ్యడానికి ఎంత ప్రయత్నించినా, ఆవిడ అంతకంతగాను పట్టుబట్టింది. తన మరణ ఘడియ గురించి ఆమె ఎలాగైనా తెలుసుకుని తీరాలనుకుంది. తాను వెళ్లిపోవడానికి సిద్ధంగా ఉన్నట్టూ కేవలం ఆవిడకు ఆ ఘడియ తెలిస్తే చాలును అన్నట్టుంది ఆ ధోరణి. చివరకు ఆమె వత్తిడి మీద, మాతృరుణం తీర్చుకొనే నిమిత్తం మావయ్య రాజీపడ్డాడు.

మామయ్య అన్నాడు "అమ్మా! రేపు సూర్యోదయ సమయానికి ఆరుబయట మన పెరట్లోకి రాగలవా?"

అమ్మమ్మ వెంటనే ఒప్పేసుకుంది. తను వెళ్లగలనని చెప్పడానికా అన్నట్టు మంచం మీద టక్కున లేచి కూర్చుంది.

# అద్దెకి మగాళ్లు!



జపాన్‌లోని ఒంటరి మహిళలకి తాత్కాలికంగా బాయ్ ఫ్రెండ్స్‌ని గంటల చొప్పున అద్దెకిచ్చే వ్యాపారం నడుస్తోంది. 'సొయినీ-యాప్రైమ్'గా పిలిచే ఈ వ్యాపారం క్లిక్ కావడానికి కారణం అద్దె తక్కువ. ఓ రాత్రి ఒక స్త్రీ పక్కన కౌగిలించుకుని పడుకోవడానికి ఒక మగాడికి రెండువేల రూపాయలకి సరిపడే యెన్స్ చెల్లిస్తే చాలు. ఆ ధరలు ఏడు గంటలకు ముప్పైవేల యెన్స్ నుంచి పన్నెండు గంటలకి నలభైఎనిమిది వేల యెన్స్ దాకా ఉంటాయి. ఇది కేవలం కౌగిలింతలకే పరిమితం తప్ప రతి చోటు చేసుకోకూడదనేది నియమం. షిమ్‌షిమా అనే టీవీ సీరియల్ వల్ల ఈ వ్యాపారం ఆవిర్భవించింది. దాంట్లో తన భర్తనుంచి విడాకులు తీసుకున్న హీరోయిన్ ఒంటరిగా నిద్రించడానికి ఇబ్బంది పడుతుంది. అనేక నిద్రలేని రాత్రులు గడిపాక సోయినీ-యా (కలిసి నిద్రించే షాప్)అనే వ్యాపార సంస్థను తెరుస్తుంది. తనలాంటి సమస్యే గల ఒంటరి మహిళలకు కౌగిలించుకుని నిద్రించడానికి మగాళ్లని ఆమె అద్దెకిస్తుంటుంది. ఆ సీరియల్ జపనీయులను బాగా ఆకర్షించింది. దాంతో 'సోయినీ- యా ప్రైమ్' అనే వ్యాపార సంస్థను ఒకతను ఆరంభించాడు. అయితే రతి సౌఖ్యాన్ని తీసుకోడాన్ని ఆ సంస్థ నిషేధిస్తుంది. మగాళ్ల నుంచి వారు తీసుకునే సేవల జాబితాలో అతని చేతుల్లో నిద్రించడం, ఆమె తన ఖర్చుతో అతన్ని హోటల్‌కో, పిక్నిక్‌కో తీసుకెళ్లడం, అతని చేత ఇంటిని శుభ్రం చేయించడం, వంట వండించడం ఉన్నాయి. హోటల్ గదిలోకాని, క్లయింట్ ఇంట్లో కాని మాత్రమే వారిద్దరూ కలిసి నిద్రించాలి. క్లయింట్స్ ఆ మగాళ్లను చుంబించరాదు. అసభ్యకరమైన, అభ్యంతరకరమైన ప్రదేశాల్లో ముట్టుకోరాదు. వారిని మానసికంగా స్వాంతన కోసమే ఉపయోగించుకోవాలి. కానీ ఆ మగవాళ్ల అనుమతితో నిషిద్ధమైనవి కూడా కొనసాగుతుంటాయి. అయితే అతని ద్వారా ఆమె గర్భవతి అయితే, అందుకు కంపెనీ బాధ్యత ఉండదు. సాధారణంగా మానసికంగా నిరాశ నిస్పృహలకు లోనై, చాలాకాలంగా మగాడి స్పర్శ ఎరగనివారే ఈ సర్వీస్‌ని ఉపయోగించుకుంటారు.

మావయ్య బయటకు వెళ్లిపోయేడు. నేను నాకేమీ తెలీనట్లు అటూఇటూ తిరుగుతూ గడిపాను. ఆ రాత్రి అమ్మమ్మ పడుకుందో లేదో తెలియదు, కానీ నా కంటి మీదకు మాత్రం కునుకు రాలేదు. ఉత్కంఠతో ఎదురు చూస్తూ గడిపాను, ఎప్పుడు తెల్లారుతుందా అని!

తెల్లవారుజామున కాస్తంత కునుకు పట్టినా టక్కున మెలకువ వచ్చేసింది. నేను పరుగు పరుగున అమ్మమ్మ గదికి వెళ్లి చూస్తే ఆవిడ అక్కడ లేదు. నాకు తెలుసు, ఆవిడ ఎక్కడకు వెళ్లి ఉంటుందో! వెంటనే అక్కడికి పరుగెత్తాను. అప్పటికింకా పిల్లలెవరూ లేవలేదు. మిగతా ఆడవారంతా కాలకృత్యాలు తీర్చుకుని నదీస్నానానికి వెళ్లిపోయేరు. అమ్మమ్మ పడుకున్న గది కొంజా వైపున్న పెరట్లోకి ఎవరూ రాకపోకలు సాగించరు. నేను సంబరపడుతూ పెరట్లోకి వెళ్లి ఎవరికీ కనబడకుండా పొదలో దాక్కున్నాను.

పెరటి మధ్యలో మావయ్య, అమ్మమ్మ నిలబడి ఉన్నారు. అమ్మమ్మ చీరను బిగించి కట్టుకుంది. బట్ట కిందకు వేలాడకుండా గోచీ బిగించుకుంది. ఇక ఆమె రెండు చేతులు, కాళ్లూ చాపుకుని ఉన్నాయి. తిన్నగా నిలబడగల బలం

ఆమెకు లేదు. కానీ మనోబలంతో ఆమె మావయ్యా చెప్పిన విధంగా నడుముకి రెండువైపులా రెండు చేతులు పెట్టుకుని గడకర్రలా నిలబడింది.

నాకు ఇక్కడ ఊపిరి ఆడడం లేదు. తెరుచుకున్న నా నోట్లోకి ఏదో పురుగు ఎగిరివచ్చి గొంతులోకి పోయింది. నాకు దగ్గు రాబోయింది. నేను బలవంతాన ప్రాణం బిగపట్టి దగ్గునాపుకున్నాను. కారణం నా దగ్గుతో కథ అడ్డం తిరుగుతుంది మరి! పాపం అమ్మమ్మ మరణ శయ్య నుంచి లేచివచ్చి ఇక్కడ ఇలా నిలబడింది. ఏం తెలుసుకుందామనో మరి! నేనిక్కడ దొంగలా దాక్కున్న విషయం

## కొత్తగాలి...

**పక్షవాతం వచ్చింది**
**కాలుచెయ్యీ పడిపోయాయి**
**నోరు పడిపోలేదు**
**తేటతెనుగును పలికే నోరు కదామరి!**

– వాసా ప్రభావతి,
హైదరాబాద్

తెలిస్తే మావయ్యా ఏకాగ్రత కూడా దెబ్బ తింటుంది.

మావయ్యా కళ్లు మూసుకుని అమ్మమ్మ ఎదురుగా నిలబడి, కుడి చేతి చూపుడు వేలితో శూన్యంలో అంకెలు వేస్తున్నట్టుగా ఏదో చేస్తున్నాడు. ఈ పొదలోని పురుగులు నా శరీరం మీదకు ఎక్కుతున్నాయి. నిశ్శబ్దంగా వాటిని పారద్రోలుకుంటూ పట్టి పట్టి చూస్తున్నాను. మావయ్యా అమ్మమ్మకు ఏదో చూపించబోతున్నాడు.

సూర్యోదయం అయింది. అమ్మమ్మ సూర్యునికి వీపు చూపిస్తూ నిలబడి ఉంది. ఆమె ఎదురుగా ఆమె నీడ పొడవునా పరచుకుని ఉంది. నీడ స్పష్టంగా కనబడుతోంది, ఆవిడ చేతులు, కాళ్లు, శరీరం, తలతో సహా.

మావయ్యా నీడకు కొంచెం ఎడంగా జరిగి చేతులు కట్టుకుని కూర్చుని, ఏదో జపిస్తున్నాడు. ఒక వాక్యం పైకి పదేపదే ఉచ్చరిస్తున్నాడు. అయిదారు మాటలు నా మనసులో నాటుకున్నాయి. 'ఆకాశం కేసి చూస్తూ, చేత్తో నిర్దిష్ట ముద్ర పట్టి, ప్రతి పదానికి ముందు ఆయన ఇలా ఉచ్చరించ సాగాడు- 'మేఘస్య ఉపరి జో మేఘః సూర్జస్య ఉపరి జో సూర్జ్యః' (మేఘాల మీద మేఘం, సూర్యుని మీద ఉన్న సూర్యుడు).

ఈ రెండు మాటలే నాకర్థమయ్యేయి. మిగతా మాటలు నాకర్థం కాలేదు. మావయ్యా మీంచి నా దృష్టిని తప్పించి, అమ్మమ్మనీ, ఆమెనీడనీ చూడసాగేను. ఈ లోగా ఆ నీడ, నీడలా కాక మనిషి లాగున జీవం ధరించినట్టు కనిపించింది. ఆ నీడ అమ్మమ్మ శరీరానికి అనురూపంలా ఉంది. కానీ దానికి స్వతంత్ర శక్తి ఉందా అనిపించింది. కావలిస్తే ఆ నీడ ఆమె నుంచి వేరయిపోగలదు అనిపిస్తోంది.

ఆశ్చర్యంగా ఆ అద్భుత నీడకేసీ చూస్తున్నాను. మావయ్యా కంఠం వినిపించింది "అమ్మా! నీవు నీడను చూస్తూ నిలబడు. నేనడిగిన దానికి బదులియ్యి"

"అలాగే!" అంటూ అమ్మమ్మ తన నీడను చూసుకుంటూ నిలబడి ఉంది.

మావయ్యా ప్రశ్నిస్తున్నాడు "అమ్మా! చూసి చెప్పు. నీ నీడలో నీకు కాళ్లు రెండూ కనబడుతున్నాయా? "

"ఆc ... కనబడుతున్నాయి"

"చేతులు రెండూ కనబడుతున్నాయా? "

"ఆc!..."

"నీ శరీరం కనబడుతోందా? "

"కనబడుతోంది... కానీ నాయనా...!"

"ఏం? కనిపించడం లేదా? "

"నీడలో నా తలకాయ కనిపించడం లేదు"

"బాగా పట్టి పట్టి చూడు"

"లేదు... నా తలకాయ లేదు, నా నీడలో. స్పష్టంగా చూసే చెబుతున్నాను"

నేను లతలు తప్పించి, తల బయట పెట్టి అమ్మమ్మ నీడను పరిశీలనగా చూసేను. నీడలో తల ఉంది. అమ్మమ్మకు ఎందుకు కనిపించడం లేదు? మళ్లీ మళ్లీ అమ్మమ్మనూ, ఆమెనీడనూ మార్చి మార్చి చూస్తే నాకు కనబడుతూనే ఉంది! మరి ఆవిడకు ఎందుకు కనుపించడం లేదో నాకు అర్థం కాలేదు.

మావయ్య, అమ్మమ్మ దగ్గరకు వచ్చి ఆమె చీరను సవరించి "అమ్మా! నడు. ఇంట్లోకి పోదాం!" అన్నాడు.

అమ్మమ్మ చూస్తూండగా తన పూర్వ స్థితికి వచ్చేసింది, అనగా నడుము వంగింది, తిన్నగా నిలబడలేకపోతోంది. మావయ్య ఆమెను గట్టిగా పట్టుకుని నడిపించుకుంటూ వెళ్లి ఆమె గదిలోని మంచం మీద పరుండబెట్టాడు.

నేను పొదలోంచి బయటకు వచ్చి వాళ్ల వెనకాలే వెళ్లి అమ్మమ్మ గది తలుపు వెనకాల నిలబడి చెవులప్పగించాను.

"చెప్పు నాయనా! నా గురించి ఏం చెబుతావో చెప్పు!"

మావయ్య శాంత గంభీర స్వరంతో అన్నాడు "అమ్మా! మృత్యుఘడియలు తెలిసినప్పటికీ ఎవరికీ చెప్పరాదన్నది శాస్త్రవచనం! ధైర్యస్తులు కూడా మృత్యువు దగ్గరలో ఉందని తెలిస్తే భయపడి తీరుతారు. బతకాలని నానా రకాలుగా ప్రయత్నిస్తారు. బతుకును క్షణక్షణం తిట్టుకునే మనిషి సైతం వికల మనస్కుడై సమాప్తం కానున్న బతుకును కనీసం కందమూలంలో దాచుకోవాలని ప్రయత్నిస్తాడు. బతికున్న నాలుగు రోజులూ వణికిపోతూ భయభ్రాంతులకు గురవుతాడు. అవగతాన్ని తెలుసుకోకపోవడమే మంచిది. నువ్వు భగవంతుడి మీద మనసునుంచు!"

అమ్మమ్మ క్షీణ స్వరంతోనే ఐనా ధృఢంగా అంది "నాయనా! నువ్వు చెప్పినదంతా యధార్థం. కానీ నేను అవతలి గట్టుకి చేరడానికి సిద్ధంగా వుండి కదా ఇంత పెద్దకథను నడిపించాను. నాకు నీ సంగతి తెలియదా? నా చివరి కోరికను తీర్చాలని కదా నువ్వు నా నీడను నాకు 'కాలం' (మృత్యురూపం)లో చూపించావు. కాబట్టి నువ్వేం గ్రహించావో దానిని నాకు

> **కొత్తగాలి...**
>
> **అమ్మపాడిన**
> **జోలపాట**
> **పిండారబోసిన**
> **వెన్నెలతేట**
>
> – సి. కామేశ్వరరావు,
> కాశీబుగ్గ

దాచకుండా నిజాన్ని చెప్పు!"

మావయ్య ఈసారి కూడా అదే స్వరంతో అన్నాడు "అమ్మా! నీ ఆయుష్షు తీరిపోయిందని తెలుసుకో! ఏ క్షణానైనా నువ్వెగిరిపోగలవు! కాబట్టి ఆ పతిత పావనుడ్ని తలుచుకో!"

అమ్మమ్మ తృప్తిగా ఊపిరి వదిలింది. రెండు చేతులు జోడించి, పైకి చూస్తూ నమస్కరించింది. మావయ్య మౌనంగా ఆమెగది నుంచి బయటపడ్డాడు. నా హాజరీ గురించి ఎవరికీ తెలీదు.

కానీ ఆ రోజు కూడా మావయ్య తన పూజామందిరంలోకి వెళ్లగానే, నేను కూడా

యథాప్రకారం ఆయనతో లోపలకు ప్రవే శించాను. ఆయన ధ్యానం పూర్తయ్యే వరకూ ఓపిగ్గా కూర్చున్నాను. మనసులో తిరుగుతూన్న ఆలోచనలు నన్నల్లరి పెడు తున్నాయి. మామయ్య చెప్పిన సంగతిని అడిగి తెలుసుకునేందుకు నేను ఉద్రిక్త పడుతున్నాను. నేను ఆయనకు తెలీకుండా అలా చూడడం, వినడం గర్హనీయమైన సంగతని నాకు తట్టలేదు.

మావయ్య ధ్యానం నుంచి బయటపడి, లేచి, స్థిరంగా కూర్చున్న నన్ను చూసి, చిన్నగా నవ్వేరు. నాకు ధైర్యం వచ్చింది. మావయ్యని తిన్నగా ప్రశ్నించాను "నీడలో తల కనబడకపోవడం మృత్యు సంకే తమా? "

మావయ్య ఆశ్చర్యానికి హద్దులేకుండా పోయింది. వెంటనే ఆయనకు అర్థం అయింది, మొత్తం కథంతా నాకు తెలిసి పోయిందని. బహుశా ఆయనకు అర్థ మయి ఉండదు, తన మేనకోడలు ఆటపా టలు మానేసి, ఆయనకు తెలీకుండా, ఆయన వెనక వెనకనే తిరుగుతోందని! ఆయన కాస్సేపు మౌనంగా కూర్చుండిపో యేడు. 'మావయ్యకానీ నా మీద కోప్ప డరు గదా? ' అని భయపడ్డాను. అయితే అటువంటిదేమీ లేదు. నా తల నిమిరి అత్యంత శ్రద్ధతో ఆయన అన్నారు "ఆ విషయాలను అర్థం చేసుకోగల వయస్సు నీకింకా రాలేదు! పెద్దదానివయినాక, నీక ప్పుడు తెలుసుకోవాలన్న కోరిక వుంటే, నేను 'ఛాయాదర్శనం' ఎలా జరిపించాలో నేర్పుతాను. ప్రస్తుతం అవేమీ అడక్కు. మరో సంగతి.. నువ్వు చూసిన, విన్న విష యాలను ఎవరికీ చెప్పకూడదని గుర్తుం చుకో!"

చివరి వాక్యం గురువాజ్ఞలా నాకు విని పించింది. నానోటికి నిజంగా తాళం పడింది.

అమ్మమ్మ ఇదివరకులా ఇప్పుడు కూతుళ్లు, కోడళ్లు, మనవల్ని దగ్గరకు రానీ యడం లేదు. ఒకవేళ ఎవరేని కాళ్లు పట్ట డానికి వచ్చి కూర్చున్నా పెదవి విప్పి మాట్లాడనీయడం లేదు. ఆమె కళ్లు మూసుకుని పడి ఉండడంతో, ఆమె అవ స్థలో మార్పు వచ్చిందని తలచిన అమ్మ, మేము కటక్ వెళ్లిపోవడానికి నిర్ణయించు కున్నాం. నా చదువు పట్ల అమ్మమ్మకు చాలా శ్రద్ధ ఉండడంతో నా స్కూలు పోతుందని ఆమె భావించుకుంటుంది! నా దృష్టి కూడా మారింది. ఆ రోజు, ఆ ఘటన తర్వాత నాలోని పిల్ల చేష్టలు తగ్గి, పెద్ద తరహా వచ్చి మీద పడింది.

అమ్మమ్మ మీద నా ఆలోచనలు తిరు గుతూ ఉన్నాయి. కానీ అమ్మమ్మ ఎంతో సంతోషంగా అర్ధరాత్రి దాటాక ఎప్పుడో వెళ్లిపోయిందని, ఉదయాన్నే మాకు తెలి సింది!

దాంతో మహా కోలాహల పర్వం ఆరం భమైంది. బంధువులు, కూతుళ్లు, జ్ఞాతులు, మొత్తం గ్రామ ప్రజల రాకపోకలతో యింట్లో ఎక్కడా కూర్చునేందుకు కూడా చోటు దొరకడం లేదు. నాకు ధ్యానం చేసు కునే అవకాశం కూడా లేకుండా పోయింది. కారణం మావయ్య అమ్మమ్మ కర్మకాండలు మొదలుపెట్టారు. ఆయన పూజాగృహంలోకి వెళ్లడం లేదు.

అమ్మమ్మ కర్మకాండను అతి శ్రద్ధాభక్తు లతో శాంతంగా జరుపుతున్నారు మామయ్య. అమ్మమ్మ పోయిన పదమూ డో రోజు. ఆ రోజు పరామర్శ అంటూ ఎవరూ రారు, ఇంటి వారెవరూ బయట కుపోరు. ముఖ్యంగా గత మూడు రోజు లుగా సాగుతున్న భోజనాల హడావుడి, పరామర్శలు, గోల ఒక్కసారిగా సద్దుమణి గాయి.

వేసవి రోజులు. మావయ్య ఆరుబయట

# అత్యధిక రికార్డుల వీరుడు!



గిన్నిస్ బుక్‌లోకి ఏదో ఒక రికార్డును బద్దలు కొట్టి ఎక్కాలనేది ఎంతోమంది తాపత్రయం. దానికి చాలా కృషి చేయాలి. కానీ బ్రెజిల్‌కు చెందిన ఆశ్రితా ఫర మేన్ ఎలాంటి శ్రమ లేకుండా గిన్నిస్‌బుక్‌లోకి ఈసారి ఎక్కాడు. అదెలాగంటే ఎక్కువసార్లు గిన్నిస్ బుక్‌లోకి ఎక్కిన వ్యక్తిగా ఇటీవలే మరో రికార్డును సాధించాడు. అతను ఇదివరకే 137సార్లు గిన్నిస్ బుక్‌లోకి ఎక్కాడు. 138వసారి అత్యధిక సార్లు రికార్డుల్లోకి ఎక్కిన వ్యక్తిగా మళ్లీ రికార్డు నెలకొల్పాడు.

యాభై ఏడేళ్ల ఫరమేన్ న్యూయార్కులో జన్మించిన ఏడాదే గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్ కూడా ఆవిర్భవించింది. తర్వాత అతను బ్రెజిల్‌కు వలస వెళ్లాడు. 1964లో బెంగాలీ గురువైన శ్రీచిన్మయానంద రికార్డులను బద్దలు కొట్టమని అతనికి సూచించారు. దాంతో అతని విజయ పరంపర ఆరంభమైంది. వెనక్కి వేగంగా నడవడం అతను సాధించిన మొదటి రికార్డు. ఫరమేన్ అసలు పేరు కేత్. కానీ చిన్మయానంద ఆశ్రిత అనే పేరు పెట్టారు. అతడు సాధించిన కొన్ని రికార్డులు - పోగో స్టిక్‌ను నాలుగుమైళ్ల ముప్పై అడుగుల దూరం వేలు మీద నిలిపి నడిచాడు. పాలసీసాను నెత్తిమీద ఉంచుకుని బేలన్స్ చేస్తూ దాదాపు ఎనిమిది నిమిషాలు జలగర్భంలో స్కిప్పింగ్ చేశాడు. ఈజిప్టులోని పిరమిడ్స్ దగ్గర పూల్ క్యూ బేలన్సింగ్ రికార్డ్, పారిస్‌లోని ఈఫిల్ టవర్ దగ్గర గంటలో అత్యధిక బస్కీలు తీయడం, గ్రేట్‌వాల్ ఆఫ్ చైనా మీద కంగారు బాల్‌మీద కూర్చుని పడిపోకుండా సాగడం, ఇంకా ఆంగ్‌కోర్‌వాట్, స్టోన్‌హెంజ్ తదితర ప్రసిద్ధి చెందిన ప్రాంతాల్లో అనేక రికార్డులు సాధించాడు. మంగోలియాలో యాక్ జంతువుల సవారి రేసులో గెలుపొందాడు. నేటికీ ఆశ్రితా ఫర్‌మేన్ తన సమయాన్ని రికార్డులను సాధించేందుకే వినియోగిస్తున్నాడు.

మంచం వేసుకుని పడుకుంటున్నారు. ఇంకా కొందరు కూడా మడత మంచాలు వేసుకుని అక్కడా యిక్కడా పడుకుంటున్నారు. నేను, అమ్మ లోపల పడుకుంటున్నాం. కొందరు ఆడవాళ్లు కింద పడుకుంటున్నారు.

ఓ రాత్రివేళ నాకు నిద్రాభంగం అయింది. ఆ తర్వాత ఇంక మరి నాకు కంటి మీద కునుకు రాలేదు. నా మనసంతా పాడయింది. మామయ్య గొంతు వినిపించింది. ఆయన ఎవరితో ఏం చెబుతున్నారో నాకయితే మొదట అర్థం కాలేదు. చెవులప్పగించాక సంగతి తెలిసింది.

మామయ్య చెబుతున్నారు "అమ్మా! ఈ యింటి మీద నీకింకా మమత పోలేదా? నీకు ఛాయాదర్శనం చేయించి చెప్పాను కదమ్మా! పతిత పావనుడినే స్మరించుకునే దానివి. తిరిగి మాయలో ఎలా పడుతున్నావు? నీ కర్మకాండలు చక్కగా చేసాను. ఇక నువ్వు వెళ్లిపో!"

ఆ తర్వాత ఇంకేమి వినిపించలేదు. కొంచెం సేపయ్యేక తిరిగి మావయ్య చెబుతున్నారు "ఎక్కడికి వెళ్లాలో తెలీదం లేదా? నీకంతా అంధకారబంధురంగా ఉందా? మంత్రాన్ని మరచిపోయేవా? సరే, ఐతే జాగ్రత్తగా విను.. మంత్రాన్ని స్మరణకు తెస్తాను. జపం చేయి. అంధకారాన్ని చూచి భయపడకు. నేను నీ కోసం ఈక్షణం నుంచి ఆ మంత్రాన్ని జపిస్తాను. ఆ జపబలంతో అంధకారంలోంచి నీకు దొరుకుతుంది దారి... నువ్వు వెళ్లిపో!"

నా శరీరం మీద ఎవరి చెయ్యో

పడింది. ఉలిక్కి పడ్డాను. నా ఏకాగ్రతకు భంగం కలిగింది. చూస్తే, అమ్మ నా పక్కనే ఉంది. మావయ్య మాటలు విని భయంతో ఆమె నన్ను దగ్గరకు లాక్కుంది.

ఆ మర్నాడు మా ఇంటికి మేం వచ్చేశాం. అమ్మమ్మ పోయేక, నేను రెండే రెండుసార్లు మావయ్యగారింటికి వెళ్లేను. కారణం అమ్మకు ఇంక ఆ వూరికి వెళ్లాలన్న కోరిక తగ్గిపోయింది. ఆ రెండు సార్లలో మొదటిసారి వెళ్లినప్పుడు మావయ్య అజ్ఞాతవాసంలోకి వెళ్లిపోయేరు. అప్పుడప్పుడు కొద్దిరోజులు ఎక్కడికో వెడతాడనీ, ఇంట్లో ఎవరికీ తన వివరాలు తెలీవనీ విన్నాను. రెండోసారి వెళ్లినపుడు నేను బాగా పెద్దదానిని! ఊళ్లోని ఆడ పిల్లలతో కలిసి నదిఒడ్డున తిరగడానికి నాకు అవకాశం దొరికింది. మావయ్యతో కలిసి ధ్యానంలో కూర్చునేందుకు ఎందుకనో ఇష్టం లేకపోయింది.

ఆ తర్వాత మావయ్య గారింటికి నేనెప్పుడూ వెళ్లలేదు. చదువు, వివాహం వీటి వలన ఒడిశా బయటనే కాలం గడిచింది. ఎప్పుడైనా వచ్చినా పనిగట్టుకుని మావయ్యగారింటికి వెళ్లాలన్న ప్రశ్న తలెత్తలేదు.

ఇప్పుడు ఇంటికి వచ్చేక తెలిసింది మామయ్య మరి లేరని! మేం వచ్చిన ఆనందంతో ఇంట్లో అందరూ ఆనంద కోలాహలంతో ఉండగా అమ్మ మాత్రం దుఃఖంతో మొహం వేలాడేసుకుని కూర్చుంది. అలా ఎందుకో ఊహించడం కష్టం కాదు. పెద్ద మావయ్య మా అమ్మ కన్నా చిన్నవాడు. తనుండగా తమ్ముడు చనిపోవడాన్ని ఆమె జీర్ణించుకోలేకపోతోంది. పని పూర్తయ్యేక, ఆమెతో కూర్చుని, ఆమెను పరామర్శించి నాలుగు ధైర్యవచనాలు చెప్పాలనుకున్నాను, ఆమె మనసు కాస్త కుదట పడుతుందనీ.

నేనింకా మాట్లాడకుండానే మావయ్య గారింటి నుంచి ఓ దూరపు బంధువు వచ్చేడు. అతను మాటల్లో అమ్మతో అన్నాడు "అక్కయ్యా! అన్నయ్య ఎంతటి జ్ఞానో నీకు తెలుసు కదా! అతను చెప్పింది చెప్పినట్టు జరిగేది. 'ఛాయా దర్శనం' విద్య అతనికి తెలుసు. మృత్యువు ఎప్పుడు వస్తుందో ఎందరికో చెబుతూండేవాడు. తన మృత్యువు గురించి మాత్రం తెలుసుకోలేకపోయేడు! సంతానం దూరంగా ఉన్నారు. భార్య కూడా దగ్గర లేదు. చూసే దిక్కు లేదు. ఒక్క ముక్క ఎవరికీ యేమీ చెప్పలేదు. కూర్చున్నవాడు కూర్చున్నట్టుగా ఒరిగిపోయేడు"

అతడి స్వరంలో వ్యంగ్యం తొంగిచూసింది. అమ్మ కూడా అలాగే భావిస్తోందా?

'ఛాయా దర్శనం' విద్య ఇంద్రజాలం కాదనీ, అందరి ముందూ ప్రదర్శించడం దాని ఉద్దేశ్యం కాదనీ చెప్పాలనుకున్నాను. మావయ్య ఆ విద్యను సంపాదించినది, మృత్యువుకి భయపడకుండా అవతలి గట్టుకి చేరుకోవడంలో మనిషికి సాయపడడం కోసం! ఒకవేళ ఆయన తన నిమిత్తం ఆ విద్యను ప్రయోగించుకుని, అంత్యావస్థ సమయాన్ని తెలుసుకుని వున్నా అందరకూ ఎందుకని ప్రకటించుకుంటాడు? చెప్పాలంటే, మౌనంగా అనంతపథంలో తన యాత్రారంభానికి తనను తాను సిద్ధపరచుకొని ఉంటాడు.

ఆశ్చర్యపోవడం మనపని. చాటింపు వేయించి అందరి ముందు యోగాసనంలో కూర్చుని దేహత్యాగం చేస్తేనే ఆయనను 'యోగి'గా భావించాలా? యోగులు కూడా సాధారణ మనుషుల్లా చనిపోవడాన్ని మనం అర్థం చేసుకోలేమా?

'అంతా వట్టి నాటకం' అనుకోడం అవసరమా మృత్యువులో కూడా... ©

# అసమాన సాహితీ మూర్ధన్యుడు డా. రావూరి



డా. రావూరి భరద్వాజ

**కష్టాల కడలి ఈదుకుంటూ, ఉన్నత పాఠశాల స్థాయి వరకైనా చదువు సాగించలేని దారిద్ర్యస్థితిని బాల్యమంతా ఎదుర్కొంటూ, జీవిక కోసం సహనంతో ముందు రకరకాల పనులు, తర్వాత ఉద్యోగం చేసుకుంటూనే సహజాత ప్రతిభకు అవిశ్రాంత కృషి, అక్షరదీక్ష తోడు కాగా జీవితపాఠాలు ఇతివృత్తాలుగా స్వీకరించి కథ, నవల, నాటకం, కావ్యం, వ్యాసం, బాలసాహిత్యం మొదలైన వివిధ ప్రక్రియలలో తెలుగులో అసంఖ్యాకంగా అసాధారణ రచనలు సృజించిన అసమాన సాహితీ మూర్ధన్యుడు డా. రావూరి భరద్వాజ. తన రచనా సర్వస్వంతో తెలుగు సాహిత్యాన్ని, తద్వారా భారతీయ సాహిత్యాన్ని సుసంపన్నం చేసినందుకు ఆయనకు 2012 సంవత్సరం జ్ఞానపీఠ పురస్కారం లభించింది. తెలుగులో విశ్వనాథ సత్యనారాయణ, డా. సి.నారాయణరెడ్డి తర్వాత అత్యంత ప్రతిష్ఠాత్మకమైన ఈ గౌరవం పొందిన ప్రముఖ సాహితీవేత్త భరద్వాజ.**

నిజాం పాలనలోని పరిటాల జాగీరుకు చెందిన మోగులూరు గ్రామంలో భరద్వాజ 1927 జూలై 5న జన్మించారు. ఇప్పుడాగ్రామం కృష్ణా జిల్లాలో భాగం. తండ్రి కోటయ్య, తల్లి మల్లికాంబ. నలుగురు సంతానంలో భరద్వాజ జ్యేష్ఠుడు. వీరి కుటుంబం గుంటూరు జిల్లా తాడికొండలో స్థిరపడింది. నాటకాలు, సంఘసేవ, జాతీయోద్యమంలో పాల్గొని మిగిలివున్న కొద్దిపాటి పొలాన్ని తండ్రి విక్రయించేశారు. పేదరికం ఆవరించింది. వారంతా కూలీలుగా మారారు. స్వగ్రామంలో అయిదో ఏట బడిలో చేరిన భరద్వాజ పేదరికం కారణంగా ఏడవ తరగతితోనే చదువు విరమించక తప్పలేదు. భుక్తి కోసం భరద్వాజ పశువులు మేపారు. పొలంలో కూలీగా పనిచేశారు. కలప అడితిలో దుంగలు కోశారు. కమ్మరి వద్ద సమ్మెట వేశారు. పత్రికలు పంచారు. ఇంకా ఇలాంటివెన్నో పనులు భేషజం లేకుండా చేశారు. అది రెండో ప్రపంచ యుద్ధ కాలం కావడం చేత ఒక సంవత్సరంపాటు సైన్యంలో సాంకేతిక శాఖలో పనిచేసే అవకాశం లభించింది. తర్వాత నిరుద్యోగం ఎదురయింది. భరద్వాజ ఊరి చెరువు నీళ్ళతో ఆకలి బాధ తీర్చుకున్న రోజులున్నాయి. గ్రామంలోని బాలభారతి గ్రంథాలయంలో పుస్తకాలు చదవసాగారు. స్వయంకృషితో ఇంగ్లీషు నేర్చుకున్నారు. రచనల పట్ల అప్పుడే ఆసక్తి ఏర్పడింది. కొవ్వలి, చలం, గోపీచంద్, కొడవటిగంటి మొదలైన వారి రచనలు విస్తారంగా చదివారు. భరద్వాజ 1946వ

సంవత్సరంలో నెల్లూరులో నెల రోజుల పాటు జరిగిన 'యువజన కాంగ్రెస్ శిబిరం'లో పాల్గొన్నారు. అక్కడే 'జమీన్ రైతు' పత్రికలో కొలువు దొరికింది. యజమానితో అభిప్రాయభేదం వల్ల పత్రిక విడిచిపెట్టారు. తర్వాత 'దీనబంధు' వార పత్రికలో కొంతకాలం పనిచేశారు. 1948లో వివాహమయింది. భార్య పేరు కాంతం. ఉద్యోగం లేదు. తెనాలిలోని జ్యోతి, రేరాణి, సినిమా పత్రికల ప్రచురణకర్త ఆలపాటి రవీంద్రనాథ్ నుంచి పిలుపు వచ్చింది. వాటి సంపాదక వర్గంలో భరద్వాజ చేరారు. వేతనం నెలకు రూ. 25/-. కొన్ని అపార్థాల వల్ల ఆ ఉద్యోగాన్ని విరమించుకోవలసి వచ్చింది. పిమ్మట 'సమీక్ష' మాసపత్రికలో చేరారు. అది మూతపడడంతో 'నలంద' ప్రచురణలలో చేరారు. రచనా వ్యాసంగం మాత్రం నిరంతరం సాగిస్తూనే ఉన్నారు. 1956లో మద్రాసు వెళ్లి 'జ్యోతి', 'చిత్రసీమ', 'అభిసారిక' పత్రికలలో చేరారు. అప్పుడే చలనచిత్ర రంగంతో సన్నిహిత సంబంధాలేర్పడ్డాయి. సినీ రంగాన్ని లోతుగా పరిశీలించారు. చక్రపాణి ప్రచురించే 'యువ' పత్రికలో చేరేందుకు 1959లో హైదరాబాదు వచ్చారు. అనంతరం గోపీచంద్ సహకారంతో ఇక్కడే ఆకాశవాణి కేంద్రంలో ఉద్యోగం లభించింది. గ్రామస్థుల కార్యక్రమ విభాగంలో స్క్రిప్ట్ రచయితగా 1959 నవంబరులో చేరారు. 27 సంవత్సరాలు పనిచేసి ప్రసంగ విభాగం ప్రయోక్తగా 1987లో పదవీ విరమణ గావించారు. మునిమాణిక్యం, గోపీచంద్, దేవులపల్లి,



ఆకలి తెలుసు..
అవిద్య తెలుసు..
అవమానం తెలుసు!




స్థానం, శ్రీవాస్తవ, సహజానంద, విఠల్, భాస్కరభట్ల వంటి ఉద్దండులతో ఆ కేంద్రంలో కలిసి పనిచేసే అవకాశం భరద్వాజకు లభించింది.

కష్ట సమయాలన్నింటిలో భరద్వాజకు బాసటగా నిలిచిన ఉత్తమ గృహిణి కాంతమ్మ. వారిది ఆదర్శ దాంపత్యం, వారికి నలుగురు కుమారులు, ఒక కుమార్తె. దురదృష్టవశాత్తు 1986లో

**జ్ఞాన పీఠాలు 53**

కాంతమ్మ తర్వాత ఇద్దరు కుమారులు, కుమార్తె పరమపదించటం భరద్వాజ జీవితంలో తీరని వ్యధను మిగిల్చింది.

భరద్వాజ విలక్షణ రచయిత. "అట్టడుగు జీవితం నేర్పిన పాఠాలు, అక్షరాలు రావన్న అవమానాలు నాలో రచనాసక్తిని, శక్తిని పెంచాయి. ఆకలి, అవసరాలు నా రచనకు ప్రేరణ" అంటారాయన. అందుకే ఆయన రచనల్లో ఆర్ద్రత నిండి వుంటుంది. తండ్రి పొలాలు అమ్మినప్పుడు ఇల్లు గడవని స్థితిలో భరద్వాజ 1943లో తన తొలికథ రాశారు. అయితే దానికి శీర్షిక పెట్టలేదు. ఆయన 'విమల' అనే కథ 1946లో 'ప్రజామిత్ర' వారపత్రికలో ప్రచురితమైంది. అచ్చయిన ఆయన ప్రథమ రచన అదే. అప్పటినుంచి రచనా

టుంది. ఆయన 'జీవన సమరం' వినూత్న ప్రక్రియ. అది కష్టజీవుల యథార్థ చిత్రణ. కథనం కథలాగా సాగుతుంది. అక్కడక్కడా వ్యాస లక్షణాలు చోటు చేసుకుంటాయి. 'ఈనాడు' ధారావాహికగా ప్రచురించినప్పుడు పాఠకుల నుంచి అపూర్వ స్పందన లభించింది. టిఫిన్, కారియర్లు తెచ్చే అంజమ్మ, మిర్చీ బజ్జీలమ్మే సావిత్రమ్మ, తాళాలు బాగు చేసే జహంగీర్, సమ్మెట వేసే శ్రీరాములు, సవరాలు కట్టే రాములు, ఇంకా చెప్పులు కుట్టేవాడు, చిలక జోస్యం చెప్పేవాడు, పడుపుకత్తె- ఇలా 52 మంది అభాగ్యులను గురించి భరద్వాజ ద్రవించిన గుండెతో రచించారు. 'వానయ్యేది, వరదొచ్చేది, ఎండలయ్యేది, సలి పీక్కు తినేది- నేను మాత్రం మానుకోను నాయనా. అయ్యలు తిని పోగా మిగిలినదాన్ని నేను మూటకట్టుకుని బిడ్డలకు పెట్టుకుంటా' ఇది అంజమ్మ మనోగతం. దివంగత ధర్మపత్ని కాంతమ్మపై ఆరాధనాభావంతో రాసిన 'నాలోని నీవు అంతరంగిణి, ఐతరేయం, అయినా ఒక ఏకాంతం, ఒకింత వేకువ కోసం' స్మృతి సాహిత్యంలో మణిపూసలు. ఉత్తమ కావ్యగౌరవాన్ని సంతరించుకున్నాయి. 'నీవు నా ఆరాధ్యదేవతవు. మళ్లీ నీ దర్శనం అవుతుందన్న వెర్రి ఆశ కొద్దీ నిన్ను ధ్యానిస్తూ, దుమ్ములో తిరుగుతున్నాను పిచ్చివాడిలాగా' అంటారు 'అంతరంగిణి'లో.



ఆలోచనాలోచనాలతో
అనంతంలోకి సాగే చూపు..

వ్యాసంగం ప్రవాహగతిలో సాగింది. ప్రారంభంలో చలం ప్రభావం కొంత ఉండేది. తర్వాత భరద్వాజ తనదైన ప్రత్యేక ముద్ర సుస్థిరం చేసుకున్నారు. ఆయన రచనలు అన్నివర్గాల పాఠకుల హర్షామోదాలు పొందాయి. భరద్వాజ రచనలు పీడిత ప్రజల, అట్టడుగు వర్గాల పరిస్థితులకు దర్పణాలు. అవి పాఠకుల్ని ఊహాలోకాల్లోకి తీసుకువెళ్ళవు. బాధాతప్త గాథలే ఆయన సాహిత్యానికి భూమికలుగా నిలిచాయి. అందుకే అథోజీవన చిత్రణపరంగా ఈయనను విమర్శకులు చార్లెస్‌డికెన్స్‌తో, బాల్జాక్‌తో పోలుస్తారు. 'కె.ఎ. అబ్బాస్- భరద్వాజ - గోర్కి రచనల సామ్యం చూపారు. ముఖ్యంగా కథనంలో, శైలిలో, శిల్పంలో, సంవిధానంలో భరద్వాజ ముద్ర ప్రస్ఫుటమవుతుంది'. వస్తువైవిధ్యంతోపాటు ప్రక్రియా బాహుళ్యం రచనలో చోటు చేసుకుంటుంది.

విజ్ఞానాంశాలను వివరిస్తూ భరద్వాజ సులభ శైలిలో వెలువరించిన రచనలు పిల్లల్నీ, పెద్దల్నీ బాగా ఆకట్టుకున్నాయి. 'వినువీధుల్లో వింతలు' ఖగోళ రహస్యాలు చెబుతుంది. ఎన్నో విశేషాలు 'విచిత్ర ప్రపంచం'లో విశదీకరించారు. నిప్పు, గాలి, నీరు, బొగ్గు, గడియారం, చెట్టు, గ్రహణం, కలం, లోహాలు, మనిషి, పింగాణి, రబ్బరు, సబ్బు, రంగులు మొదలైన వాటిని వివరిస్తూ 33 గ్రంథాలు రచించారు. ఇవి బాలసాహిత్య పెన్నిధులు. శ్రవ్య నాటికా రచనలో భరద్వాజ సిద్ధహ

స్తులు. మధ్యతరగతి మహిళ ఊహాజీవితం 'ఒక టవతేదీ' నాటికలో చూపారు. గుండెపోటు వచ్చిన అనుభవాలు జోడించి 'సశేషం' నాటిక రచించారు. 'స్వప్నసీమలు, స్వర్ణమంజరి, కవీనాం, భానుమతి, నీరులేని నది, ఆత్మ గతం' మొదలైన నాటికలు ప్రచురించారు. కథా రచనలో భరద్వాజ తనదైన బాణీ ఏర్పరచుకున్నారు. 'గోడల్లేని జైలు' సమాజంలో ద్వంద్వ స్థితిని కళ్లకు కట్టినట్టు చూపుతుంది. అవినీతిని, వంచనను 'శ్రీరస్తు' నిరసిస్తుంది. తల్లి ప్రేమకు నిలువుటద్దం 'కడుపుతీపి' అన్న కథ. సింహం మనిషిగా మారి నరలోకంలో తిరిగి చూసిన అక్రమాలు 'నర(క)లోకం' కథ వెల్లడిస్తుంది. 500 పైగా కథలు, 'అర్ధాంగి, కల్పన, జయంతి, దావానలం, మనోరమ, పాపం' మొదలైన పేర్లతో 43 సంపుటాలుగా వెలువడ్డాయి.

అగ్రశ్రేణి నవలాకారుల్లో భరద్వాజ ఒకరు. ఆయన 'పాకుడురాళ్లు' అత్యంత జనాదరణ పొందింది. సినిమారంగంలోని స్థితిగతుల్ని, కల్మషాన్ని అద్భుతంగా చూపే నవల. ప్రధాన పాత్ర 'మంజరి'. అసలు పేరు 'మంగమ్మ'. నీతినియమాలకు తిలోదకాలిచ్చి మహానటిగా మారుతుంది. హిందీ రంగంలోనూ ఖ్యాతిగాంచింది. హాలీవుడ్‌లో పరిచయాలు పెంచుకుంటుంది. ప్రేమరాహిత్యం వల్ల నిరాశతో పతనమవుతుంది. చివరకు ఆత్మహత్య చేసుకుంటుంది. చలపతి, కల్యాణి, వసంత, మాధవరావు, మెహతా మొదలైన పాత్రల మనస్తత్త్వ విశ్లేషణలో భరద్వాజ ప్రతిభ ఆవిష్కృతమవుతుంది. సామాన్యుడు ఉపాయాలతో కోటీశ్వరుడు కావడం 'కాదంబరి' నవలలోని ఇతివృత్తం. పెట్టుబడిదారి వ్యవస్థను దుయ్యబట్టే నవల 'ఇదం జగత్'. నాగరికత పేరుతో వేసే వెర్రితలలు 'కరి మింగిన వెలగపండు' నవలలో చూపారు. 'జల ప్రళయం' నవల శాంతిని కాంక్షిస్తుంది. 'అసావేరి, శిథిల సంధ్య, తోడుదొంగలు, చంద్రముఖి, మాయలోకం' మొదలైన 26 నవలలు, నవలికలు ఆయన రచించారు. వ్యాస సంపుటాలు వెలువరించారు. మరికొన్ని ఇతర రచనలూ అందించారు. ఇంతవరకు భరద్వాజ 185 గ్రంథాలు ప్రచురించారు. ఆయన రచనలు కొన్ని ఇంగ్లీషు, హిందీ, తమిళం, గుజరాతీ, కన్నడం, మలయాళం వంటి భాషలలోకి అనువాదమయ్యాయి. పెక్కు విశ్వవిద్యాలయాల్లో ఆయన రచనలపై పరిశోధనలు జరుగుతున్నాయి. భరద్వాజ 1984లో రష్యా సందర్శించారు. ఆంధ్ర, నాగార్జున, జె.ఎన్.టి.యు విశ్వవిద్యాలయాలు ఆయనకు గౌరవ డాక్టరేటు ప్రదానం చేశాయి. భరద్వాజ రాష్ట్ర సాహిత్య అకాడమి, కేంద్ర సాహిత్య అకాడమి, భారతీయ భాషా పరిషత్, సోవియట్ లాండ్ నెహ్రూ, రాజాలక్ష్మి, ఉండేల కళాపీఠం, భరతముని, సర్వారాయ, తెలుగు విశ్వవిద్యాలయం, లోక్‌నాయక్ ఫౌండేషన్, వంగూరి ఫౌండేషన్, బోయి భీమన్న సాహితీ నిధి, బాలసాహిత్య పరిషత్, తెలుగు అకాడమీ ఇత్యాది పురస్కారాలు అందుకున్నారు.

ఆయన ఇచ్చే సందేశం "నాకు ఆకలి తెలుసు. అవిద్య తెలుసు. అవమానం తెలుసు. నిరుద్యోగం తెలుసు, అన్యాయం తెలుసు, అక్రమం తెలుసు, అధర్మం తెలుసు. వీటిని నేను పుష్కలంగా అనుభవించాను కాబట్టి ఇవి లేని సమాజం కావాలని నేను కోరుకుంటున్నాను"

తెలుగు జాతి గర్వించదగిన మహారచయిత డా. రావూరి భరద్వాజ.

*(ఈ శీర్షిక ఇంతటితో సమాప్తం)* ©

# అందరికీ వందనాలు!



**చ**తురలో నాలుగు సంవత్సరాలకు పైబడి 'జ్ఞానపీఠాలు' శీర్షిక అవిచ్ఛిన్నంగా సాగి పాఠకులను విశేషంగా ఆకట్టుకుంది. ముఖ్యంగా దేశభాషలకు సంబంధించి అనేకమంది ప్రముఖ కవులు, సాహితీవేత్తల వ్యక్తిగత, రచనా విశేషాలు సంక్షిప్తంగానైనా, సమగ్రంగా అందించే ప్రయత్నం చేశాను. ఈ 'జ్ఞానపీఠాలు' ధారావాహిక వ్యాసాలు రచించే అవకాశం కలిగించిన 'చతుర' సంపాదక వర్గానికి, అభిమానించిన పాఠక మిత్రులకు, సమాచార సేకరణలో సహకరించిన సాహితీ బంధువులకు కృతజ్ఞతలు.

**– గోవిందరాజు రామకృష్ణారావు**



# చతుర ప్ర.జ.

**పాఠకుల ప్రశ్నలకు అవధాన సరస్వతి డా. మేడసాని మోహన్ సమాధానాలు**

ప్ర. గృహంలో శివలింగాన్ని పూజించకూడదని ఎందుకంటారు?

– **వెలసిరి మధుసూదన్,** నల్గొండ

జ. గృహంలో శివలింగాన్ని పూజించుకోవచ్చు. గృహస్థులు వారి వారి ఇండ్లలో ఉండే శివలింగ మూర్తిని ఇష్టలింగేశ్వరస్వామిగా ఆరాధిస్తారు. అయితే ఇటువంటి లింగమూర్తుల పరిమాణంలో కొన్ని పరిమితులను పాటిస్తారు.

ప్ర. మరణం భగవంతుని నిర్ణయం కదా! మరి శ్మశానానికి వెళ్లి వచ్చాక యజ్ఞోపవీతం మార్చుతారెందుకు?

– **జి.వి.ఎస్. ప్రియంవద,** అర్సవిల్లి, శ్రీకాకుళం జిల్లా

జ. దుర్మార్గులైనా, సన్మార్గులైనా అందరి పార్థివదేహాలు శ్మశానానికి వెళతాయి. శ్మశానాన్ని ఆవరించి ఉండే పైశాచిక దుష్టలక్షణాలు, వాటి ప్రభావం అక్కడకు వెళ్ళిన జీవులపై ఉండవచ్చు. ఆ దుష్టప్రభావాల నుండి దూరంగా ఉండటానికే యజ్ఞోపవీతాదులు మార్చుకోవటం ఉంటుంది.

ప్ర. శ్రీచక్రాన్ని దేవాలయాల్లో తప్ప ఇళ్లల్లో పెట్టుకోకూడదంటారు.. ఎంతవరకు సమంజసం?

– **యు. విజయశేఖరరెడ్డి,** భాగ్యనగర్ కాలనీ, హైదరాబాద్

జ. శ్రీచక్రాన్ని ఇళ్లలో కూడా పూజింపవచ్చు. ఇంటిలోని పూజామందిరాన్ని దేవాలయంలాగా ఉంచుకోవాలి. క్రమం తప్పకుండా మంత్ర జప పారాయణాదులు, నైవేద్య సమర్పణలు సంప్రదాయబద్ధంగా నిర్వహించాలి.

ప్ర. స్వర్గం, నరకం ఊహాజనితాలని, చనిపోయిన తరువాత ఏమవుతుందో ఎవరికీ తెలియదని ఒక శాస్త్రవేత్త చెబుతున్నారు. ఏమిటిది?

– **టి. ఉషశ్రీ,** దగదర్తి, నెల్లూరు జిల్లా

జ. స్వర్గం, నరకం కేవలం ఊహాజనితాలు కావు. మంత్రద్రష్టలైన మహర్షులు వారి వారి తపోబలంతో యోగశక్తితో దర్శించి చెప్పిన అంశాలు. ప్రాచీనకాలంలో కూడా చార్వాకులు అనే మతంవారు వీనిని ఊహాజనితాలన్నారు.

ప్ర. శ్రాద్ధకర్మలు, సంవత్సరీకాలు సంతానంలో చిన్నవాడు చేయవచ్చా?

– **కొత్తపల్లి కళావతి,** టెక్కలి, శ్రీకాకుళం జిల్లా

జ. శ్రాద్ధకర్మలు, సంవత్సరీకాలు జ్యేష్ఠులు చేయాలి. లేదా కనిష్ఠులు చేయాలి. మధ్యములు చేయకూడదని శాస్త్రం పేర్కొంటోంది.

ప్ర. ఎవరైనా చనిపోయినప్పుడే గరుడ పురాణం చదవాలంటారు. ఆ తరువాత దానంగా ఇచ్చేయాలంటారు. అసలు గరుడ పురాణం ఇంట్లో ఉంచుకోవచ్చా?

– **అద్దంకి సీతాదేవి,** హైదరాబాద్,
**కె.వి. లక్ష్మణరావు,** మానేపల్లి, తూ.గో. జిల్లా

జ. ఎవరైనా చనిపోయినప్పుడు 'కఠోపనిషత్తు' పారాయణం చేయడం మనదేశంలో ఆచారంగా ఉండేది. కాలక్రమంలో కఠోపనిషత్తు మరుగున పడి గరుడపురాణం చదువుతున్నారు. గరుడ పురాణంలో ఔత్తరాహ ప్రతులకు, దాక్షిణాత్య ప్రతులకు చాలా వ్యత్యాసాలున్నాయి. గరుడ పురాణాన్ని ఇంటిలో ఉంచుకోవడం దోషంకాదు.

ప్ర. విశిష్టాద్వైత మతాచార్యులందరూ జెండా కర్రను ధరిస్తారు .. దీని అంతరార్థం ఏమిటి?

– **బి. రమేష్‌గాంధి,** కొత్తగూడెం, ఖమ్మం జిల్లా

జ. విశిష్టాద్వైత మతాచార్యులు ధరించే జెండా కర్రలను 'త్రిదండం' అంటారు. మూడు కర్రలను ఒక కర్రగా నిబంధించడంతో ఈ త్రిదండం ఏర్పడుతుంది. జీవ, ఈశ్వర, ప్రకృ

తులు- ఈ త్రిదండంలోని విభాగాలు. అంటే ఈ మూటి సమ్మేళనమే ఈ సృష్టి. ఈ సృష్టితత్త్వాన్ని సంపూర్ణంగా ఎరిగినవారే ఈ త్రిదండం ధరించ డానికి అర్హులు.

ప్ర. సూక్ష్మశరీర యానం ఉందా? ఈ విష యంలో ఉపనిషత్తులు ఏం చెబుతున్నాయి? వివరించగలరు

**– బి. శాంతి**, విజయవాడ

జ. జీవులందరికీ స్థూల, సూక్ష్మ, కారణ శరీ రాలున్నాయి. శరీరాన్ని వదిలిన తర్వాత జీవుని సూక్ష్మ శరీరం అతని పుణ్య, పాప ఫలితాలనను సరించి ఊర్ధ్వలోకాలకు గానీ, అధోలోకాలకు గానీ ప్రయాణం చేస్తుంది. ఈ యంశాన్నే కఠోపని షత్తు వంటి గ్రంథాలు, భగవద్గీత ప్రబోధిస్తు న్నాయి. బాగా విరగబూచిన మల్లెపొదపై గాలి వీచినపుడు ఆ సుగంధాన్ని వాయుతరంగాలు మోసుకొని పోతుంటాయి. గాలి ఏ దిక్కుగా వీస్తే ఆ దిక్కులో ఆ సుగంధాలు వెదజల్లు తాయి. అదే గాలి దుర్గంధ భూయిష్టమైన వస్తు వులపై వీచినపుడు చెడ్డవాసననే మోసుకొని పోతుంటాయి. జీవుని శరీరాంతర్గతంగా ఉన్న ప్రాణవాయువులు కూడా ఇంతే. జీవుడు సదాచా రాన్ని పాటించి తన శరీరాన్ని, అంతశ్చేతన ప్రభా వంతో జ్ఞానసుగంధాలు వెదజల్లే మల్లెపొదలాగా మలచుకోగలిగితే ప్రాణవాయు వీచికలతో సూక్ష్మశరీరం ఊర్ధ్వలోకాలకు పయనిస్తుంది.

శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధాని బంధయాత్

అని శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతలోని పురు షోత్తమ ప్రాప్తియోగంలో ఈ యంశాన్నే ఉపని షత్తుల సారాంశంగా విశదీకరించినాడు.

ప్ర. 'దేశభాషలందు తెలుగు లెస్స' అని శ్రీనా థుడు చెప్పగా తరువాతి కాలానికి చెందిన శ్రీకృ ష్ణదేవరాయలు అన్నట్లు చెబుతున్నారు.. ఇందులో ఏది యథార్థం?

**– తాజీ ప్రసాద్**, చెన్నై

జ. 'దేశభాషలందు తెలుగు లెస్స' అని ప్రప్ర థమంగా 'క్రీడాభిరామము' అవతారికలో ఉంది. ఈ గ్రంథాన్ని వినుకొండ వల్లభరాయుడు రచిం చినట్లుగా అందు పేర్కొని ఉంది. కానీ శ్రీనా థుడే రచించినాడని పలువురు పండితుల అభి ప్రాయం. ఈ గ్రంథ కర్తృత్వం ఇలా వివాదాస్ప దమైనందు వల్ల కావచ్చు లేదా శ్రీకృష్ణదేవ రాయల ఆముక్తమాల్యద అవతారికలో కూడ 'దేశభాషలందు తెలుగులెస్స' అని శ్రీకాకుళాంధ్ర విష్ణుదేవుని వాక్కుగా పేర్కొనడం వల్ల కావచ్చు ఈ కంఠోక్తి రాయలవారి పేరుతోనే బహుళప్ర చారం పొందింది.

## రూ.116/- బహుమతి పొందిన
# ఉత్తమ ప్రశ్న

ప్ర. శ్రీకృష్ణుడి పక్కన ఒక స్త్రీ ఉందంటే 'రాధాకృష్ణులు' అంటారే తప్ప ఆయనకున్న అష్టభార్యల్లో ఎవరినీ చెప్పరెందుకు?

**– బిక్కునూరి రాజేశ్వర్**,
నిర్మల్, ఆదిలాబాద్ జిల్లా

జ. శ్రీకృష్ణుడు కేవలం ఒక అవతార మూర్తి కాదు. సకల సృష్టికీ నియామకుడై, అధినాథుడైన స్వయం ప్రకాశుడు. ఈ సృష్టి లోని అష్టప్రకృతులే ఆయన అష్టభార్యలు. ఈ అష్టప్రకృతుల సమ్మేళన శక్తి రాధ. అష్ట ప్రకృతుల సమాహారమైన రాధానాథుడే శ్రీకృ ష్ణుడు. వీరిరువురి సమాగమం కేవలం శృంగార భావన కాదు. ఇది యోగ భావన.

ప్ర. ఎక్కడికైనా బయలుదేరేముందు ఎవరైనా తుమ్మితే ఆగిపోతారెందుకు?

**– కొక్కెరగడ్డ శ్రీదేవి**, మానేపల్లి, తూ.గో. జిల్లా

జ. మనం ఎక్కడికైనా కార్యార్థం బయలుదేరే సమయంలో ఎవరైనా తుమ్మినారంటే, ఆ కార్య క్రమం నిర్విఘ్నంగా నిర్వహించడానికి తగిన ప్రకృతి శక్తుల సహకారం లభించడం లేదు- అని సూచనగా పెద్దల నమ్మకం. అయితే రెండుసార్లు తుమ్మడం జరిగితే ప్రకృతి శక్తులు సహకరిస్తు న్నాయి- అని అర్థం చేసుకోవాలి అని కూడా నేను పెద్దల వద్ద విన్నాను. ఈవిషయమై నా స్వీయానుభవాలు కూడా ఉన్నాయి. నేను విద్యార్థి దశనుంచి అవధాన సభలకు వెళుతూ ఉండేవాణ్ణి. ఒకసారి అలా బయలుదేరే సమ యంలో ఎవరో రెండుసార్లు తుమ్మినారు. అప్పుడు మా అమ్మ నాకీ విశ్వాసాన్ని గురించి చెప్పింది. అయితే ఈ నమ్మకానికి ఒక సంప్రదా యబద్ధమైన నేపథ్యం ఉన్నట్లు కనబడదు.

ప్ర. నియోగుల అబ్బాయికి, శ్రీవైష్ణవుల అమ్మాయిని ఇవ్వాలనుకున్నప్పుడు.. ఇద్దరి గోత్రాలు ఒకటే అయ్యాయి. శాఖలు వేరైనందున ఈవివాహం శాస్త్రసమ్మతమవుతుందా? కాదా?

– రమాదేవి, రేపల్లె, గుంటూరు జిల్లా

జ. నియోగులు, శ్రీవైష్ణవులు శాఖలు వేరైనా ఏక గోత్రీయులైన వధూవరులకు వివాహం శాస్త్ర సమ్మతం కాదు. మన ప్రాచీనులు గోత్రానికి చాలా ప్రాధాన్యం ఇచ్చారు.

ప్ర. భగవంతుని భక్తిశ్రద్ధలతో పూజిస్తే ఎక్కువ పుణ్యం వస్తుందా? సాటి మనుషులకు.. కష్టాల్లో ఉన్నవారికి సాయం చేస్తే ఎక్కువ పుణ్యం వస్తుందా?

– పల్లా పవన్‌కిశోర్, ప్రొద్దుటూరు

జ. భగవంతుని అనన్య భక్తిశ్రద్ధలతో ఆరాధించడం ఒక మహత్తర సంస్కారం. ఆ సంస్కారంలో పరిణతిని సాధించిన సాధకులు ప్రతి జీవిలోను భగవంతుని చూస్తారు. అందుకే సాటిజీవులు కష్టాల్లో ఉన్నప్పుడు స్వతస్సిద్ధంగా పరోపకారం చేయగలిగిన లక్షణం వారిలో ఉద్భవిస్తుంది. కాబట్టి సాటిమనుషులకు, కష్టాల్లో ఉన్నవారికి సాయం చేస్తే అటువంటి సత్కార్యాలతో భగవంతుని జీవుడు ఎక్కువగా మెప్పింపగలడు. తద్వారా పుణ్యం కూడా ఎక్కువగా సంప్రాప్తిస్తుంది.

ప్ర. సూర్యుడు ప్రత్యక్షదైవం కదా! మరి గ్రహణంరోజు సూర్యదేవాలయం కూడా మూసేయాల్సిన అవసరం ఉందా?

– జి. విజయశ్రీ, అరసవిల్లి, శ్రీకాకుళం జిల్లా

జ. సూర్యుడు ప్రత్యక్షదైవం. ఆ సూర్యుని వెలుగులు లోకాలకు శుభదాయకాలు. కానీ సూర్యగ్రహణం రోజు ఆ సూర్యుని కప్పివైచిన దుష్టగ్రహానికి సంబంధించిన ఛాయలు మనం పరమపవిత్రంగా భావించే దేవాలయంపై పడకూడదని ఆగమశాస్త్రాలు బోధిస్తున్నాయి. ఆ సమయంలో మూసివేయని దేవాలయాలు కూడా ఉన్నాయి. ఉదాహరణకు శ్రీకాళహస్తీశ్వరాలయం. ఇక్కడ రాహుకేతు దోషాలను నివారించే పూజలు ప్రతిరోజు జరుగుతుంటాయి.

ప్ర. మూలవిరాట్‌ను ఫొటోలు ఎందుకు తీయనీయరు?

– నోముల సురేందర్ రావు,
హబ్సీగూడ, హైదరాబాద్

జ. 'మూల విరాట్'- అంటే అనంతమైన భగ

# చతుర ప్ర.జ. 9

ఉత్తమ ప్రశ్నకు రూ.116/-

ప్రశ్న: ..........................................................................

..........................................................................

..........................................................................

..........................................................................

పంపినవారి పేరు: ------------------------------------

వయసు (   ) చిరునామా: ------------------------------

----------------------------------------------------

-----------------పిన్ : ------------ ఫోన్ : --------------

**సూచనలు**

* ఉత్తమ ప్రశ్నను అవధాని డా. మేడసాని మోహన్ ఎంపిక చేస్తారు * మీ ప్రశ్న ద్వారా రాబట్టే సమాధానం పదుగురికీ ఉపయోగపడేలా ఉంటే మేలు * ఏ నెల ప్రశ్నలు ఆ నెల కూపన్‌లోనే నింపి పంపాలి * ప్రశ్న స్పష్టంగా, సంక్షిప్తంగా ఉండాలి * ఒకరు ఎన్ని ప్రశ్నలయినా పంపవచ్చు. ఒక కూపన్‌పై ఒక్క ప్రశ్న మాత్రమే రాయాలి * తుడుపులు, కొట్టివేతలొద్దు * ప్రశ్నల ఎంపికలో సంపాదక వర్గానిదే తుది నిర్ణయం * ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు * ఈ కూపన్లు కూడా తక్కిన వాటితో కలిపి ఒకే కవరులో పంపవచ్చు.

చిరునామా : **చతుర ప్ర.జ.**

చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

వత్కళలు ఆవహించిన అర్చామూర్తి. అటువంటి అర్చామూర్తిని ఫొటోలు తీయడం వల్ల ఆ దివ్యత్వాన్ని అపవిత్రం చేసినట్లవుతుందని ఆగమశాస్త్ర కోవిదులైన పెద్దలు పేర్కొంటారు.

ప్ర. విద్యాగంధం లేనివారు కావ్యాలు చదువలేరు, శ్లోకాలు వల్లించలేరు. అలాంటివారు భక్తిని ప్రదర్శించుకోడానికి ఉత్తమమార్గమేది?

**- డా. శివభూషణం,** కర్నూలు

జ. విద్యాగంధంలేనివారు కేవలం రామ, కృష్ణ, గోవింద- ఇత్యాది నామ సంస్మరణంతో భగవంతునిపై అనన్య భక్తి యోగాన్ని పెంపొందించుకోవచ్చు. భగవంతునికి ఇష్టమైన సత్కార్యాలు చేయడంతో ఆ పరమాత్మను మెప్పింపవచ్చు.

ప్ర. ఈసారి వైకుంఠ ఏకాదశి తిరుమలలో ఒకరోజు, భద్రాచలంలో ఒకరోజు జరిపారు. ఏది సబబు? అసలు ఎందుకీ భేదాలు?

**- తటవర్తి పవన్‌కుమార్,**
తాళ్లగడ్డ, హైదరాబాద్

జ. తిరుమలలో వైఖానస ఆగమానుసారం కైంకర్యాలు నిర్వహింపబడుతాయి. భద్రాచలంలో పాంచరాత్రాగమానుసారం కైంకర్యాలు నిర్వహింపబడుతాయి. కొన్ని కొన్ని పూజల నిర్వహణలలో వివిధ ఆగమ శాస్త్రాలు పేర్కొనే కొన్ని తేడాలుంటాయి. ఆ తేడాలే ఇటువంటి భేదాలకు కారణాలు. ఈ భేదాలను భక్తిసాధనలో పురోగమించే సాధకులు పట్టించుకోనవసరం లేదు.

ప్ర. పవిత్రమైన 'రామ' శబ్దం ఒక్కటే భక్తితో సంకీర్తిస్తే చాలదా? అష్టోత్తరశతాలు.. సహస్ర నామాల పారాయణాలు అవసరమా?

**- తల్లాప్రగడ మధుసూదనరావు,** బెంగళూరు

జ. పవిత్రమైన రామ శబ్దం ఒక్కటే భక్తితో సంకీర్తనం చేస్తే చాలు. ఇతర పారాయణాలు అవసరం లేదు. 'శ్రీరామరామ రామేతి రమే రామే మనోరమే! సహస్ర నామతత్తుల్యం రామ నామ వరాననే'- అని విష్ణు సహస్రనామస్తోత్రం లోనే ఈ యంశం స్పష్టంగా ఉంది.

ప్ర. సృష్టి, స్థితి, లయకారులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు ఈ శక్తులెలా వచ్చాయి?

**- డా. జనార్దన సింగ్,** నల్లకుంట, హైదరాబాద్

జ. సృష్టిస్థితి లయకారకులైన త్రిమూర్తులు స్వయంశక్తి సంపన్న మూర్తులు. సూర్యచంద్రాదులకున్న ఆయా ప్రకాశాలు మనం ప్రత్యక్షంగా చూస్తున్నాం కదా! అలాగే త్రిమూర్తుల స్వయం శక్తి ప్రకాశాలను యోగులు చూడగలరు.

ప్ర. విద్యాగణపతి, లక్ష్మీగణపతి, దుర్గాగణపతి .. ఇలా అమ్మవారి పేర్లతో గణపతిని పూజించడంలో ఉద్దేశ్యం ఏమిటి?

**- బి.వి.ఆర్.ఎస్.ఎస్.ఎస్. ప్రసాద్,**
కాశీబుగ్గ, శ్రీకాకుళం జిల్లా

జ. శంకర భగవత్పాదులవారు స్థాపించిన షణ్మతాలలో గాణాపత్యం అంటే గణపతిని ఆరాధించే విధానాలతో కూడిన మతం కూడా ఉంది. ఈ సంప్రదాయంలో గణపతిమూర్తి విశేషాలు అనేకం ఉన్నాయి. అలాగే గణపతి ఆవిర్భావానికి పితృదేవుడైన శివుని సంకల్పం కంటే మాతృమూర్తి సంకల్పబలమే కారణం. ఆ సంకల్పబలంతో కూడిన నేపథ్యం వల్ల గణపతిని మాతృమూర్తులైన సరస్వతి, లక్ష్మి, దుర్గల పూర్వనామధేయ సహిత మూర్తులుగా ఆరాధిస్తే శీఘ్రంగా ప్రసన్నుడవుతాడు.

ప్ర. ఇంట్లో దేవునిగదిలో కలశాన్ని ప్రతి శుక్రవారం పెట్టుకోవాలా? నెలకోసారి పెట్టుకుంటే సరిపోతుందా?

**- యు. విజయశేఖరరెడ్డి,**
భాగ్యనగర్ కాలనీ, హైదరాబాద్

జ. ఇంట్లో దేవుని గదిలో కలశాన్ని ప్రతి శుక్రవారం పెట్టుకోవడం ఉత్తమం. దేశాంతర ప్రయాణాలు, ఇతరత్రా కార్యక్రమాలు కలిగిన సాధకులు నెలకొకసారి పెట్టుకున్నా మంచిదే. వారానికొక్కసారియైనా, నెలకొక్కసారియైనా అంకిత భావంతో కైంకర్యాలు చేయడం ముఖ్యం.

ప్ర. ఉత్తరాదిన, కర్ణాటకలోని కొన్నిప్రాంతాల్లో వధువు తొలిసారిగా అత్తవారింటికి వచ్చినప్పుడు బియ్యం పాత్రను కాలితో నెట్టమంటారు. అన్నపూర్ణాదేవి స్వరూపమైన బియ్యాన్ని కాలితో నెట్టడం అపచారం కాదా?

**- ఎస్. ప్రసాద్,** టి. నగర్, చెన్నై

జ. నూతన వధువుగా ఉన్న సమయంలో ఆమె లక్ష్మీ స్వరూపిణి. ఆపాదమస్తకం లక్ష్మీ కళలు ఆవహించి ఉంటాయి. ఆ సందర్భంలో బియ్యం పాత్రను కాలితో నెట్టడం అపచారం కాదు.

లక్ష్మీ స్వరూపిణియైన వధువు పాదం పెట్టినంతనే ఆ ఇంటిలో సకల సంపత్ప్రదాతయైన ధాన్యలక్ష్మి పొంగిపొరలాలి- అన్నదే ఇందలి ఆంతర్యం.

# కాలాతీతం

డి.హెచ్. లారెన్స్



# సన్స్ అండ్ లవర్స్

ఇది ఆత్మకథాత్మక నవల. తల్లీకొడుకుల మధ్య ఉన్న అప్రకటిత లైంగికత (ఈడిపల్ సంబంధం) ఇందులోని ఇతివృత్తమైనా, అప్పటికింకా లారెన్స్ ప్రఖ్యాత మానసిక శాస్త్రవేత్త ఫ్రాయిడ్ సిద్ధాంతాన్ని చదవలేదు. అతని ఆరోగ్యం పూర్తిగా దిగజారలేదు. 'జీవశక్తి సెక్సు. నైతిక సంబంధాల పేరుతో దానికి సంకెళ్లు వేయవద్దు' లాంటి వివాదాస్పద వ్యాఖ్యలు కూడా చేయలేదు. కథను మరచి సిద్ధాంతాల ప్రచారంకోసం రాసిన నవల కూడా కాదిది.

కథానాయకుడు పాల్ మారెల్ నిజానికి లారెన్స్‌కు ప్రతిరూపమే. 'మిరియం' పాత్రకు ఆధారం అతణ్ణి రచనకు ప్రోత్సహించిన జెస్సీ ఛేంబర్స్ అనే యువతి.

తల్లీకొడుకుల అనుబంధాన్ని అత్యంత ప్రతిభావంతంగా చిత్రించిన నవలగా ఆధునిక సాహిత్యంలో దీనికో ప్రత్యేక స్థానముంది. కేవలం పాత్ర చిత్రణే గాదు, కవితాత్మకమైన ప్రకృతి వర్ణనలలో కూడా రచయిత ప్రదర్శించిన ప్రతిభ అద్భుతం. మొదటిసారి చదివినప్పుడు మోహావేశంతో సాగే తుపానులాంటి కథనంలో కొట్టుకుపోతారు పాఠకులు. హేతువాద దృక్పథం, పారిశ్రామిక జీవనవిధానం స్త్రీపురుష సంబంధాలను, వ్యక్తులలో అంతర్లీనంగా వున్న మార్మిక, ఆధ్యాత్మిక భావనలను కలుషితం చేస్తాయని నమ్మాడు లారెన్స్.

'తల్లి ప్రేమకు బందీలైన పిల్లలు తాము ఎదిగే క్రమంలో విముక్తి కోసం పోరాడాలి' అనుకుంటాడు కథానాయకుడు.

★ ★ ★

గెర్ట్రూడ్ కోపర్డ్‌కు ఇరవైమూడేళ్లు. అంద

గత్తె. సంస్కారవతి. తండ్రి ఇంజనీరు. కాస్త డబ్బున్న కుటుంబమే. చూపులతో తనకు గాలంవేసిన మరో అందగాడు వాల్టర్ మారెల్‌ను యిష్టపడి పెళ్లి చేసుకుంది గెర్ట్రూడ్. అతడు బొగ్గుగనిలో కార్మికుడు. కొత్త దంపతులు నాటింగామ్ షైర్‌లోని బొగ్గుగనుల నగరం బెస్ట్‌వుడ్‌లో స్థిరపడతారు. కాని త్వరలోనే తాను తప్పు చేశానని గ్రహిస్తుంది గెర్ట్రూడ్. వాల్టర్ సోమరిపోతు. తాగుబోతు. సంస్కారహీనుడు. సరిగా చదువుకోలేదు గనక కనీస విషయ పరిజ్ఞానం లేదు.

అయిష్టంగానే సంసారం కొనసాగుతుంది. నలుగురు పిల్లలు పుడతారు. విలియం, ఆనీ, పాల్, ఆర్థర్. వాళ్లే ఆమెకు సాంత్వన. తప్పతాగి యింటికి వచ్చిన భర్త పిల్లలమీద చెయ్యి చేసుకోబోతే అడ్డు పడుతుంది. ఎంత చెప్పినా అతడు మారడు. ఒట్టి బ్రూట్. సంపాదన లేదు. ఇల్లు గడవటం కష్టమైపోతుంది. నాటింగామ్‌లో పెద్దకొడుకు విలియం గుమాస్తాగా పనిచేస్తాడు. వాడు చాలా ఆంబిషస్. ధనికులతో కలసి తిరగటం, వాళ్లతో డాన్సు పార్టీలకెళ్లటం వాడికిష్టం. తను కాస్త నిలదొక్కుకోగానే, కష్టాల్లో వున్న కుటుంబాన్ని వదిలి లండన్‌లో స్వంత జీవితం ప్రారంభిస్తాడు. అప్పటికి వాడికి ఇరవైయ్యేళ్లు.




ఇక తనకు రెండో కొడుకే ఆధారం అనుకుంటుంది గెర్ట్రూడ్. తన ఆశాజ్యోతి పాల్. ఈ కుర్రాడు చాలా సెన్సిటివ్. కళాభిరుచి వుంది. తండ్రి దురలవాట్లను చూసి అసహ్యించుకుంటాడు. తల్లిపట్ల అంత క్రూరంగా ప్రవర్తించటం చూసి తండ్రి మీద ద్వేషం పెంచుకుంటాడు.

ఒక లాయర్ ఆఫీస్‌లో మంచి వుద్యోగం సంపాదించిన విలియం సంపాదన పెరుగుతుంది. యింటికి చిల్లిగవ్వ కూడా పంపించడు. ఒకనాడు తన గర్ల్‌ఫ్రెండ్ లిలీ వెస్టర్న్‌ను వెంటపెట్టుకుని వచ్చి ఆమెను తను పెళ్లి చేసుకోబోతున్నానని చెబుతాడు. లిలీకి టెక్కు ఎక్కువ. పేద కుటుంబాన్ని చీదరించుకున్నట్టుగా చూస్తుంది. గ్రెర్ట్రూడ్‌కు ఆ పిల్ల వాలకం ఏమాత్రం నచ్చదు. 'ఈమె నీకు తగదు' అని చెబుతుంది విలియంతో.

తరువాత కొన్నాళ్లకే లండన్‌కు రమ్మని గెర్ట్రూడ్‌కు కబురొస్తుంది. విలియంకు న్యూమోనియా సోకింది. చావుబతుకుల్లో వున్నాడు. ఎవరూ చెయ్యగలిగింది ఏమీలేదు. త్వరలోనే తుదిశ్వాస విడుస్తాడు విలియం. పాల్ ఇంకా మిగిలివున్నాడని గుండె దిటవు చేసుకుంటుంది తల్లి. తమ్ముళ్లంటే వాడికి ప్రేమ. పశువులాంటి తండ్రి నుండి వాణ్ని రక్షించటం తన కర్తవ్యం. పాల్‌ను బుజ్జగిస్తుంది. ముద్దుచేస్తుంది తల్లి. తన అనురాగమంతా వాడిమీద కుమ్మరిస్తుంది. జీవితం గురించి తను ఎన్నో కలలు గన్నది. ఆ కోరికలన్నీ వాడు తీర్చాలి. కాని పిల్లలకు కేవలం తల్లిపోలికలు మాత్రమే వస్తాయా? తండ్రి సంగతేమిటి? అతడిలో మంచి లక్షణం ఒక్కటీ లేదా? తల్లి కలల్లో బతుకుతుంది. కాని తండ్రి కఠోర వాస్తవికతకు ప్రతిరూపం.

# డి. హెచ్. లారెన్స్ (1885 - 1930)

లారెన్స్ నవలలు ఇప్పుడు ఎవర్నీ షాక్ చెయ్యవు. కాని 1920లలో అతడు చాలా వివాదాస్పదమైన రచయిత. తన రచనల్లో స్త్రీ, పురుషుల సెక్స్ సంబంధాల గురించి చర్చించటమే అందుకు ప్రధాన కారణం. అప్పటి సాంప్రదాయిక విమర్శకులకు, పాఠకులకు కూడా అవి మింగుడు పడలేదు. ఇంచుమించు మన 'చలం'లాగే. ఈ ఇద్దరి మధ్యా చాలా పోలిక లున్నాయనే వాళ్లూ ఉన్నారు. ఛాందసభావాల మీద యుద్ధం ప్రకటించాడు లారెన్స్. నవలా రచనలో కొత్త పుంతలు తొక్కాడు. ఆ పుస్తకాలు సృష్టించిన అలజడిలో అతడు గొప్ప కళాకారుడనే విషయం అందరూ విస్మరించారు.

కొందరు అతడ్ని 'ఫ్రాయిడియన్ రచయిత' అంటారు. ఇది కొంతవరకు వాస్తవమే. సృజనా ప్రక్రియకు మూలం లైంగిక వాంఛ అన్నది ఆ సిద్ధాంతం. అయితే వ్యక్తి ఆత్మాన్వేషణలో ఇది ఒక భాగమని మాత్రమే ఆయన విశ్వాసం. మనిషి పరిపూర్ణంగా ఎదగడానికి 'లిబిడో' కీలకం. సహజ నియమాలు ఈ కోరికను అణచుకోవాలని అంటాయి. స్వేచ్ఛకు సంకెళ్లుగా మారిన ఈ ఆంక్షలను తెంచుకున్నప్పుడే వ్యక్తి అద్భుతానందాన్ని ఆస్వాదించగలడు. 'సెక్సు సిగ్గుపడవలసిన, నిషిద్ధ విషయం కాదు. అది ప్రతి మనిషి శారీరక, మానసిక జీవితానికి మూలస్తంభం' అని చెప్పడమే నా ఉద్దేశం అన్నాడు. తాను కేవలం సెక్స్ సమస్యల రచయితను కాదన్నాడు. తన రచనలు సమాజంలో ఇంత దుమారం రేపుతాయని ఊహించలేదు లారెన్స్. ఈయన చివరి నవల 'లేడీ చాటర్లీస్ లవర్స్' (1928) నిషేధానికి గురైన విషయం సాహితీలోకానికి తెలిసిందే.

ఇంగ్లండులోని నాటింగామ్‌షైర్, ఈస్ట్‌వుడ్‌లో జన్మించారు డేవిడ్ హెర్బర్ట్ లారెన్స్. తండ్రి గని కార్మికుడు. తల్లి స్కూల్ టీచర్. తమలాగ పిల్లలు కూడా పేదరికంలో మగ్గిపోకుండా, బాగా చదువుకుని పైకి రావాలని ఆమె కోరిక. లారెన్స్ బాల్యం నుండీ అనారోగ్య పీడితుడు. సన్నగా, పీలగా ఉండేవాడు. తల్లి ప్రోద్బలంతో స్కాలర్‌షిప్ సంపాదించి మరీ

మొదట నాటింగామ్‌లో ఒక చిన్న వుద్యోగం సంపాదించుకుంటూడు పాల్. ఎంత పనిచేసినా వారానికి ఎనిమిది షిల్లింగులకు మించదు జీతం. అయినా ఈ మాత్రం సంపాదనతోనే తృప్తిపడి, పనికి రాని కబుర్లతో కాలక్షేపం చేస్తున్న సహోద్యోగులను చూస్తాడు.

ఒకనాడు సైకిల్‌మీద పక్కవూళ్లో వున్న విల్లీ ఫాంకు వెళతాడు. అక్కడ బొగ్గుగనులు లేవు. వాతావరణం ప్రశాంతంగా ఆహ్లాదకరంగా వుంటుంది. ఫాం యజమానులు లీవర్స్‌తో పరిచయం ఏర్పడుతుంది. వాళ్ల చెల్లెలు పదిహేనేళ్ల మిరియం అతడ్ని ఆకర్షిస్తుంది. అయితే లీవర్స్‌కు మత విశ్వాసాలెక్కువ. పొలం పనులతో క్షణం తీరికలేని మిరియం, పాల్ రాకతో కాస్త సేదదీరి, తీరిగ్గా మనస్సు విప్పి మాట్లాడుతుంది.

కొన్నాళ్లకు జబ్బుపడి, కోలుకుంటున్న దశలో, తరచుగా ఫాంకు వెళ్లిన పాల్, మిరియంకు ఫ్రెంచి, గణితం ట్యూషన్ చెప్పే క్రమంలో ఆమెతో ప్రేమలో పడతాడు. మిరియంకు ప్రేమంటే ఒక పవిత్ర భావన. ఒక ఆధ్యాత్మిక అనుభవం. శారీరకస్పర్శ కూడా ఇష్టపడదు. పాల్‌లో ఫ్రస్ట్రేషన్ పెరుగుతుంది. కొడుకు తనకెక్కడ దక్కకుండా పోతాడో అనే భయంతో గెర్ట్రూడ్ కూడా పాల్‌ను మిరియం నుండి దూరంగా వుంచటానికే ప్రయత్నిస్తుంది. తరచూ ఆ పిల్లను చూడటం మంచిదికాదని కొడుక్కు నచ్చచెబుతుంది. అయితే ఆమెకు తెలుసు, తను క్యాన్సర్‌రోగి అనీ,

నాటింగామ్‌షైర్ హైస్కూల్లో చదువుకున్నాడు. అక్కడే యూనివర్సిటీ కాలేజీలో టీచర్ ట్రెయినింగ్ కూడా పూర్తిచేశాడు. అయితే టీచర్‌గా ఎక్కువ కాలం కొనసాగలేదు.

కొడుకు రచయితగా రాణించాలని తల్లి కోరిక. ఆమె మరణం తర్వాత ఏడాదికి, 1911లో లారెన్స్ తొలి నవల 'వైట్ పీకాక్' వెలువడింది. ఆ తర్వాత గాఢంగా ప్రేమించి, ముగ్గురు పిల్లల తల్లి అయిన ఫ్రీడా వాన్ రిక్తోఫెన్ అనే అరిస్టోక్రాట్ లేడీని పెళ్లి చేసుకున్నాడు యువ రచయిత. తను నవలల్లో సృష్టించిన 'విముక్త మహిళ' ఆమె. ఆనాటి ప్రముఖ రచయితలు కేథరిన్ మేన్స్‌ఫీల్డ్, జె.ఎం. ముర్రె, సర్ హెర్బర్ట్ ఆస్క్విత్, ఆల్డస్ హక్స్‌లీలు లారెన్సుకు మంచి మిత్రులు. మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. ఇంగ్లండులో అనేకమంది స్వచ్ఛందంగా యుద్ధంలో పాల్గొన్నారు. కాని లారెన్స్ దంపతులకిదో ముఖ్యమైన విషయం కాదు. ఈ నిర్లిప్తత చూసి పోలీసులకు వాళ్లమీద అనుమానం వచ్చింది. ఫ్రీడా జర్మన్ జాతీయురాలు. గూఢచారులు కావచ్చునని నిఘా పెట్టారు. లారెన్సు నవలలన్నీ సెన్సార్ ఆగ్రహాన్ని చవి చూసినవే. అయినప్పటికీ 'సన్స్ అండ్ లవర్స్' (1913) ఒక మాస్టర్‌పీస్. 1915లో 'ది రెయిన్ బో'లో కనిపించిన లారెన్స్ విపరీత సెక్సు ధోరణికి ఆగ్రహించి, పోలీసులు ఆ నవల ప్రతులన్నీ తగులబెట్టారు. అయితే ఎవర్నీ ఖాతరు చేయని, సమకాలీన రచయితలు, మేధావులతో కూడా స్నేహ సంబంధాలు పెట్టుకోని లారెన్స్ స్వభావం ఇందుకు కొంత కారణమంటారు.

తరువాతి నవల 'విమెన్ ఇన్ లవ్' (1920). సమశీతోష్ణ స్థితిలో ఆరోగ్యం బాగుపడుతుందనే ఆశతో లారెన్స్ ఆస్ట్రేలియా, మెక్సికో, నైరుతి అమెరికాలు పర్యటించాడు. అలా వెలువడిన యాత్రా కథనాలే 'ట్విలైట్ ఇన్ ఇటలీ' (1916), సీ అండ్ సార్డీనియా (1921), మార్నింగ్స్ ఇన్ మెక్సికో. తీవ్ర అనారోగ్యంతో బాధపడుతూ ఆయన రాసిన నవల ది ఫ్లూమ్డ్ సర్పెంట్ (1926).

నిషేధించబడినప్పటికీ 'లేడీ చాటర్లీస్ లవర్స్' ఆయన రచనలన్నింటిలోకి ఉత్కృష్టమైందని తర్వాతి తరాల సాహితీప్రియుల అభిప్రాయం. షార్ట్ స్టోరీ రైటర్‌గా ఆయనను మించినవాళ్లు లేరు అని కూడా అంటారు. ఇవన్నీగాక లారెన్స్ మంచి కవి.

ఎక్కువరోజులు బతికే అవకాశం లేదనీ. ఒకనాడు మిరియంను తాను ప్రేమించటం లేదని చెప్పిన కొడుకును గాఢంగా ముద్దు పెట్టుకుని జీవితం కళాసేవలో గడపమని చెబుతుంది. 'ఏ స్త్రీ సాంగత్యమూ అతణ్ని కళ నుండి దూరం చెయ్యకూడదు. కళాకారుడిగా గుర్తింపు తెచ్చుకోవటమే జీవిత లక్ష్యం కావాలి' ఇది ఆమె అభిలాష.

మిరియం ద్వారా పాల్‌కు క్లారాడాస్ పరిచయం అవుతుంది. ఆమె పాల్‌కన్నా అయిదేళ్లు పెద్దది. ఒకలోహ కార్మికుని భార్య. స్వభావం మిరియంకు పూర్తిగా విరుద్ధం. మిరియం పురుష సాంగత్యాన్ని ఏవగించుకుంటుంది. క్లారా శృంగార దేవత. ఆమె పాల్‌కు మిస్ట్రెస్ కావటానికి ఎంతోకాలం పట్టదు. మిరియంకు వీళ్ల సంబంధం గురించి తెలియదని కాదు. కాని తన పవిత్ర ప్రేమదే అంతిమ విజయమని ఆమె నమ్మకం. అయితే భర్తకు విడాకులివ్వటానికి నిరాకరిస్తుంది క్లారా. ఇదీ ఓరకంగా మంచిదే. పాల్‌కు ఆమెను పెళ్లి చేసుకునే ఉద్దేశం లేదు. తన తల్లిని మించిన స్త్రీ ఈ లోకంలో మరెవరూ లేరనుకుంటాడు. అన్ని కష్టాలను భరించి కేవలం తన కోసమే బతికిన తల్లి అంటే అంత ప్రగాఢమైన విశ్వాసం అతడికి.

చిత్రకారుడిగా పాల్ విమర్శకుల మన్ననలు పొందుతాడు. టీచర్ ట్రెయినింగ్ పూర్తి చేసిన చెల్లెలు ఆనీ, సైన్యంలో కొంత కాలం పనిచేసి వచ్చిన ఆర్థర్ (ప్రియురాలు గర్భం దాల్చటంతో) పెళ్లి చేసుకుంటాడు. గని ప్రమాదంలో గాయపడిన వాల్టర్

మారెల్ మంచం పడతాడు. ఇప్పుడు తల్లి దండ్రుల పోషణ బాధ్యత పాల్‌దే. తల్లిని వీలైనంత సుఖపెట్టడానికి ప్రయత్నిస్తాడు.

పాల్ మీద క్లారా కన్న మిరియం ప్రభావమే ఎక్కువగా ఉందని గ్రహించిన గెర్ట్రూడ్, అతడు క్లారాను పెళ్లి చేసుకోవటానికి తన అంగీకారం తెలియజేస్తుంది. రంకు సంగతి తెలిసిన క్లారా భర్త పాల్‌ను చావగొట్టి, తీవ్రంగా గాయపరుస్తాడు. ఆ తర్వాత క్లారా వైపు చూడటానికి కూడా భయపడతాడు పాల్.

మిరియంతో ప్రేమ కొనసాగుతుంది. ఒకసారి ఆమె శారీరక సంపర్కానికి అంగీకరిస్తుంది. కాని అందులో ఆనందం లభించదు. సెక్స్ అంటే కేవలం శారీరకానుభవం కాదు. తల్లి మృత్యుముఖంలో వున్నదని తెలిసి ఆమెను చూడటానికి ఆస్పత్రికెడతాడు పాల్. అక్కడ బాక్స్టర్ డాస్ (క్లారా భర్త) కనిపిస్తాడు. టైఫాయిడ్ వచ్చిందతడికి. అనూహ్యంగా ఇద్దరూ మంచి స్నేహితులవుతారు. ఇక బతకదని తెలిసి గెర్ట్రూడ్‌ను ఇంటికి తీసుకొస్తారు. చివరిదశలో ఆమె బాధతో మెలితిరిగిపోతుంటుంది. కేకలు పెడుతుంది. ఎక్కువ మోతాదులో మార్ఫైన్ ఇచ్చి తల్లికి విముక్తి కలిగిస్తాడు పాల్. తెల్లవారేసరికి ఆమె మరణిస్తుంది.

నిరాశానిస్పృహలతో కుంగిపోతాడు పాల్. సెక్స్ అంటే ఇష్టపడని మిరియంతో సంబంధం తెంచుకుంటాడు. క్లారా, భర్తతో సజావుగా కాపురం చేస్తోంది. ఒకరి గురించి ఒకరికి కనీస అవగాహనలేని తండ్రికొడుకులు ఒకే ఇంట్లో కలిసివుండటం సాధ్యపడదు. ఇన్నాళ్లూ ఇద్దరిమధ్యా లింకు గెర్ట్రూడ్. ఇప్పుడామె లేదు. వేర్వేరు ఇళ్లకు మారిపోతారు పాల్, వాల్టర్.

దేశాటన చేస్తాడు పాల్. విదేశాల్లో కళాభ్యాసం చెయ్యాలనుకుంటాడు. మరికొన్నిసార్లు త్వరగా తనువు చాలించి తన తల్లిని చేరుకోవాలనుకుంటాడు.

క్రమంగా కళాప్రపంచంలో పాల్ చిత్రాలకు గుర్తింపు వస్తుంది. ఇదే తల్లి కోరిక! చివరిసారిగా మిరియంను కలుస్తాడు. తన కోసం ఏ త్యాగానికైనా ఆమె సిద్ధమే. కాని ఒక స్త్రీలాగా ప్రేమించలేదు. సహజీవనంతో ఇద్దరికీ నరకమే. ఎవరూ సుఖపడరు. ఒంటరిజీవితం తప్పదు. కంటిపాపలా తనను చూసుకోవటానికీ, అప్పుడప్పుడూ కోప్పడటానికీ ఇప్పుడు తల్లి కూడా లేదు. 'తల్లిప్రేమ' కొడుకు ఎదుగుదలకు సంకెళ్లు వేసింది. ఆమె గురించి తప్ప మరొక స్త్రీ గురించి ఆలోచించలేడు పాల్. రాత్రుళ్లు నడుస్తున్నప్పుడు వీధుల్లో పరచుకున్న భవనాలనీడలు తల్లినే తలపిస్తాయి. దీనిని అధిగమిస్తే తప్ప స్వేచ్ఛరాదు.

★ ★ ★

'మా అమ్మ బతికుంటే నిన్ను ప్రేమించేవాణ్ణి కాను. అమ్మ అందుకనుమతించేది కాదు' అన్నాడట లారెన్స్, పెళ్లికి ముందు తన ప్రేయసి ఫ్రీడాతో. అతడి మీద తల్లి ప్రభావం అంత ఎక్కువ. ఏ యువతితోనూ తనకొడుకు ప్రేమలో పడకుండా జాగ్రత్తపడింది. తల్లికి క్యాన్సర్ వచ్చిందని తెలిసి, ప్రచురణకర్తల్ని తన నవల 'ది వైట్ పీకాక్'ను త్వరగా ప్రచురించమని వేడుకున్నాడు లారెన్స్. ఆమె కోరిక మేరకు రచయితగా తనను లోకం గుర్తించిందని తెలుసుకుంటే ఆమె సంతోషిస్తుంది. పుస్తకం విడుదల కాలేదుగాని, ఆమె మరణించటానికి, కొన్నిరోజులు ముందు ప్రత్యేకంగా ముద్రించిన ఒక ప్రతిని ఆమె చేతుల్లో పెట్టాడు లారెన్స్.

'సన్స్ అండ్ లవర్స్'లోని తల్లీకొడుకుల సంబంధాన్ని అర్థం చేసుకోవటానికి ఈ సంఘటనలు దోహదం చేస్తాయి.

– ఎం. వసంత

# చెరసాలలో రాసిన అమూల్యగ్రంథాలు

అమూల్యమైన కాలం విలువను గుర్తించిన ఎందరో గొప్ప వ్యక్తులు తాము ఎక్కడున్నా దాన్ని సద్వినియోగం చేసుకున్నారు.

★ దేశ స్వాతంత్ర్య పోరాటంలో గాంధీజీని అనేకసార్లు బ్రిటిష్ ప్రభుత్వం చెరసాలలో పెట్టింది. ఎరవాడ జైలులో కారాగారవాసంలో తన స్వీయ చరిత్రను ఆయన రాశారు.

★ నెహ్రూ జైలులో ఉన్నప్పుడే తన స్వీయ చరిత్ర, ప్రపంచ చరిత్ర, 'డిస్కవరీ ఆఫ్ ఇండియా' తదితర పుస్తకాలతో పాటు తన కూతురికి అనేక ఉత్తరాలను రాశారు.

★ బర్మాలోని మాండలే జైలులో ఉన్నప్పుడు బాలగంగాధర తిలక్ భగవద్గీతపై వ్యాఖ్యాన గ్రంథం 'గీతా రహస్యం' రాశారు.

★ దాదాపు పదహారేళ్లపాటు జైలులో ఉన్న మన మొట్టమొదటి రాష్ట్రపతి బాబూ రాజేంద్ర ప్రసాద్ స్వీయ చరిత్రను జైలులోనే రాశారు.

★ రాంచీలో నిర్బంధంలో ఉన్నప్పుడు మౌలానా అబుల్ కలామ్ అజాద్ తన అనుభవాలను 'తజ్కిరా' అనే పుస్తకంగా రాశారు. అలాగే మహమ్మదీయుల పవిత్ర గ్రంథం ఖురాన్‌పై 'తర్‌మనూల్ ఖురాన్' అనే వ్యాఖ్యానం రాశాడు.

★ దేశాభిమాని చిదంబరం పిళ్లై కారాగార వాసాన్ని అనుభవిస్తూ 'బాలగంగాధర తిలక్ జీవిత చరిత్ర' రాశారు. అలాగే జేమ్స్ ఎలెన్ రాసిన 'ఎ మ్యాన్ థింకెత్' అనే గ్రంథాన్ని తమిళంలోకి అనువదించారు. రాజాజీ జైలులోనే 'సోక్రటీసు జీవిత చరిత్ర'ను రాశారు.

★ 1942లో 'క్విట్ ఇండియా' ఉద్యమంలో నిర్బంధానికి గురైన ఎస్.డి.సుందరం జైలులో ఉంటూ 'కవియిన్ కనవు' అనే ప్రసిద్ధ నాటకం రాశారు. ఇది చాలాసార్లు ప్రదర్శితమయింది.

★ ప్రపంచ ప్రసిద్ధ భారతీయ మేధావి ఎం.ఎన్.రాయ్ కారాగారంలో 'ఫ్రాగ్మెంట్స్ ఆఫ్ ఎ ప్రిజనర్స్ డైరీ'ని రాశారు. దీనికి ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపకులపతి సి.ఆర్.రెడ్డి పీఠిక రాశారు.

★ లోక్‌నాయక్ జయప్రకాష్ నారాయణ్ జైలులో రాసిన 'ప్రిజన్ డైరీ' జపనీస్ భాషలోకి తర్జుమా అయింది.

★ వి.వి.ఎస్ అయ్యర్ బళ్లారిజైలులో కంబ రామాయణాన్ని ఆంగ్లంలోకి అనువదించారు.



★ లాల్‌బహదూర్ శాస్త్రి జైలులో ఉండగానే 'మేడమ్ క్యూరీ జీవిత చరిత్ర'ను హిందీలోకి అనువదించారు.

★ రెండో ప్రపంచయుద్ధానికి ముందు సుభాష్ చంద్రబోస్ యూరప్‌లో నిర్బంధ జీవితాన్ని గడుపుతూ 1935లో 'ది ఇండియన్ స్ట్రగుల్' అనే గ్రంథాన్ని రాశారు. దీన్ని ఆంగ్ల ప్రభుత్వం నిషేధించింది.

★ ఆంధ్రుడైన డా. పట్టాభి సీతారామయ్య నెల్లూరు జైలులో శిక్షననుభవిస్తూ 'హిస్టరీ ఆఫ్ ఇండియన్ నేషనల్ కాంగ్రెస్'రాశారు.

★ మనరాష్ట్ర ముఖ్యమంత్రిగా పనిచేసిన బెజవాడ గోపాలరెడ్డి స్వాతంత్ర్యోద్యమంలో అనేకసార్లు జైలుశిక్ష అనుభవిస్తూ రవీంద్రనాథ్ టాగూర్ గ్రంథాలను తెలుగు చేశారు.

★ ఉన్నవ లక్ష్మీనారాయణ సాంత్రత్ర్యోద్యమంలో కారాగారంలో ఉంటూ రాసిన అపూర్వమైన తెలుగు నవలే 'మాలపల్లి'.

★ రష్యాలో జార్ ప్రభుత్వాన్ని వ్యతిరేకించినందున 1895లో లెనిన్ జైలుపాలయ్యాడు. ఆ కాలంలో ఆయన 'ది డెవలప్‌మెంట్ ఆఫ్ కాపిటలిజం ఇన్ రష్యా' అనే గ్రంథం రాశారు.

★ సర్ వాల్టర్ రాలీ పన్నెండేళ్లపాటు టవర్ ఆఫ్ లండన్‌లో నిర్బంధ జీవితాన్ని గడుపుతూ 'ప్రపంచ చరిత్ర' రాశారు.

★ విక్టర్ హ్యూగో ప్రసిద్ధ ఫ్రెంచి నవల 'లే మిజరాబ్స్' చెరసాలలో రాసినదే.

సేకరణ: ఎ.రాంబాబు

# ఎర

- వాణిశ్రీ

రాత్రి పదకొండున్నరయింది. చుక్కమ్మ మిలిటరీ హోటల్లో గిరాకీ లేదు. ఆ తాటాకుల పాక హోటల్ కొండమల్లేపల్లి శివారులో రోడ్డు పక్కన ఉంది. బంగాళాఖాతంలో అల్పపీడనం వలన సన్నగా వర్షం పడుతోంది. ఇక గిరాకీ ఏమీ ఉండదని నిశ్చయానికి వచ్చేసిన చుక్కమ్మ రమేష్‌తో తలుపు మూసెయ్యమన్నది.

రమేష్ తలుపు మూస్తూ ఉండగా బైట బైక్ ఆగిన చప్పుడైంది. అతను రఫ్‌గా కనిపించాడు. చిన్న గడ్డం ఉంది. కళ్ళు ఎర్రగా ఉన్నాయి.

'ఏదో బేరం తగిలిందనుకున్నాడు' రమేష్.

అది బేరం కాదు. అతను కస్టమర్ కాదు. వాడొక దొంగ. రావడంతోనే మూస్తున్న తలుపు కాలితో తన్నాడు. రమేష్ షర్ట్ పట్టుకుని ప్యాంట్ జేబులో నుంచి వంకీలు తిరిగిన కత్తి తీసి గొంతుకి ఆనించాడు ఆ వచ్చిన మనిషి. కొంచెం వత్తిడి తగిల్తే చాలు ఆ కత్తి కసుక్కున గొంతు

## చతుర కథలు

లోకి దిగుతుంది. రమేష్ హడలిపోయాడు.

"డబ్బెక్కడరా...? " హూంకరించాడు దొంగ.

"అన్నా!... నన్నేం చెయ్యకు. డబ్బు అందులో ఉంది" అని కౌంటర్ వైపు చెయ్యి చూపించాడు.

దొంగ తలుపు మూసి గడియ పెట్టాడు. కౌంటర్‌లో ఉన్న డబ్బుతీసి ప్యాంట్ జేబులో కుక్కుకున్నాడు. డబ్బు దొరికే సరికి అతని ముఖం ప్రశాంతంగా మారింది. హోటల్‌ని నలువైపులా పరికించి చూశాడు. మిలిటరీ హోటల్ కావడంతో మసాలా వాసన ముక్కుకి తలిగింది.

"తినడానికి ఏముందిబే...!" అన్నాడు ఒక టేబుల్ ముందు సెటిలైపోయి.

"అన్నా! చికెన్ ఫ్రై, మటన్ కర్రీ, చేపల పులుసు ఉన్నాయన్నా!" చెప్పాడు రమేష్.

దొంగకి నోట్లో నీళ్ళూరాయి.

"అన్నీ... తీసుకురారా...!" అన్నాడు.

"సరే అన్నా!"

"హోటల్లో ఇంకెవరున్నార్రా? నువ్వొక్కడి వేనా....? " పరికించి చూస్తూ అడిగాడు.

అంతలో చుక్కమ్మ తన గదిలో నుంచి బైటకు వచ్చి నిల్చుంది.

రమేష్ ఆమెను గమనించి, ముందుకు వంగి, "అన్నా! చుక్కమ్మ ఒంటరిగా ఉంది " అని వంకరగా నవ్వాడు.

రమేష్ దొంగకి బాగా నచ్చాడు. చుక్కమ్మవైపు చూశాడు. ఆమెకు నలభై ఏళ్ళు దాటినా అందంగానే కనిపిస్తోంది. శరీరం బిగువుగా ఉంది.

"అరేయ్! మందు ఉందా? " అడిగాడు దొంగ.

"లేదన్నా! కస్టమర్లు తెచ్చుకుని తాగుతారు. దగ్గర్లోనే వైన్‌షాపుంది. తెమ్మంటావా అన్నా!" అన్నాడు రమేష్.

"అరేయ్ బేవకూఫ్. నేనేం తెలివితక్కువ దద్దమ్మననుకుంటున్నావా? నిన్ను బైటకు పంపించనీకి. నువ్వేం తేవొద్దు. నా దగ్గరే ఉంది మందు. గ్లాసు పట్టుకురా!" అన్నాడు ప్యాంటు జేబులో నుంచి క్వార్టర్‌బాటిల్ తీసి టేబుల్‌పైన పెడుతూ.

"గాజు గ్లాసులు లోపల ఉన్నాయన్నా!" అని రమేష్ చుక్కమ్మ గదిలోకి వెళ్ళాడు.

చుక్కమ్మ వాని మీద మండిపడింది

"అరే ఎదవా! నేను ఒంటరిగా ఉన్నానని వాడితో చెబుతున్నావేంటి? పిచ్చిపిచ్చిగా ఉందా? " అన్నది.

"నువ్వు జీతం పెంచమంటే పెంచడం లేదు. అందుకే నీ మీద కోపంగా ఉంది. ఆ దొంగోడు నీ కొవ్వు కరిగిస్తాడ్లే...!" అన్నాడు రమేష్ నవ్వుతూ.

చుక్కమ్మ తిట్లు పట్టించుకోకుండా రమేష్ గాజుగ్లాసు కడిగి టేబుల్ మీద పెట్టాడు. దొంగ క్వార్టర్ బాటిల్ సీసా మూత తీసి గ్లాసులోకి వంచుకున్నాడు.

"అన్నా! ఐస్ వెయ్యమంటావా? సోడాగూడా ఉంది" అన్నాడు వినయంగా

"ఐస్.. సోడా ఉన్నాయా? వెయ్యి..." అన్నాడు.

రమేష్ గ్లాసు తీసుకెళ్ళి ఫ్రిజ్‌లో నుంచి ఐస్‌క్యూబ్స్ వేసి సోడా పోశాడు.

రమేష్ నాన్-వెజ్ డిష్‌లు తెచ్చి పెడుతుంటే, దొంగ మందు తాగుతూ తింటు న్నాడు. క్వార్టర్ బాటిల్ పూర్తవుతూ ఉంది.

"అరేయ్! నేనసలు మందు తాగాలనుకోలేదురా! నువ్వు చుక్కమ్మని చూపించేసరికి నిషా ఎక్కింది. మందు తాగి తేనే ఆడదాని దగ్గర మజా... మజా...! నువ్వు మంచో డివి..!" అంటూనే కళ్ళుమూ శాడు.

అతని తల టేబుల్ మీదకి వాలిపోయింది. రమేష్ దొంగని కాలితో ఒక్కతన్ను తన్నాడు. కుర్చీలో నుంచి జా రి నేలమీద పడ్డాడు దొంగ. చప్పుడికి చుక్కమ్మ బైటకు వచ్చింది. ఆమె ఆశ్చర్యంతో చూడసాగింది.

"ఏంట్రా.. పడిపో యాడు? " అంది చుక్కమ్మ.

"నీ బొంద. నేనే పడేశా! పోలీస్ స్టేషన్ నెంబర్ రాసి ఉంచుకోమని నీకెన్నిసార్లు చెప్పాను. ఉండు, ఇప్పుడే వస్తా. వైన్‌షాపువాళ్ళకి తెలుసు" అని తుర్రుమన్నాడు రమేష్.

కాసేపటికి పోలీసులు వచ్చి ఆ దొంగని వ్యాన్ ఎక్కించి తీసుకుపోయారు.

"వాడేందిరా! క్వార్టర్ తాగి పడిపోయాడు? " అన్నది చుక్కమ్మ.

"క్వార్టర్ మందుకే ఎవడైనా పడిపోతాడా? " అన్నాడు రమేష్.

"మరి"

"ఆ మందులో నువ్వేసుకునే నిద్రమాత్రలు కలిపాను. అవి నువ్వు ఫ్రిజ్‌లో పెట్టవుగా" అన్నాడు రమేష్



చుక్కమ్మకి అప్పుడు అర్థమైంది, దొంగోడికి తనను ఎరగా చూపించి తాగించాడని. వాడి సమయస్ఫూర్తికి మెచ్చుకుంది.

"నీకు జీతం పెంచుతాలేరా!" అంది చుక్కమ్మ.

©

# కాపీ కథ

**- శ్రావ్య**



కృష్ణమూర్తికి రోజూ మార్నింగ్‌వాక్‌కు వెళ్లడం ఎంత అలవాటో తెలుగు, ఇంగ్లిష్ పేపర్లతోపాటు ఆ రోజు వచ్చిన మేగజైన్స్ కొనడం అంత అలవాటు. పిల్లల పత్రికల నుంచి వారపత్రికలు, మాసపత్రికలు, రకరకాల అంశాల మీద వచ్చే విభిన్న పత్రికలు పాతా-కొత్తా లేకుండా కొంటుంటాడు.

నిజం చెప్పాలంటే- అన్ని పత్రికలు చదివేంత తీరిక ఉండటానికి కృష్ణమూర్తి ఇంకా రిటైర్ కాలేదు. యాభై ఏళ్లు దాటాయంతే.

చిన్నప్పటి నుంచి అతని తండ్రి చేసిన అలవాటది. అలాగని కృష్ణమూర్తికి కథలు, కవిత్వాలు రాసే అలవాటు లేదు. చదవడంలోని ఆనందాన్ని సంపూర్ణంగా అనుభవిస్తుంటాడంతే.

టిఫిన్ చేస్తున్నా, భోం చేస్తున్నా దాంతోపాటు పత్రికలోని కథ నంజుకుంటుంటాడు.

హైదరాబాద్ నుంచి సిద్ధిపేట వెళ్లే దారిలో ఉన్న ఓ ఫ్యాక్టరీలో హెచ్.ఆర్. మేనేజర్‌గా పని చేస్తున్నాడు కృష్ణమూర్తి. ఆఫీసుకి తీసుకెళ్లి, తీసుకురావడానికి కంపెనీ కారు, డ్రైవర్ ఉన్నారు.

ఆ జర్నీటైమ్ ఒక్క క్షణం వృథా చేయడు కృష్ణమూర్తి. మేగజైన్స్ చదువుతుంటాడు.

ఆ రోజు కూడా ఓ మేగజైన్‌లో కథ చదువుతుంటే అన్పించింది కృష్ణమూర్తికి- ఆ కథ అంతకుముందు ఎప్పుడో చదివానని. కథ బాగుంది కానీ అదో కాపీ కథ. దానిపేరు 'రిపీట్'.

రచయిత పేరు చూశాడు. ఎవరో కొత్త రైటర్. మేగజైన్ పక్కన పడేసి, కళ్లు మూసుకుని ఆలోచించాడు. ఎప్పుడో 1987లో తను కాలేజీకి వెళుతున్న రోజుల్లో ఆ కథ చదివిన గుర్తు.

బుర్ర బద్దలు కొట్టుకున్నంత పని చేసి, ఆ కథ తాలూకు వివరాలు గుర్తు చేసుకున్నాడు. అప్పటి ఆ కథ పేరు 'పునరావృతం'. రచయిత పేరు శ్యామ్ ప్రసాద్ ముఖర్జీ. ఆ కథని పబ్లిష్ చేసిన పత్రిక పేరు, కథ ప్రింటయిన నెల లీలామాత్రంగా గుర్తు చేసుకున్నాడు. అన్ని వివరాలు గుర్తొచ్చాక ఇక ఊరుకోలేక పోయాడు.

ఆఫీసుకెళ్లాక, తీరిక సమయంలో ఇప్పుడు ఆ కథని ప్రింట్ చేసిన పత్రికకి పాత కథ వివరాలన్నీ రాసి పంపించాడు.

కృష్ణమూర్తి రచయిత కాకపోయినా, ఓ కథని క్రియేట్ చేయడానికి, రాయడానికి ఓ రచయిత ఎంత స్ట్రగుల్ చేస్తాడో అర్థం చేసుకున్న వ్యక్తి. ఆ బాధతోనే ఆ ఉత్తరం రాశాడు.

మూడు వారాల తర్వాత... కృష్ణమూర్తి ఆఫీసుకి వెళ్లేటప్పుడు ఆ వీక్లీలోని పాఠకుల లేఖల కాలమ్ చూశాడు. అందులో కృష్ణమూర్తి లెటర్ తోపాటు, రచయిత సంజాయిషీ ప్రచురించారు.

రచయిత సంజాయిషీ చదువుతుంటే, కృష్ణమూర్తి కళ్లు ఆశ్చర్యంతో విచ్చుకున్నాయి.

"నేను రాసిన కథ 'రిపీట్' అనేది 1987లో వచ్చిన 'పునరావృతం' కథకి పూర్తి కాపీ. ఈ విషయాన్ని మీ దృష్టికి తీసుకొచ్చిన కృష్ణమూర్తిగారిని నేను జీవితాంతం మరచిపోలేను. మీరు దయచేసి కృష్ణమూర్తి వివరాలు పంపిస్తే త్వరలో రాబోతున్న నా కథల సంపుటిని ఆయనకే అంకితం ఇవ్వాలనుకుంటున్నాను.

ఎందుకంటే- ఆ కథ ఒరిజినల్ రైటర్ శ్యామ్ ప్రసాద్ ముఖర్జీని నేనే. ఎప్పటి నుంచో మా ఇంట్లోవాళ్లు, కొద్దిమంది మిత్రులు నా కథల సంపుటిని అచ్చు వేయించమని కోరుతున్నారు.

పెద్దాయన ముళ్ళపూడి వెంకటరమణ గారన్నట్లు పత్రికల్లో పడే కథలన్నీ అప్పడాలు, వడియాల్లాంటివి. ఆ క్షణానికే కరకరలాడుతూ రుచిగా ఉంటాయి. మాపటికి దాచుకుని తిందామంటే, మెత్తబడిపోయి, నోరు పాడైపోతుంది.

ఎప్పుడో రాసిన కథలు- ఈ తరం పాఠకులకి అవసరమా? అసలు నేనో రచయితని అని కాక, నా కథ కానీ, ఈ ప్రపంచంలో ఒక్కడికైనా గుర్తుంటుందా అనుకున్నా. ఒకవ్యక్తికి నా కథ గుర్తున్నా, నా కథల సంపుటి తీసుకు రావాలనుకున్నాను. ఆ కుతూహలంతోనే నేను చేసిన తప్పు ఇది. నా కథని నేనే కాపీ కొట్టి, పంపించాను, నా కలం పేరు మార్చేసి. కచ్చితంగా ఇది తప్పే! నన్ను మన్నించండి. మీకు కలిగించిన అసౌకర్యానికి చింతిస్తున్నాను. పారితోషికాన్ని వెనక్కి తిప్పి, పంపిస్తున్నాను.

మళ్లీ నేను కొత్త కథ రాయకపోయినా బాధ లేదు. నా పాత కథల్ని గుర్తుంచుకునే పాఠకులున్నారు ఇంకా.. అది చాలు!

ఇట్లు
శ్యామ్ ప్రసాద్ ముఖర్జీ"



# పాపం ఆంజనేయులు

– ఆకెళ్ల వెంకట సుబ్బలక్ష్మి



ఆ రోజు ఆంజనేయులు పుస్తకావిష్కరణ జరిగింది. వచ్చిన వాళ్లందరికీ చాలా ఘనంగా స్వీటు, కారాలు పంచిపెట్టాడు. స్నేహితులు బంధువులు చాలా మంది వచ్చారు. అందరూ అభినందనలు తెలియజేశారు. దండలు, పొగడ్తలతోటి ఉబ్బితబ్బిబ్బు అయ్యాడు. వచ్చినవాళ్లందరికీ పుస్తకాలు పంచిపెట్టాడు. మొహమాటం వల్ల కొన్ని, తప్పక కొన్ని, ఉత్సాహం వల్ల కొన్ని ఇలా చాలా పుస్తకాలు ఉచిత పంపిణీ అయిపోయాయి. ఏమయినప్పటికీ ఖర్చు చాలా అయినా అందరూ పొగడడం, మరునాడు అన్ని పేపర్లలో రావడంతో చాలా ఆనందించాడు.

నెలయ్యింది. ఆ రోజు ఆదివారం. ఆంజనేయులుకి రాసే అలవాటే కాక, చదివే అలవాటు కూడా ఎక్కువే. కొత్త పుస్తకాలు కొన్ని కొంటూనే ఉన్నా, ఆదివారాలు చిక్కడపల్లి, కోఠీలలో పెట్టే సెకండ్ హేండ్ పుస్తకాలు కూడా కొంటూనే ఉంటాడు. అందువల్ల రెండు లాభాలు- ఒకటి పుస్తకాలు చవగ్గా దొరకడం, రెండు ప్రస్తుతం అందుబాటులో లేని పాత పుస్తకాలు దొరకడం. పుస్తకాలు చూడసాగాడు.

"ఈ పుస్తకం చూడండి సార్. మీరు లక్కీ. కొత్త పుస్తకమే అయినా ఇది పాత పుస్తకం రేటుకి వస్తోంది" అన్నాడు పరిచయం ఉన్న పుస్తకాలమ్మే కుర్రవాడు, ఒక పుస్తకం చూపిస్తూ. అటు చూసిన ఆంజనేయులు మొహం పాలిపోయింది. అది నెల క్రితం రిలీజైన తన పుస్తకమే. పాపం ఆంజనేయులు!

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**కంజర్ల అనంతాచార్యులు**

ఇం. నెం. 6-6-35, టుక్కవాడ, జగిత్యాల (మం), కరీంనగర్ జిల్లా పిన్: 505 327

# చతురంగం - 26 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ప్ర | ణ | 2 యం | | 3 శు | భ | 4 లే | ఖ | | 5 క |
| ణ | | 6 ప్రా | 7 రం | భం | | ఖి | | 8 క | ల |
| 9 వం | 10 ద | | భ | | 11 ము | ని | 12 వా | టి | క |
| | 13 ర | 14 ద్దు | | 15 ర | గ్గు | | మ | | లం |
| 16 వి | హా | ర | 17 ము | | 18 రు | 19 మ | | 20 క | |
| 21 హా | సం | | 22 రా | త్రి | | 23 క | మ | లి | 24 ని |
| య | | 25 క | రి | | 26 వ | రి | | 27 మి | తి |
| 28 సం | 29 ఘ | వి | | 30 వె | ల | | 31 శ్రీ | | న్ |
| | 32 రా | త | 33 ల | త | | 34 క | ల | 35 రా | |
| 36 రా | నా | | 37 తు | లు | సు | | 38 త | మా | షా |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. డాక్టర్ శివభూషణం, నరసింహరావుపేట, కర్నూలు, 2. కణుగుల గ్రీష్మ, శ్రీకాకుళం, 3. సాధనాల పద్మావతి, భవానీపురం, విజయవాడ, 4. పొనుగోటి నరసింహరావు, టోలీచౌకి, హైదరాబాదు, 5. టి. శ్రావణీరాఘవేందర్, సంగారెడ్డి, మెదక్ జిల్లా, 6. కరణం శివానందరావు, బెంగళూరు, 7. నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం, 8. బి. అరుణరేఖ, చందానగర్, హైదరాబాదు, 9. బచ్చులక్ష్మి, కొత్తగూడెం, 10. ధరణి పద్మాసన, హైదరాబాదు, 11. కృష్ణకుమారి ద్రైతా, ఎ.ఎస్. రావ్‌నగర్, హైదరాబాదు, 12. యల్లాప్రగడ కృష్ణమూర్తి, అలకాపురి, హైదరాబాదు, 13. దయాళం రవి, తమిళనాడు, 14. సి. అల్వాల్ రెడ్డి, సరూర్‌నగర్, హైదరాబాదు, 15. పి. దేవసేనమ్మ, వెంగళరావు నగర్, హైదరాబాదు, 16. ఆర్. చంద్రశేఖర్, చెన్నై, 17. టి. ఉషశ్రీ, దగదర్తి, నెల్లూరు జిల్లా, 18. తిప్పావఝుల వెంకటనారాయణ, మల్కాజ్‌గిరి, హైదరాబాదు, 19. యు. విజయశేఖర రెడ్డి, కూకట్‌పల్లి, హైదరాబాదు, 20. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 21. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, హైదరాబాదు, 22. సి. జనార్ధన సింగ్, నల్లకుంట, హైదరాబాదు, 23. ఆంద్ర అచ్యుత రామయ్య, తణుకు, 24. పక్కి శ్రీదేవి, గరివిడి, విజయనగరం, 25. పి.వి. సుబ్బలక్ష్మి, ఆటోనగర్, వైజాగ్, 26. తల్లాప్రగడ మధుసూదనరావు, బెంగళూరు, 27. యు.యు.యు, ఎమ్మిగనూరు, 28. సి. నిర్మల, తిరుపతి, 29. ఎస్. మణిమేగలై, బైరాగిపట్టెడ, తిరుపతి, 30. కన్నేపల్లి నారాయణమూర్తి, మంగువారితోట, శ్రీకాకుళం, 31. కన్నేపల్లి విజయలక్ష్మి, మంగువారితోట, శ్రీకాకుళం, 32. టి. హేమలత, బలరామునిపేట, మచిలీపట్నం, 33. ఆర్. సుశీల, విజయవాడ, 34. శ్రీమతి సుజాత, గుంటూరు, 35. కె. గ్రీష్మారెడ్డి, మంచిర్యాల, ఆదిలాబాద్ జిల్లా, 36. పి.వి. రమణారావు, మల్కాజిగిరి, 37. అరుణరేఖ ముదిగొండ, బెంగళూరు, 38. పిశిపాటి శైలజ, నవులూరు,39. కె.ఇ. నిలమంగ్రై, మల్కాజిగిరి, 40. సురేందర్ రావు నోముల, హబ్సిగూడ, హైదరాబాదు, 41. గండ్లూరి బలరామశాస్త్రి, నాచారం, రంగారెడ్డి జిల్లా, 42. చెరుకువాడ హర్ష, విజయవాడ, 43. జె. ఇందిర, ట్రూప్‌బజార్, హైదరాబాదు, 44. వి. రెడ్డిశ్రీవాణి, రాయచోటి, కడపజిల్లా, 45. పప్పు శ్రీదేవి, అమలాపురం, తూ.గో. జిల్లా, 46. ఆర్.ఎస్.ఎస్. పంతులు, కాంట్రేనికోన, 47. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో. జిల్లా, 48. గరికిపాటి శ్రీచైతన్యకృష్ణ, ప్రతాప్‌నగర్, కాకినాడ, 49. పబ్బు నిరాలంబమూర్తి, నెల్లూరు, 50. సి. ఉమాబాల, దోమల్‌గూడ, హైదరాబాదు, 51. పెద్ది రాజేశ్వర్, సంగారెడ్డి, 52. శివలెంక మాధవి, మెహదీపట్నం, 53. బి.యస్. రంగ, తాడేపల్లి గూడెం, 54. తోటపల్లి శశికళ, గుంతకల్లు, 55. సి. హెచ్.వి.ఎస్.ఎల్. రాజేశ్వరి, కాకినాడ, 56. వాడపర్తి వెంకటరమణ, విశాఖపట్నం, 57. పి. కృష్ణారావు, మౌలాలి, హైదరాబాదు, 58. టి.ఆర్. బాలకృష్ణ రావు, రాజమండ్రి, 59. కాకర్లమూడి రామలింగమూర్తి, తణుకు, 60. రామకూరు లక్ష్మి, శ్రీకాకుళం, 61. ఆర్.వి.సి. హెచ్ నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 62. ఎ. బాలాజీకుమార్ రెడ్డి, యర్రగుంట్ల, కడప జిల్లా, 63. వాసా కృష్ణప్రసాద్, తగరపువలస, విశాఖపట్నం 64. కానుకొలను కస్తూరి, కొండవెలగాడ, విజయనగరం జిల్లా, 65. నేమాని వాణి, ముషీరాబాద్, హైదరాబాదు, 66. మద్దూరి లక్ష్మీరాజ్యం, హైదరాబాదు, 67. ఎమ్. శంకర్, అణుశక్తినగర్, ముంబయి, 68. సౌదామిని నాగరాజన్, విశాఖపట్నం, 69. తిరునగరి శ్రీదేవి, గుంటూరు, 70. అనంతుల సుబ్బారావు, గుంటూరు, 71. పి. సీతారత్నం, నర్సాపూర్, 72. కరణం సుధీంద్రరావు, కర్నూలు, 73. కండె రాధ, భీమదేవరపల్లి, కరీంనగర్, 74. పి.ఎల్.ఎన్. ప్రభావతి, వనస్థలిపురం, 75. కె.వి. దుర్గామోహనరావు, వనస్థలిపురం, 76. వి.వి. సత్యనారాయణ శెట్టి, బైరాగిపట్టెడ, తిరుపతి, 77. టి. సుందరరామయ్య, రాజమండ్రి, 78. సూరి నాగరాజు, బెంగళూరు.

# చతురంగం - 27 ఆధారాలు

**అడ్డం**

1. ప్రస్తుతం నడుస్తున్న తెలుగు సంవత్సరం (3)
3. పెట్టె - మొదట్లో మందంగా ఉంటుంది (3)
5. సినీ విలన్ కదా! తిరగబడ్డాడు (2)
7. తమిళులు సుబ్రహ్మణ్యస్వామిని తలవడమిలా (3)
8. ఈటీవీ2లో గంటగంటకీ వచ్చే వార్తలు (4)
10. పెళ్లికొడుకు - అల్లు అర్జున్ సినిమా (3)
12. పట్టణం (2)
14. స్త్రీ (2)
15. కత్తి (4)
16. ఉర్దూలో తండ్రి అటునుంచి (2)
17. వ్యాపారం (3)
19. ఎన్టీఆర్, జమున హిట్ సినిమా.. అటునుంచి (2)
20. బైక్ మీద ఇలా వెళ్తారు, ఇటీవలే వచ్చిన ఓ సినిమా (2)
21. భార్య (2)
23. కొత్తవి కావు (3)
26. బాలనాగమ్మలో మాయల ఫకీర్ ప్రియురాలు (2)
28. కోకిల (2)
30. చేదుకి మారుపేరీ చెట్టు (2)
31. మూడు చక్రాల తొక్కుడు బండి (2)
33. వాదన చేసేవాడు అటునుంచి (2)
35. సత్తువ (2)
36. తడబడిన రాచరికపు విసనకర్ర (4)
38. చోళీ తెలుగులో (3)
40. నాగచైతన్య సినిమా.. అటునుంచి (2)
41. పెరుగులో సముద్రం (3)
42. ఘాటైన కూరదుంప (3)

**నిలువు**

1. తెలుగు సంవత్సరాల్లో రెండోది (3)
2. సమవర్తి (3)
3. తిరుమల స్వామివారి దేవేరికి నెలవు (5)
4. కలియుగంలో దీనిదే బలమంటారు (2)
5. మురళీమోహన్ హిట్ సినిమా (5)
6. ప్రాణం (2)
9. హిందీలో కుమారుడు కింద నుంచి (2)
11. శ్రీకృష్ణుడి భార్య (3)
13. సముద్రం తలకిందులైంది (4)
17. కాకి (3)
18. అగ్నిలో పోసేది కిందనుంచి (2)
20. ఆదిత్యుడు (2)
22. రాత, అక్షరాలు (2)
24. ఒప్పునకు వ్యతిరేకం (2)
25. బాలిక (2)
27. దీని కింద అంతా నలుపే (4)
29. ఒకరకం పప్పుదినుసు (2)
30. డబ్బుంటేనే ఈ పాట పాడగలుగుతాం (2)
32. సబ్బు గుణం (2)
34. వంతెన (3)
35. కొంగ (3)
36. ఆనవాలు (2)
37. పార్వతీదేవి తిరగబడింది (2)
39. వేమనను ఇలా అంటారు (2)

**నిబంధనలు**

✦ చతురంగాన్ని అదేపేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలింపబడవు. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

చతురంగం పంపాల్సిన చిరునామా :

**చతురంగం** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ -082

★ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు

★ చతురంగం, చతురప్రవేశిక, విపుల వినోదిని ఒకే కవరులో పంపినా పరిశీలిస్తాం.

# చతురంగం - 27

రూ.150/- బహుమతి

గడువు తేది : జూన్ 17



పంపినవారి పేరు: ------------------------------------

వయసు (      ) చిరునామా : ------------------------------

------------------------------------------------------

---------------- పిన్ : ---------- ఫోన్ : --------------

ఆధారాలు, నిబంధనలు 129 పేజీలో...

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. www.eenadu.net.

# మా తొలినవలే వంశీ సినిమా



మా అభిమాన 'చతుర' 35 వసంతాలు పూర్తిచేసుకుని 36లోకి ప్రవేశించడం చాలా చాలా ఆనందంగా ఉంది. కార్టూనిస్ట్ ఎం.ఐ. కిషన్‌తో కలిసి 'చతుర'లో నేను రాసిన తొలినవల 'హరిశ్చంద్రుడే అబద్ధమాడితే' 1989 ఆగస్టులో అచ్చవడం ఓ గొప్ప మధురానుభూతి. ఇప్పటికీ ఆ అనుభవాన్ని తలచుకుంటుంటే ఒళ్లు పులకరిస్తుంది. మరి కిషన్‌కు ఎలా ఉంటుందో అడుగుదామంటే- ఆయన లేరే. ఇంద్రలోకంలో ఆస్థాన హాస్య రచయిత పదవి వచ్చి స్వర్గానికి వెళ్లిపోయారు.

'హరిశ్చంద్రుడే అబద్ధమాడితే' అచ్చవటం, అది 'ఏప్రిల్ 1 విడుదల' సినిమాగా రావటం, నేను సినీ రచయితగా గుర్తింపు పొందటం.. ఇదంతా 'చతుర' పుణ్యమే! అప్పటి నుండి ఇప్పటిదాకా 'చతుర'లో నేను రాసిన పదహేను నవలలు అచ్చవటం నా అదృష్టం, సుకృతం!

– కోలపల్లి ఈశ్వర్,
హాస్యరచయిత, నెల్లూరు

# సరస్వతి రెండు చేతులు చతుర విపుల !

చతుర, విపుల నా అభిమాన పత్రికలు. ఆ రెంటిని తెలుగు సరస్వతి రెండు చేతులుగా భావిస్తాను నేను. ఒక పూర్తి నవలను, ఇంకా ఎన్నో ఆసక్తిదాయకమైన విషయాలతో పాటు పాఠకులకు షడ్రసోపేతమైన విందు చేస్తుంది చతుర.

అలాగే ప్రపంచ సాహిత్యాన్ని తెలుగు పాఠకులకే కాదు వర్ధమాన రచయితలకు కూడా పరిచయం చేస్తూ తెలుగులో వైవిధ్య భరితమైన రచనలు వెలువడడానికి పునాది వేసింది విపుల. ఈనాటికీ చతుర, విపుల సర్వాలంకారశోభితంగా మన ముందుకు వస్తున్నాయంటే వాటిని మామూలు పత్రికలుగా కాక తమ ముద్దుల పుత్రికలుగా భావించే సంపాదకులు ఉండబట్టే అనేది నా ప్రగాఢ విశ్వాసం.



నా మొదటి కథ విపులకు ఎంపికైనపుడు నేను పొందిన ఆనందం వర్ణనాతీతం. 'వడగళ్ల వాన' అనే ఆ కథ పేరునే నా కథల సంకలనానికి పెట్టాను. అలాగే నేను స్వయంగా ప్రచురించిన 'సేతురహస్యం' తర్వాత నవల 'మృత్యురహస్యం' కూడా చతురలోనే ప్రచురణకు నోచుకోవడం నాకు డబుల్ బోనాంజాలా లభించింది. సరస్వతీ దేవి రెండు చేతులతో నన్ను ఆశీర్వదించినట్లుగా భావించాను.

ముప్పై ఆరో వసంతంలోకి అడుగిడిన నా అభిమాన పత్రికలు మరెన్నో వసంతాలు జరుపుకుంటూ నిత్యనూతనంగాను, నవనవోన్మేషంగాను వెల్లివిరిసి తెలుగునాట ఎనలేని కీర్తి పతాక ఎగురవేయాలని మనసారా కోరుకుంటున్నాను.

– శ్రీగంగ,
రచయిత, హైదరాబాద్

